మంజువాణీ గ్రంథమాల—1

# గుప్తయజ్ఞము

నిడుమోలు కనకసుందర



వెల రు 0—12—0

అర్పితకృతులు

మాజననీజనకులు

శ్రీ

సీతారాములు.

# మనవి.

ఈ చిన్నిపొత్తమును ఆంగ్ల రచయితలలో సుప్రసిద్ధుఁడగు Dickens యొక్క Tale of Two Cities అను నవల ననుసరించి సుమారు పదునాల్గేండ్ల క్రిందట నేను విద్యార్థినై యున్న కాలమున వ్రాసియుంటిని. నేటి కిది మంజువాణీ గ్రంథ మాలా ప్రకాశకుల యాదరమున నచ్చుపడినది. తొలుదొల్త దీనిని సరిచూచిన నా గురువర్యులగు బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రిగారికిని, ప్రకాశకులగు మహారాజశ్రీ నందిరాజు చలపతిరావు పంతులు గారికిని నాకృతజ్ఞతను తెలుపుట కీ మనవి వ్రాసికొంటిని.

ధాతృసంవత్సర విజయ దశమి.
25–10–1936

నిడుమోలు కనకసుందరం.

# కాలవాహిని.

సృష్టి - నిర్మూలనము - పునస్సృష్టి - యిటులె
కాలవాహిని కడగండ్ల గడచి యరుగు.
గగన చుంబిత భూధరాగ్రములు క్రుంగు
ఘన తరుతతి ప్రకీర్ణ కాననముఁ గాలు
అత్యగాధ విభీతవారాసు లింకు
చటుల విద్యుత్సమ ప్రభాపటలి మాయు,
సాంద్ర గాఢాంధకార సంచయము బాయు,
కాలవాహిని నడచు మార్గముల యందు.

♦ ♦ ♦ ♦

వలపు వరుఁగవఁగూడిన వనితశయ్య
భర్తృ గళనాళశోణిత భరితమైన;
పిలిచి పూజించి నిలుపఁగ బిచ్చగాఁడు,
కపట శిశుహంతకోద్యోగ కలుషుఁడైన;
తట్టి లేపును నిద్దుర తగదటంచు
కాలవాహిని సర్వదిగంతమహిమ.

♦ ♦ ♦ ♦

పలుకు పలుకునఁ గులికెడి పక్కి జంట
వేర్పఱుచు బోయని కరమ్ము విఱువలేవె?
కుడుచుటే కాని మే యని గొఱ్ఱెపిల్లఁ
దన్ను డేగ పక్షమ్ముల దరుగలేవె?

నెల పొడువ కొలనున విచ్చు కలువపూలఁ
జించు కరి దీర్ఘ నాసికఁ జిదుమ లేవె?
చలువరాల నిర్మించిన సౌధపంక్తి
బూడిద యొనర్చు నగ్గిని బొదువలేవె?



ప్రాణములు గుప్పిటన్ భారమనక పట్టి
కాలవాహినిఁ బెడదారిఁ గడపఁ గలవా?
చింతిలుచు నిల్చి విభ్రాంతిఁ జేష్టలుడిగి
ప్రకృతి సామ్రాజ్య నాశమ్ముఁ బాడఁగలవా?



# గుప్తయజ్ఞము.

మొదటి ప్రకరణము.

## ప్రయత్నము.

ఏఁబదేండ్ల వయస్సువాఁడు, నెరసిన మీసములును, నున్నగా క్షౌరము చేయఁబడిన గడ్డమును గలవాఁడు, చాలపొట్టిగాఁ గత్తిరింపఁబడిన ముంగుజుట్టు గలవాఁడు, పదిగజములదూరము వఱకు వినఁబడునట్లు టిక్కు టిక్కుమని ధ్వనిఁజేయుచుఁ గోటు జేబున దాఁగియున్న గడియారమునకుఁ దగిలింపఁబడి కోటు బొత్తమునుండి వ్రేలాడు బంగారుగొలుసు గలవాఁడు. జరీ యుత్తరీయపు మడతను, గూర్చున్న కుర్చీపైనుంచి, గట్టిగాఁ జుట్టఁబడిన తెల్లని తలగుడ్డ నెదుటనున్న బల్లపైఁ బెట్టి శిరము నుండి ముఖముపైజారెడి ఘర్మబిందువులఁ జేతనున్న రుమాలుతో నద్దికొనుచు, త్రివిక్రమరావు 'అమ్మాయీ! క్షేమమా?' యని కమలను ప్రశ్నించెను.

కమల పదునాఱేండ్ల చిన్నది. రూపసి. ఆమె త్రివిక్రముని కెదురుగ ద్వారబంధము నానుకొని నిలువఁబడియుండి సవినయముగ 'చిత్తము, దేవుని దయవలన క్షేమమే' యని ప్రత్యుత్తర మొసంగెను.

త్రివి:—అమ్మాయీ! నీవు నన్నెఱుఁగవు. నీ తండ్రికిని నాకును విశేషపరిచయ ముండెడిది. నీ వొకయేఁడాది బాలికవై

యుండఁగ నిన్ను నాయీచేతులయందిడికొని ముద్దాడియుండి నట్లు జ్ఞాపకము వచ్చుచునే యున్నది. కాని యీవిషయముల కేమి? నిరంతరము వ్యాపార నిమగ్నములై మొక్కవోయిన మాబోంట్ల హృదయము లతికఠినములై ప్రేమభావ దూరములైనవి. మానవుల కష్టనష్టముల కవి చలింపవు. వారి భాగ్యోదయముల కవి యుప్పొంగవు. కాని యౌవన వతివై భావోద్రేకమును బ్రతిఘటింపఁగల మనోదార్ఢ్యములేని సుకుమారివై, దల్లిదండ్రులపుడే పరలోకగతులైరను నమ్మకముతో బాల్యమునుండియు బెరిఁగి పెద్దనైన నీవిపుడొక మహాకార్యముఁ జేయుటకు హృదయమును బదిలపఱచికొనుము.

కమ:—అనుగ్రహించి యాకార్యమేదియో సత్వరమే సెలవిండు. విచిత్రమగు మీప్రసంగము నాకుమిగులఁ బరితాపముఁ గలుగఁజేయు చున్నది.

త్రివి:—అవును నీకిట్టి పరితాపము పొడసూపకుండ గూడ నీటముఁ జేసికొనుమనియే నేనింతవఱకుఁ జెప్పచుంటిని. విక్రమ పురమునఁ బదునెన్మిది సంవత్సరములు కారాగార నివాసియై, కృశించి శల్యమాత్రావశిష్టుఁడై, బుద్ధితీక్ష్ణతఁ గోల్పోయి, వికలత్వము నందియున్న యొక ముదుసలిని నీ వాత్సల్యముచేతను సపర్యలచేతను మరల మానవమాత్రునిగాఁ జేయవలసియున్నది. ఆతఁడిపు డాయూరనే యొక

పూర్వసేవకు నింటనున్నాఁడు. మన మీా సాయంతన మట కుఁ బయనము కావలెను.

ఈమాటల నాతఁ డనునపుడు కమల శరీరము కంపింపఁ జొచ్చెను. ఆపె గుమ్మమునకుఁ జేరువనున్న కుర్చీపైఁ గూలఁ బడి, భావశూన్యముగ త్రివిక్రముని నుదిటిపైఁ దన తీక్ష్ణ దృక్కులఁ బఱపుచు, శ్రద్ధతో వినుచుండెను. ఆతఁ డట్లు ప్రసంగము నాపఁగనే, కమల యతి దీనముగ 'అయ్యా, పాప మా దురదృష్టవంతుఁడగు వృద్ధుని పూర్వవృత్తాంతము మీా రెఱింగియుండినఁ దెలిపెదరా ?' యని యడిగెను.

త్రివి:—'నీ వడిగితివిగానఁ దెలిపెదను వినుము. ఆతఁడు భువనగిరి నివాసుఁడు. ఆ ప్రాంతములందుఁ బ్రసిద్ధికెక్కిన వైద్యుఁడు'.

కమల యపు డత్యాతురముతో 'అయ్యా, ఆయన నా తండ్రి కాదుగద!' యనెను.

త్రివి:—యథారీతిగనే నిశ్చలుఁడై పలుకఁ జొచ్చెను. 'అమ్మాయీా, నీ మనమును విశేషముగఁ గలవరపెట్టి కొనవలదని ముందే తెలిపియుంటిని. ఈతఁడును నీ తండ్రి వలెనే భువనగిరి నివాసుఁడు. ఈతఁడును నీ తండ్రివలెనే సుప్రసిద్ధ వైద్యుఁడు. ఈతఁడును మీా తండ్రివలెనే మావద్ద ధనమును దాచుకొనుచుండెడివాఁడు. ఈతఁడును మీా

తండ్రివలెనే, యన్యాయముగఁ బదునెన్మిది సంవత్సరములా కిందఁ గారాగారమున కంపఁబడెను. అమ్మా, వినుచుంటివా'.

కమల విస్మితాననముతో నిట్లనెను. "అయ్యా! నా జననీజనకులు నా బాల్యముననే గతించిరని యింతవఱకు నమ్మియుంటినే. మీ మాటలవలన, నా తండ్రి కృశీభూతాంగుఁడైనను, సజీవుఁడై యున్నాఁడను నాశపొడముచున్నది. దయ యుంచి నా మదిని నిశ్శంకముగా నొనర్చి, కుదుటఁ బడ వేయుదురా ? '

త్రివి:—మంచిది. నీ వట్లు ధైర్యముగ మాటాడిన నే నన్ని విషయముల సవిస్తరముగఁ దెలుపఁగలను. నీకేఁడాది నిండకపూర్వమే, నీ తండ్రి యొకనాఁ డదృశ్యుఁడయ్యెను. అతని కొఱకు నీ తల్లి పట్టణములందును బల్లెలందును నధికములగు వ్యయప్రయాసలనంది వెదకించినది. కాని నీ తండ్రి జాడయే యామెకుఁ దెలియలేదు. తుద కామె భర్తపై నిరాశ జేసికొని మనోవ్యథచేఁ గొలఁది కాలము నకే మరణించినది. జనకుఁ డేమయ్యెనా యను మనోవ్యథ బాల్యముననే నిన్నుఁ బీడించి, నీ జీవితమును నిరుత్సాహయుతముగ నొనర్చి, నీ పరిపూర్ణ యావనవికాసమునకు హానికర మగునేమోయను భయమున, నిన్ని పరదేశము నకుఁ గొనితెచ్చి, నీ జననీజనకు లిర్వురు నీ శైశవముననే

గతించిరని నీకు జ్ఞానోదయ మైనప్పటినుండియుఁ జెప్పు చుండిరి. ఏల యిట్లు నిర్ఘాంతపడి చూచెదవు? నీ కేమియు భయములేదు. నీ తండ్రి బోల్నాడు కారాగారమునుండి విముక్తినంది యొక పూర్వసేవకునియింట భద్రముగ నున్నాఁడు. మన మీ సాయంతన మిటనుండి బయలుదేఱి చంద్రోదయ మగుసరికి ధవళగిరిఁ జేరి యచట నావ నెక్కి సముద్రముదాఁటి, సూర్యోదయ మగుసరికి విక్రమ పురమున నీ తండ్రియెదుట నిలువఁగలము, కాని యాతని మతి యిపుడు భ్రాంతమై యున్నది. ఆతని కిపుడు మన ప్రసక్తి లేదు. వెలుఁగును సహింపఁజాలడు. బిగ్గరగా మాటాడ వెఱచును. ఆతనికి బంధవిముక్తి యైనదనుమాట లేదు. కారాగారమునం దున్నపు డెట్లో యట్లే, నిరంత రము బట్టలను గుట్టుచుండును. ఆతనికి మరల జీవముఁబోసి మానవమాత్రునిగాఁ జేయు భారము నీది.'

కమ;—పిశాచ సమ స్వరూపుఁడై యున్నాఁడా నా తండ్రి? పిశాచ స్వరూప సందర్శనమా మనకు?

త్రివి:—అమ్మా, నీవే-మంచిచెడ్డల నన్నిటి నెఱిగిన నీవే-యిట్లధైర్యపడుటయా? వెనుకముందు లరయుము. శాంతి వహింపుము. ఐనను నీకు ముఖ్యముగాఁ దెలుపవలసిన విషయ మింకొకటి కలదు. మనము ప్రయాణము చేయు నపుడు బహు జాగరూకతతో మెలఁగవలెను. నీ తండ్రి

బంధవిముక్తుఁడై, మాఱుపేరున, దాఁగియున్నాఁడు. నా వ్యవహారముల నన్నిఁటిని బహిరంగముగను నిర్భయముగను నడపుకొను నేనే, యీ విషయమున రహస్యవృత్తి నవలంబించి యున్నాను. మనకు విక్రమపురమునఁగల కార్య స్వభావ మితరు లెవరేనియు నెఱిఁగిన మన ప్రయత్నము లన్నియు నిష్ఫలములు కావచ్చును, వీలైనచో నీ తండ్రి నీ దేశమునకుఁ గొనివత్తము. అతఁ డిన్నాళ్ళెట్లొంటరిగఁ గడపెనో, యెట్టి యిక్కట్ల ననుభవించెనో విచారింపబూను టిపు డుచితముగాదు. ఈ విషయమై, యెవరితోఁ గాని, యెచ్చటఁ గాని ప్రశంసింపకుండుటయే సర్వోత్తమమగు మార్గము. అమ్మాయీ, వినుచుంటివా ? యేమది మాటాడవు!—ఆహా, మూర్ఛనందితివి. కమల మూర్ఛిల్లినది ! కమల మూర్ఛిల్లినది ! శీతలోదముఁ దెండు ! తెండు !' ఇట్లనుచు నాతఁడు ్రచివాలున లేచి యామెఁ బట్టుకొనఁ బోయెను. ఇంతలోనే, స్థూలశరీరయు, బీభత్సస్వరూపిణియు నగు నొకయువతి, లోననుండి పరువెత్తికొనివచ్చి, కఠినముగ నిట్లు పలుకఁజొచ్చెను. 'అయ్యో ! నా బిడ్డ మూర్ఛపోయినదా ! అయ్యా, మీరు పెద్దమనుష్యులని తలఁచితిని. ఓరే, భీమన్నా, చన్నీళ్ళు వెంటనే తెమ్ము. ఆలస్యముచేయకు. నా బిడ్డ మూర్ఛపోయినది ! ఆలస్యము చేసిన నిన్ను జంపెదను, అయ్యా, అభము శుభ మెఱుఁ

గని యీ పిల్ల కేమి భయంకరవార్తలు తెలిపినారో కాని స్మృతితప్పి పడినది. చూడుఁడు! మీ కింత వయస్సున్న దామాత్ర మెఱుఁగరా? పైఁగా నీకూనను విక్రమపురికి దీసికొని పోవనున్నారఁట! నాముద్దుబిడ్డ ప్రాణములతో దిరిగివచ్చి నప్పటిమాట!'

ఇంతలో భీముఁడు తెచ్చిన యుదకమును గమల మోమునఁజిమ్మి, యాపె నొక సెజ్జపైఁబరుండఁబెట్టెను.

త్రివి:—నీబిడ్డ కుపచారములు చేయుటకు నీవుకూడ మాతో బయలుదేఱి రారాదా ?

'నీవు చెప్పునదేమి? నాకేమియు రక్తస్పర్శ లేకున్న నీ బిడ్డనువిడచి నేనొక్క నిముసమైన నుండఁగలనా? కమల సీద దేఱి కట్టెదుట నీమొగముఁజూచిన మరల మూర్ఛపోవునేమో! నీవిఁకనడువు'మని నిర్భయముగఁ బరిచారికయగు భైరవి పలికెను.

త్రివిక్రముఁడుత్తరీయమును వల్లెవాటుగ వేసికొని, తల పాగధరించి వీధిగుమ్మముకడనున్న పాదరక్షలఁ దొడిగికొని, సాయంతనము ప్రయాణమునకు సిద్ధముగా నుండుఁడని బిగ్గరగాఁ జెప్పి వెడలిపోయెను.

---

రెండవ ప్రకరణము.

# సాహాయంగడి.

---

విక్రమ పురాంతర్భాగమగు ననంతపదము విచార సాగరమున మునిగియుండెను. అది చలికాలము. జనసముదాయమునకుఁ జలినాపఁగల యున్ని వస్త్రములు దుర్లభములు. అంతియే కాక, యెల్లరి మోములందును, నీరసము, అజ్ఞానము, అసంతుష్టి విస్పష్టముగ గోచరింపుచుండెను. ఎచ్చోటఁ జూచినను ప్రతి వీధియందును, ప్రతి గృహమునందును ప్రతి ముఖము నందును క్షుద్బాధ, అసంతుష్టి, ప్రత్యక్షమగు చుండెను. ప్రతి వస్తువుపైనను 'ఏదియో యనర్థము రానున్న'దని చెక్కఁబడి యున్నట్లు తోఁచుచుండెను. కృశీభూతాంగులగు నాజనుల నేత్రములు గుంటలువడి యుండెనుగాని యా నేత్రములందు రహస్యక్రోధాగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లుచునే యున్నవి. వారి కళావిహీనములగు ముఖములు ముడివడియుండి, కృతనిశ్చయత్వముఁ బ్రకటించుచుండెను. ఏ వస్తువుఁజూచినను నశించుచున్నట్లే యుండెను. కాని కత్తులు కటారులకు మాత్ర మెచ్చటను లోటులేదు. కటిక వానికత్తు లతి తీక్ష్ణముగఁ బదునుగ నున్నవి. కమ్మరిసుత్తె లతిభారముగనున్నవి. శతఘ్ని సమూహము మృత్యుదేవత నాహ్వానించుచున్నది.

ఆవీధి యందొక మూల సారాయంగడికలదు. చుట్టుపట్లనున్న యంగళ్ళకంటె నిది సూమటను గొంచెము గనుగనే యుండెను. ఈయంగడి కధికారి వినాయక గ్రామణి, షుమారు ముప్పది సంవత్సరముల వయసుకాఁడు. పొట్టిమెడవాఁడు. నల్లనివాఁడు. ఆతఁడు సరళస్వభావుఁడై నను జాల పట్టుదలగల వాఁడని యాతని చూపులు తోఁపఁజేయుచుండెను.

ఆతఁ డంగడిలో బ్రవేశించునపుడా తని భార్య, భద్రావతి, ధన పేటిక ముందిడికొని కూర్చుండి యుండెను. భద్ర భర్తకంటె నగసున రెండుమూఁడు సంవత్సరములు చిన్నదే కాని స్థూలశరీరిణి. ఆపె యేరి వంకను జూచుట లేదు గాని సర్వము గమనించుచునే యుండెను. ఆపె చేతులకు భారములగు మురుగులు గాజులుఁ గలవు. నిశ్చలమతియై, భావశూన్యమగు ముఖముతో నాపె సూదితోఁ జిత్రముగ నొక వస్త్రము గుట్టుకొనుచుఁ గూరుచుండి తన భర్త గృహప్రవేశముఁ జేయఁగనే చేతనున్న పరికరముల నెదుటనున్న బల్లపైనుంచి సావకాశముగఁ గుడిమోచేతి నెడమ హస్తమున నుంకొనుచు, కుడిచేతనున్న ఫుడకను పండ్లలోనికిఁ జొన్పి, నెమ్మదిగ నొక సారి దగ్గి, నల్లని కనుబొమల నెత్తి లోచనముల విశాలముగ నొనర్చి, గృహాంగణము నాల్గుమూలల నొక్కసారి పరికింపుమనినట్లు సంజ్ఞఁ జేసెను. గ్రామణి యా యంగడినంతటఁ గలయఁ జూచి, యొకమూల నొదిగి కూర్చుండియుండిన ముదుసలిని,

యౌవన వతియగు యువతిని జూచియుఁ జూడనట్లు నటించి, ధనముఁ జెల్లించుచుండిన మఱి యిర్వురు తాగ్రుపోతులతో మాటాడుచు, భార్య చెంతనే నిలువఁబడియుండెను. ఇంకొక నల్గురు మాత్రి మూయఁగడి యందొక మూల బల్లకడఁ గూర్చుండి పేకాట నాడుచుండిరి. ఆ ముదుసలి, చెంతనున్న యువతితో, నితఁడే. యని మాత్రము నెమ్మదిగ ననెను.

ధనము చెల్లించిన యిరువురును దుకాణమును వదలిపోవఁగనే యా ముదుసలి- త్రివిక్రముఁడు- గ్రామణిఁ బలుకరించి, యొక మాట వినవలయునని కోరెను. ఆతఁడందులకు సమ్మతింప వారిరువురును జెంతనున్న యొక చిన్న ద్వారముకడ నిలచి మాటాడఁదొడఁగిరి. త్రివిక్రముఁ డేవియో రెండు మాటలఁ జెప్పఁగనే, గ్రామణి ముఖమాశ్చర్యాన్వితమై, యాతని నేత్రము లప్రియత్నముగ నా యువతి - కమల- వంకకుఁ దిరిగెను. మఱిరెండు నిముసములైన పిదప త్రివిక్రముఁడు కమలను దమచెంతకు రమ్మని చేసైగఁజేసి పిలచెను. అంతనా ముప్వురా గుమ్మము దాఁటి పెరటిలోనికిఁ బ్రవేశించిరి. భద్రిమాత్రి మెవరిని జూడనట్లే కన్పట్టుచు మరలఁ గుట్టుపని నారంభించెను.

దుర్గంధ యుతమగు నొక గల్లీగుండ నా మూవురును నిశ్శబ్దముగఁ గొంతదూరము సాగిపోయిరి. అంత వినాయక గ్రామణి, తన పూర్వ యజమానుని పుత్త్రికయగు కమల

యెదుట మోకాలిపై నాని కూర్చుండి యాపె కోమలపాదద్వ యమును భక్తి పూర్వకముగ స్పృశించెను. అట్లు చేయు నపుడాతని ముఖమునందు సహజ సరళ స్వభావమదృశ్యమై తీవ్రక్రోధము ఘూర్ణిల్లెను. ఆతని సరస వీక్షణములు కోపా రుణములయ్యెను. యజమానుని సంతతి యెడ భక్తి విశ్వాస ములఁ బ్రకటించు నా సమయమున నెవరి యెడ నాతని వైషమ్యభావము ప్రకోపించెను? ఆతఁడు బాల్యమున శంకర భగవత్పాదుని భృత్యుఁడు. దురాచారపరుఁడగు నొక జమీం దారుని చేఁ నవమానింపఁబడిన నాతి చెల్లెలీతని భార్య. సోదరిని రక్షింప శత్రుప్రాసాదమున కేగి రణమున మడిసిన బాలుఁ డీతని బావమఱఁది !

అట్టి జమీందారుల దుర్మార్గమునకు గుఱియై పదు నెనిమిది సంవత్సరము లేకాంత కారాగృహవాస మొనర్చిన పిదప నిపుడు మానవస్వత్వము గోల్పోయి, విజ్ఞానభ్రష్టుఁడై, జీవచ్ఛవంబువలెనున్న యమాయకుఁడగు శంకర భగవత్పానుని దర్శించినను, ఆతని యవస్థ దలంచినను, మన గ్రామణియు, నాతని భార్యయు, నత్యంత విషణ్ణులై ప్రతిక్రియాన్వేషణా యత్తచిత్తులై కంపించుచుందురు.

అందుచే నాభిషగ్వరుఁ డెట్టకేలకుఁ గారాగృహవిముక్తి నంద వారాతనిఁజేరదీసి, తమ గృహమున నాతనికి నిలువనీడ నొసంగి బీదల హింసించెడి ధనికులయెడ నసూయా పరులగు

సహచరులందఱి కాతనింజూపి యున్నత వంశజులమని విఱ్ఱవీఁగు దుర్మార్గులకుఁ బ్రతిక్రియ నొనర్పవలెనను స్థిరసంకల్పమును వారి హృదయమునందు సుస్థిరముగ నాటుకొను నట్లొనర్చిరి.

వారుముప్పురొక సోపానపంక్తి నెక్కుచు నొకయింటి పురోభాగమున కధిగమించు చుండిరి.

"అతఁడెప్పుడు నేకాంతముగనే యుండునా" యని త్రివిక్రముఁ డడిగెను.

'అవున'ని గ్రామణి తలపంకించెను.

'బుద్ధిపూర్వకముగ గోరుకొనియేనా ?'

'అవసరపూర్వకముగఁ గూడను. అతఁడు బందిఖానా లోనుండి నావద్దకు వచ్చినప్పుడెట్లుండెనో యిప్పుడు నట్లే యున్నాఁడు'

'అతఁడు పూర్తిగా మాఱిపోయినాఁడా ?

'మాఱిపోయినాఁడా! '

గ్రామణి తటాలుననాగి, కరమెత్తి పిడికిలివట్టి వికృతముగ నటించుచు, గోడపైగ్రుద్దెను. ఆతనిచూర్పు వర్ణనాతీతమని మాత్రము త్రివిక్రమున కింమవలన స్ఫురించెను. సోపానమెట్లనెక్కి పైకేగినకొలఁదిని త్రివిక్రముని మనము భయభ్రాంతమై క్రుంగఁజొచ్చెను. తుట్టతుదకు వారాసోపానముల నన్నింటిని గడచి యొక పెద్దద్వారముకడ నిలచిరి. అది తాళము వేయఁ

బడి యున్నది. గ్రామణి రొండిలోనుండి యొక తాళపుఁజెవిఁ దీసెను.

త్రివి:—ఇదియేమి ? నీయిల్లుగూడ భగవత్సానునకుఁ గారా గృహమైన దేమి ?

గ్రామ:—అట్లుకాదు. కడచిన పదునెన్మిదేండ్లనుండియు నాయన తలుపులు మూసియుంచిన గృహమున నుండియుంచుటచే, నాయలవాటుఁ దప్పించిన భయపడి యేదేని సాహసకార్య మొనర్చునేమోయని యిట్లొనర్చితిని.

ఇంత దనుక మాఱుమాటాడక వారివెంటనంటి పోవు చున్న కమలయొక్క సుకుమారగాత్రి మిపుడు భావోత్సారణ ముచేఁ గంపింపఁజొచ్చెను. భయవిహ్వాలతచే నామె ముఖ కమలము కళావిహీనమయ్యెను.

'భయపడకుము. అమ్మా అధైర్యము వలదు. ఆయన కెటుల సపర్యలొనర్చి, మనోవ్యధ తగ్గించి, సౌఖ్యసంధాయిని వయ్యెదవో యూహించుకొనుము.' అని త్రివిక్రముఁడు సమయస్ఫూర్తిగ ధైర్యముఁ జెప్పవలసి వచ్చెను.

గ్రామణి తాళపుఁజెవితోఁ దలుపులఁగొట్టి పెద్ద ధ్వనిఁ జేయుచు, ద్వారముఁదెఱచి, వారిని లోనికి రమ్మని చేసన్నచేఁ బిలచెను. వారు లోన బ్రవేశింపఁగనే, మరలఁ బెద్ద శబ్దముఁ జేయుచు, ద్వారముమూసి, లోనఁ దాళమువేసి, కొంతదూర

మేఁగి యింటిపై కప్పు నందమర్పఁబడిన యద్దము వెలుఁగున నిలువఁబడెను.

ఆ గది గృహోపకరణముల నిలువయుంచుట కమర్పఁబడిన దగుట నంధకార బంధురమై యుండెను. వెలుతురుకొఱ కింటికప్పు నందొక చిన్నయద్దము బిగింపఁబడి యుండెను. గాని యది పైభాగమున ధూమావృతమై యుంటచే నిరర్థకముగ నుండెను. తలుపున లోనఁ బ్రవేశించిన వారందఱి వస్తువులను జూడఁగాలరు. అందు సూక్ష్మతరములగు వస్తువులతో సన్న పని చేయుట దుస్తరము కాకపోయినను, జాలకాల మనుభవ ముండుట యవసరము. కాని యాగదియం దట్టిపని జరుగుచునే యున్నది. తెల్లగ నెరసిన శిరోజములుగల యొక ముసలి తలుపు వైపునకు వీపుద్రిప్పి యా యద్దముక్రింద నొకబల్లపైఁ గూరుచుండి యొకతెఱపిలేక సన్నని సూదితో బట్టలఁ గుట్టుచుండెను.

మూఁడవ ప్రకరణము.

# శంకర భగవత్పాదుఁడు.

---

అంధకార బంధురమగు నా గదియందు నిలిచిన కొలఁదిని, కమలా త్రివిక్రముల కందలి వస్తుచయము దృగ్గోచరము కాఁజొచ్చెను. అందు బల్లపైఁ గూర్చుండియున్న ముదుసలి కడకేగి గామణి, 'క్షేమమా' యని యడిగెను. అతఁడొక్కించుక సేపు మోమెత్తిచూచి 'చిత్త' మని యా కుశల ప్రశ్నమునకు వినయ పూర్వకముగ జవాబిచ్చి మరలఁ దన చేతనున్న బట్టలగుట్ట నారంభించెను.

'ఈనాఁడింకను బని చేయుచున్నారే?'

కొంచెము సేపాతఁడు నిరుత్తరుఁడై కూర్చుండి మరల నొకసారి మోమెత్తి 'అవును-పనిచేయుచునే యున్నాను' అని యతిదీనమగు మందస్వరమున ననుచుఁ జంచలములగు నిజ నేత్రముల నెదుటనున్న వ్యక్తిపైఁ బఱపెను.

ఆతని వాక్యము లందలి దీన స్వరము భయావహముగ నుండి మిగులజాలిఁ గొలుపుచుండెను. అది బలహీనతవలన నేర్పడినదికాదు. దానియందే యాతని దీర్ఘ నిర్బంధావాసానుభవములు ప్రతిధ్వనించుచుండెను. భీషణ కృపాణమునఁబట్టిన తుప్పువలె నాతని కంఠస్వరము నొక వికృతభావ మావహించి

యుండెను. కన్నులకు మిఱుమిట్లుగొలుపుచు నతిరమ్యముగఁ జిత్రింపఁబడిన రంగులు కాలక్రమాగతముగ ఛాయారహితములైనపుడు చూపఱకెట్టి భావవికారము కలుగునో, యట్టి వికారమునే యాతని వాక్కులు.-నిర్జీవములై మానవ ధృతి రహితములగు నాతనివాక్కులు-శ్రోతలకు జనింపఁజేయుచుండెను. అగాధకూపమునుండి వెలువడు నార్తనినాదముల వలె నవి హృదయచ్ఛేదకములై యుండెను.

కొంతకాలమట్లు నిశ్శబ్దముగఁ గడచిపోయెను.

గ్రామ:— వెలుతురుకొఱకే గవాక్షద్వారముఁ దెఱతును. మీకు సమ్మతమా?

శంక:— ఏమంటివి?

గ్రామ:— ఈ గవాక్షద్వారముఁ దెఱచిన మీకుఁ గష్టము లేదుగదా?

శంక:— నీవు తెఱతునన్న నాకష్టము ననుభవించి తీఱెదను.

గ్రామణి యంత గోడకడకేగి యందివిడియుండిన గవాక్షద్వారము నొకించుక తెఱచెను. ఆమార్గమున లోనఁబ్రసరించిన కాంతి కిరణములఁ దానమాడుచున్న భగవత్పాదుని రూప వయోవిలాసము లానూతనులకు విస్పష్టముగ గోచరించెను. ఆతని విశాలలోచనములు సముజ్జ్వలములై ప్రకాశించుచుండెను. క్షుద్బాధచేఁ గృశించినవారి నేత్రములు స్వాభావికముగఁ జిన్నవియైనను విశాలముగనే కనుపట్టునుగాని యా

వృద్ధుని యక్షువులు సహజముగనే విశాలములై యుండినట్లు తోఁచుచుండెను. అసంపూర్ణమగు కంచుకమునొకదానిఁదొడపై నిడుకొని యావృద్ధుఁడు నెమ్మదిగఁ గుట్టుకొను చుండెను. కత్తెరమొదలగు పనిముట్లాతనియొద్ద బల్లపైనను, భూమిపైనను బడియుండెను.

ఆతని తెల్లగడ్డమెక్కుడు దీర్ఘముగలేదుగాని, బాగుగాఁ బెరిఁగి హెచ్చుతగ్గులుగఁ గత్తిరింపఁబడి యుండెను. మెడవద్ద సడలింపఁబడియున్న యూదారంగు అంగరఖా కళావిహీనమగు నాతని కృశీభూతాంగముఁ బయల్పఱచుచుండెను. ఆ నూతనకాంతి కిరణప్రసారమున కోర్వఁజాలక యాతఁడు వామ హస్తమునెత్తి కన్నుల కడ్డముగ నుంచికొని సపు డద్దమువలె నున్న యాతని యఱచేతిగుండ కాంతికిరణములు ప్రవహించుచున్నట్లే యుండెను. ఆతని నెపుడు ప్రశ్నించినను బ్రత్యుత్తరముఁ జెప్పుటకు ముందు తన కర్ణపుటములఁ జొచ్చెడివాక్యధ్వని యే వైపునుండి బయలుదేఱెనో యెఱుఁగని వానివలె నిరుపార్శ్వములఁ బాఱఁజూచి మాటాడుచుండెను.

గ్రామణి యాతని మరలఁ బలుకరించెను.

'మీరీనాఁడా కంచకముఁ బూర్తిచేయఁగలరా?'

'ఏమంటివి ?'

ఇంతదనుక కమలతో ద్వారముకడనే నిలచియున్న త్రివిక్రముని గ్రామణి చేసన్నచేఁ బిలచి, యా వృద్ధుని మరల నదే రీతిఁ బ్రశ్నించెను.

'ఏమో నేను చెప్పఁజాలను. ఈ దినమే దీనిని బూర్తి చేయఁదలఁచితిని. ఏమో, ఏమగునో!"

ఆతనికిఁబనిజ్ఞాపకము వచ్చినది. తిరిగి శిరమువంచి, కుట్టుటారంభించెను. కమలను ద్వారముకడనే వదలి త్రివిక్రముఁడు మెల్లఁగ నాతని సమీపించెను. ఆతఁడొకటి రెండు నిముసములట్లు గ్రామణిచెంత నిలువఁగ నాదక్షి తలయెత్తి చూచెనుగాని యాతని ముఖమున నెట్టి యాశ్చర్య భావమును గోచరింపలేదు.

గ్రామ:—వీరు మిమ్ములను జూడవచ్చిరి. గమనించితిరా?

శంక:—ఏమంటివి?

గ్రామ:—వీరు మీ దర్శనమునకై వచ్చియున్నారు.

ఆవృద్ధుఁ డెప్పటివలె దలఁబై కెత్తి యాతని జూచెను గాని చేతిలోని పనిమాత్రము వదలలేదు.

గ్రామ:—ఇటు చూడుఁడు! మీరు తయారు చేయుచున్న కంచుకము వీరికిఁ జూపుఁడు. అయ్యా, దాని నందికొనుఁడు! త్రివిక్రముఁడు దాని నందుకొనెను.

గ్రామ:—అదియెట్టి కంచుకమో, దాని నిర్మించెడివారి నామ మేదియో వీరికిఁ దెలుపుఁడు.

భగవత్పాదుఁడు చాలసేపు నిరుత్తరుఁడై కూరుచుండి, 'నీవడిగిన దేదియో మఱచితిని. ఏమంటివ" నెను.

గ్రామ:—ఆ కంచుక మెట్టిదియో వీరికిఁ దెలుపఁగలరా యంటిని.

శంక:—అది యొక యౌవనవతియగు స్త్రీకి సరిపోఁదగిన కంచుకము, క్రొత్త మాదిరిది. ఈ పద్ధతి నాకెవ్వరు నేర్ప లేదు. ఇటువంటిదాని నొకసారి చూచితిని.

ఆతఁడా కంచుకముఁ జూచుచు సగర్వుఁడై యుల్లసెను. కాని యా భావతరంగ మొక్క త్రుటికాలమున నదృశ్య మయ్యెను.

గ్రామ:—దానిఁగుట్టినవాని పేరు ?

భగవత్పాదుఁడు తదేకదృష్టితో నాతనివంకఁ గొంచెముసేపు చూచెను. చేతఁబని లేకుండుటచే, వ్రేళ్ళను విఱుచుచు గడ్డము సవరించుకొనుచు నూరకుండి 'నా పేరుఁ జెప్పుమని యడిగితివా ?' యనియెను.

'అడిగితిని'

'నూటఅయిదు, ఉత్తరపంక్తి.'

'అంతే ?'

'నూట అయిదు ఉత్తరపంక్తి.'

దీర్ఘనిశ్వాసముఁబుచ్చి మరల నాతఁడు పనిచేయ నుపక్రమించెను.

'అనాదినుండియు బట్టలుగుట్టుటేయా మీ వృత్తి ?' యని త్రివిక్రముఁడడిగెను.

ంకాదు బట్టలఁగట్టుట నావృత్తికాదు. నన్నిటకుఁగొని వచ్చినపిదప నీపని నేర్చుకొననిండని యధికారులఁగోరితిని. చాలకాలమైన పిదప, వారంకల కనుజ్ఞ......'

తానపుడేమి చెప్పుచుండెనో మఱచినట్లాతఁడాగిపోయి త్రివిక్రముని వంక విస్మితుఁడై చూచెను.

'ఆఁ! వారందుల కనుజ్ఞనొసంగిరి. నాయంతట నేనే దీనిని నేర్చుకొంటిని. అప్పటినుండియు వస్త్రములఁగట్టుచునే యుంటిని'

భగవత్పాదుఁడు చేయిఁజాచి త్రివిక్రముని చేతనున్న కంచుకము నందు కొనునపుడు, 'భగవత్పాదా! నన్ను మరచితివా?' యని త్రివిక్రముఁడు ప్రశ్నించెను. భగవత్పాదుఁ డందికొనిన కంచుక మప్రయత్నముగఁ జేయిజారి నేలపైఁ బడెను. ఆతఁడు త్రివిక్రముని ముఖలక్షణముల నిదానించి చూచుచు నట్లే కూర్చుండెను. త్రివిక్రముఁడు గ్రామణిని వ్రేలితోఁ జూపుచు.

'శంకర భగవత్పాదా! ఇతఁడెవరో మీకు జ్ఞాపకము లేదా. అతని జూడుఁడు! నన్నుజూడుఁడు. మీ పూర్వసేవకుఁడు, మీ పూర్వ స్నేహితుఁడు జ్ఞప్తికి వచ్చుటలేదా?' యనియెను.

శంకరుఁడు నిర్విణ్ణుఁడై త్రివిక్రముని వంకను, గ్రామణి వంకను జూచుచున్నపు డాతని సూక్ష్మ గ్రహణశక్తి ప్రజ్వ

లితమై, యాతని నేత్రాంచలములం దొక్క త్రుటికాలము ప్రతిఫలించెను. స్థలకాల భేద జ్ఞానమును, భూతకాల విచారము నాతనియందుఁ బ్రేరేపింప వారొనర్చిన ప్రయత్నము నిరర్థకము కాలేదు. శంకరుఁడు నెమ్మదిగ దృక్కుల వారిపై నుండి మరల్చి, యథారీతి నిటునటు పరికించి, నేలఁబడియుండిన కంచుకము నెత్తుకొని, యప్రమత్తుఁడై పనిచేయఁ దొడఁగెను.

'ఆతనిని గుర్తించితిరా?' యని గ్రామణి రహస్యముగఁ బ్రశ్నించెను.

'ఆహా! ఒక్క క్షణకాలము మొదట నిరాశ చేసికొంటినిగాని, నాకుఁ బరిచితుఁడే యని యాతని గుర్తింపఁ గలిగితిని.

ఈ గొడవ మనకేల? నన్ను పనిచేసికొన నిండు.

చాలసేపు ప్రకంపిత తాంగముతో ద్వారముకడనే నిలువఁబడియున్న కమల, నిశ్శబ్దముగ మంద గమనంబునఁ దన తండ్రిని సమీపించి, యాతని వెనుక నిలువఁబడి యుండెను. శంకరుఁడు కంచుకముపై నుండి దృష్టి మరల్చుటలేదు. నేలఁబడియున్న వస్తువొండు గావలసి వంగి దాని నెత్తుకొనునపుడు కమల చీరకొం గాతని కగపడెను. ఆతఁడాపె ముఖమువంకఁ దేరిచూచి 'ఏమిది' యని తడఁబడఁ బల్కుచు 'నీవే కారాగృహాధికారి పుత్త్రికవు గావా' యనియెను.

'కాద'ని యాపె నిట్టూర్పు విడిచినది.

'నీ వెవరవు?

కమల నిరుత్తరయై, యాతని చెంతనే బల్లపైఁగూర్చుండఁబడెను. అతఁడదరిపడియెఁ గాని యాపె మృదుల హస్త మాతని చేతిని గట్టిగఁ బట్టియుండెను. సవరింపఁబడని యాపె భ్రమరాలకములు భయప్రేమా భావములచే నొచ్చియున్న ముఖపద్మమునఁ జిందులాడుచుండెను. ఆపె నిడుదజడ కుడి భుజముపైనుండి ముందునకు జారి వక్షస్థలమున వ్రేలాడుచుండెను. నెమ్మది నెమ్మదిగ నాతఁడు దక్షిణ హస్తమును గదల్చి, యాపె శిరసు వెంట్రుకలఁబట్టి చూచుచుండెను. మరల నీ ప్రయత్నము తటాలున నాగిపోయినది. అతఁడు కంచుకముఁ గట్టుచుఁ గూర్చుండెను.

కాని యెంతసేపట్లు కూర్చుండఁగలఁడు? మరల నాతని చేతు లాపె శిరోజములఁబట్టి పరిశీలించుచుండెను. ఇటునటుఁ జూచుచుఁ జేతనున్న వస్త్రపుల బల్లపై బాఱవైచి, మెడయందొక సూత్రముతో భద్రము చేయఁబడి యుండిన పొట్లమొకటాతఁడు వెలికిఁదీసెను. సమ దీర్ఘములగు రెండుమూఁడు శిరసు వెంట్రుకలందుండెను. వాని నాపె కురులతోఁ బోల్చి చూచుచు, 'ఇది యెట్లు సంభవింపఁగల' దనుకొనెను. మరల నాపె చెక్కిలిపైఁ జేయి నుంచి, నెమ్మదిగ గవాక్షము వైపునకు ముఖముద్రిప్పి, యా వెలుఁగున నామెను జూచుచు, నిట్లు తలపోయుచుండెను.

'ఆ రాత్రి - నేను బయలుదేఱనున్న సమయమున - నా భుజముపై శిరముంచి - నేను ధైర్యము చెప్పుచున్నను- భయవిహ్వలచిత్తయై - నిట్టూర్పుల విడుచుచు - నాపె కొంత సేపు కూర్చుండెను. అపుడివి నా భుజస్కంధమున నిలిచినవి గాబోలు - నన్ని చెఱసాలలోనికిఁ జేర్చినపుడు - వీనిని నేఁ జూచితిని - వీనిని నావద్ద నుండనిండని ప్రార్థించితిని - వారు వల్లెయనిరి. అది యెట్లు - అది నీవా?'

ఆతఁడు వాక్యముల ధారాళముగ నుచ్చరింపఁజాలక యతికష్టమున మాటాడుచుండెను. కమల నతి కఠినముగ నాతఁడు చూడఁజొచ్చెను. నిశ్చలులై యా దృశ్యముఁ దిలకించుచుండిన పురుషు లిరువురు నదరిపడుచుండిరి. కమల యప్రయత్నముగనే 'మీరేమియు జోక్యము కలుగఁజేసి కొనకుఁడు. కదలక యచటనే నిలువుఁడని మందస్వరమున వారిని హెచ్చరించెను.

శంకరుఁడాశ్చర్య చకితుఁడై 'ఆఁ' ఈ మృదుమధుర కంఠస్వర మెవ్వరిది! అని యఱచెను. ఆ యఱపుతో నాతని విశాల నేత్రముల నుండి జీవకళ యొలికెను. ఆతని జీర్ణతను లత భావోత్సాహముచే నుప్పొంగెను. ఆతని మనము నావహించియుండిన భయభ్రాంతి తొలఁగిపోయెను. - కాని యెంత సేపు ఇంతలో మరలఁ గుట్టుపని జ్ఞప్తికి వచ్చినది. పరికరముల నేరుకొని పని ప్రారంభించినాఁడు.......

'నీవా? నీ వెట్లగుదువు? నీవేమైన వయోరూప విలాస ములెట్లింకను నిలువఁగలవు? ఈ మంద భాగ్యుని గనుము! ఈ హస్తముల నాపె యెఱుఁగదు. ఈ ముఖము నాపె యెఱుఁగదు. ఈ కంఠస్వరము నాపె యాలకింపలేదు. కాదు, కాదు, అతఁడున్నది. ఆమె యున్నది - యిపుడా? బోల్నాకు దుర్గమునకుఁ బూర్వము చాలకాలము క్రిందట! - ఓ దేవీ? నీ పేరేమి?'

ఆతని నమ్రగాత్రము - సరళభావము - ప్రేమ పూరితమగు కమల హృదయమున నాశా బీజముల మొలక లెత్తించెను. చివాలున నాపె భూమిపైఁ జతికిలఁబడి, తన కోమల హస్తద్వయము నాతని భుజములపై నుంచి, యావేశ పూర్వకముగఁ బ్రార్థింపఁజొచ్చెను.

'బాబా! నా పేరేదియో తెలుపుట కిది యదనుగాదు. సకాలమున నా తండ్రిపేరు నీ కెఱింగింతును. నా తల్లిపేరు నీకు విన్నవింతును. వారెట్టి దుర్దశ ననుభవించిరో నేనిపుడు తెలుపను. దయయుంచి నన్ను దీవింపుఁడు. ఒక మాద్దు ముద్దు!

పసిబిడ్డవలెఁ గమల యాతని గాఁగలించుకొనియెను. ఆతని ధవళ ముఖ బింబమున నాపె నీలాలకములు తాండవ మాడుచుండెను.

నేను మాటాడునపుడు నీ ప్రేయసియొక్క మృదుల కంఠస్వరము జ్ఞప్తికి వచ్చుచున్న శోకింపుము! శోకింపుము!

నా కురులం జూచినపుడు, నీ యౌవనమున నొడియందు కూర్చుండిన యువతి శిరోజములు జ్ఞప్తికి వచ్చిన శోకింపుము. శోకింపుము, పుత్రికా వాత్సల్యముతో నేను నీకు సపర్య లొనర్చుచుండ, నీవు సౌఖ్యముగఁ గాలముఁ గడుపుచుంటివన్న తలంపు, నీ పూర్వ చారిత్రమును జ్ఞప్తికిఁ దెచ్చిన శోకింపుము శోకింపుము !'

వారినేత్రములనుండి యశ్రుధారలు వెల్లువలై పాఱఁ జొచ్చెను. ఆవృద్ధుఁడు నెమ్మదిగఁ గూఁతుచేతులలోని కొదిగెను. ఆతని ముఖ మాపె భుజముపై విశ్రమించి యుండెను. ఆదృశ్యము, చూపఱచిత్తములఁ గలంచివైచెను. ఆ దీనులనుభవించిన యాపత్తుల నొక్కసారి వారు దలపోసిరి. వారిరువురును దమ ముఖముల నఱచేతులందిడికొని యట్లే నిలచిపోయిరి.

ఇట్లు చాలసేపటివఱకు గాఢ ప్రశాంత నిలయమై యుండెను. భగవత్ప్రాపుని మానసము శాంతినందెను. ఆతఁడు కూఁతుచేతులందుఁ బడిపోయెను. వా రిరువురుఁబట్టి యాతని లేవఁదీసిరి. ఆపె యూరువులపై శిరమువాల్చి, యావృద్ధుఁడట్లే పడియుండెను.

త్రివిక్రముఁడు కమలా భగవత్ప్రాపులవెంట నిడికొని విక్రమపురమును విడిచి పోవుట కర్తవ్యమని నిర్ధారణఁ జేసెను. ప్రయాణమునకు వలయు పరికరముల సమకూర్చి, శకటము నాయత్తపఱచుటకు, త్రివిక్రమ గ్రామణులు బయలుదేఱిరి.

తండ్రిని గూఁర్చి నింటియందుంచి, మరల నెప్పటివలెనే తాళము బిగించి, వారువెడలిపోయిరి. కొంతదూరమేగఁగనే, సాగాయంగడియందుఁ బేకాట నాడుకొనుచుండిన నల్గురిలో నొకఁడు వీరి కెదురయ్యెను.

గ్రామ:— జంబుకా, నీవిచటనేమి చేయుచున్నావు ?

జంబు:— మేము నల్వురము జరిగినదంతయుఁ జూచుచునే యున్నాము.

గ్రామ:—ఇట్టిపనుల నిఁకముందు చేయకుఁడు, మన కప్రతిష్ట గలుగును. బుద్ధిగలిగి మెలఁగుఁడు.

శకట మాయత్తపఱచిరి. పరికరములన్నిటి సమకూర్చిరి. ఆనాఁడేలకోకాని, భద్ర, శిరమున నొక గులాబి పుష్పముధరించి, యేదియో కట్టికొనుచు నంగడియెదుట నిలువఁబడి యుండెను. ఆపె యిటునటుఁ జూచుటలేదు. అతినైపుణ్యముతో ద్రవ్యేఁగదల్చుచుఁ గట్టుకొను చుండెను. ఆ సమయమున నేలకోయనంతపద వీధియందు జన సంచారము లేదు. స్వకార్యతత్పరయగు భద్రావతి తప్ప నొక్క నరుఁడైన నచట లేఁడు. శకటతురంగముల దర్శించుట కొక్క చిన్ని బాలుఁడైన నా వీధిలోనికి రాలేదు.

వినాయక గ్రామణి యొకవైపునను, గమల యొకవైపునను బట్టికొని భగవత్పాదుని నెమ్మదిగ బండిలోనికిఁ జేర్చిరి. భైరవి రెండు మూఁడు మూటల నెత్తిపైఁ బెట్టికొని

యప్పుడే యాచటకుఁ జేరెను. భద్రావతి తప్ప నందఱును శకటమధిరోహించిరి. భగవత్పాదుఁడు విశాలముగఁ గూర్చుండుటకు మెత్తని దిండ్లమర్పఁబడియుండెను. శకటమునఁ గూర్చుండియుండిన గ్రామణి 'గుఱ్ఱముల విడుము' యని యఱచెను. ఇంతలోనే భగవత్పాదుఁడు 'నాకుట్టుపనిముట్లు - నాపనిముట్లు తెచ్చితిరా! వానిని వదలి నే జీవింపఁజాలను' అనియెను. కమల నిర్విణ్ణయై గ్రామణి వంకకుఁ జూచెను.

గ్రామణి దూరమున నిలిచియున్న భద్రను బిలచి 'కుట్టుపటముట్లఁదెమ్మ'ని యంపెను. వెంటనే యాపె యంగడి ప్రక్కనున్న గల్లీలోని కదృశ్యమై క్షణకాలములో భగవత్పాదుని పనిముట్లఁగొని తెచ్చియిచ్చెను.

కమల భద్రఁగాంచి, యతిదీనముగ సెలవు గైకొనెను.

'అమ్మా! సెలవొసంగుము. మీ దంపతుల సాహాయ్యమును మఱవజాలను' ఆ బాలిక విశ్వాస వచనముల సాంతముగ భద్ర వినెనో లేదో కాని ప్రత్యుత్తరము మాత్రము చెప్పలేదు. తటాలున వెనుదిరిగి తలవంచి చేతనున్న వస్త్రముపైఁ జిత్రగతిం గుట్టుచు నంగడిలోఁ బ్రవేశించెను.

గుఱ్ఱములను వదలిరి. శకటము వీధుల నన్నిటి దాఁటి, విక్రమపుర ప్రాకార పశ్చిమ ద్వారము కడ నిలచెను. ఒక యుద్యోగి,

'ఈ బండియందున్న దెవరు?' అని యడుగుచుండఁ

గనే, వినాయకగామణి బాడిదిగి, యాతని సమీపించి, యాంగరఖా జేబులో నుండి యొక కాగితముఁదీసి యాతనికిఁ జూపెను.

‘ పోనీవచ్చును. ద్వారముఁ దెరువుఁడు ’ అను యాజ్ఞ యయ్యెను. వినాయకగామణి కమలా త్రివిక్రముల కడ సెలవుఁ గైకొని తిరిగి పురమునఁ బ్రవేశించెను. దేశాంతరమున భగవత్పాదుని మరల మానవ మాత్రునిగాఁ జేయుట కొఁకట మతి తీవ్రగమనమునఁ దోడ్కొని పోవుచుండెను.

త్రివిక్రముని మనోవీధియందు మాత్రము,

‘ నీ పేరేమి ? ’

‘ నూట ఐదు. ఉత్తరపంక్తి ’

అను ప్రశ్నోత్తరములు పలుసార్లు ప్రతి ధ్వనించుచుండెను.

‘ ఈతని మరల మానవ మాత్రునిగాఁ జేయుట సాధ్యమా ? ’ యని యాతఁడు లోలోనఁ దీవ్రముగఁ దర్కించుకొనుచుండెను.



మొ ద టి ప్ర క ర ణ ము.

# న్యాయ స్థాన ము.

శంకరభగవత్పాదుఁడు నాతని కుమార్తెయు విక్రమపుర రాజ్యమువదలి, ధవళగిరియందు స్థిరనివాస మేర్పరచుకొనినయైదు వత్సరములైనది.

ధవళగిరీశుఁడగు ప్రతాపరుద్రుఁడు పరాక్రమవంతుఁడు, ధీశాలి. అతఁడు దేశాభ్యుదయ కరములగు కార్యము లొనర్చు చు సర్వజన సమాదరణపాత్రుఁడై పాలన సలుపుచుండుటచే నాతని రాజ్యము సుభిక్షమై, ప్రబలప్రశాంతియుతమై యుం డెను. ఈ రాజ్యమును విక్రమపురరాజ్యమునుండి విభజించు మః ద్రవ్వని కందకమై, సముద్రము భూభాగమునఁ జీలికగఁ జొచ్చి యుండెనని మా చదువరు లిదివరకే గ్రహించి యుండఁగలరు. ఆ యిరురాజ్యముల వారికిఁగల పరస్పర వైరుధ్యము నాసము ద్రము నిరంతర ముద్ఘోషించు చున్నట్లుండెను. సర్వకాలముల యందు వారొకరి బలాబలముల నింకొకరు దెలిసికొనుచు, శత్రురాజ్యనాశన మొనర్ప నద నెపుడు దొరకునా యని పొంచియుందురు. అరిదుచే వారెల్లపుడు నప్రమత్తులై రణగోష్ఠి యందే కాలము గడపుచుండెడివారు. ప్రతాపరుద్రుని తాత యగు ప్రతాపుఁడు, బలవత్తరమగు నౌకా సమూహముతో సముద్రముదాఁటి, గొప్పసైన్యముతో మహా సంరంభమున

విక్రమపురరాజ్యమున, బ్రవేశించి, ముఖ్యనగరములఁ గొన్నింటి ముట్టడించి వశీకరణ మొనర్చుకొనుచు నిరువది సంవత్సరములు రణవ్యాపార ప్రమత్తుఁడై యటనే యుండి, యింతలోఁ దండ్రి మరణించుటవలన స్వదేశముఁ జేరవలసి వచ్చుటచే, శత్రులతో సంధి జేసికొని, వారియొద్దనుండి విశేష ధనము గప్పము గాఁగొని, తన సైనముల స్వదేశాభిముఖముగ మరి ల్చెను. ధవళగిరి ప్రజల భాగ్యవశమున నా రాజకుటుంబమున రాజ్యతంత్ర నిపుణులగు చక్రవర్తు లుద్భవించు చుండుటచే, వారు రాజభక్తిపూరితులై స్వదేశ సంరక్షణార్థము తమ ప్రాణములనైన నర్పింప సంసిద్ధులై యుండిరి.

విక్రమపురమున నట్లులేదు. ప్రభువులును, వారి సంతతి గోసినారమని విఱ్ఱవీఁగు ధనాధికులును దయావిహీనులునై నిరంకుశ పరిపాలన మొనర్చుచు, సామాన్యజనుల నలయింపఁ జొచ్చిరి. వారు దివ్యాంతః పురాంతర్భాగముల నింద్రభోగముల ననుభవించుచు, జనులను బశువులవలెఁ జూచి వారిచే నడ్డూడిగములఁ జేయించుకొనుచుండిరి, ప్రజల కష్టసుఖముల నొక్కించుకేనియు నరయకుండిరి. స్వతంత్రభావాపేక్షకులగు సజ్జనుల హింసించుచుండిరి. స్వల్పకోపములకు వారిని బంధితులఁజేసి, దీర్ఘకాలము కారాగారములం దుంచుచుండిరి. నిరంతర క్షుద్బాధాపీడితులగు జనసమూహమునకు విముక్తిమార్గము గోచరించుటలేదు. వారు క్రోధోద్భూతమానసులై, ప్రతిక్రియాన్వేషణ తత్పరులై యుండిరి.

ధవళగిరి రాజ సభాభవన మానాఁడు జనులచే గిక్కి-రిసియుండెను. రాజద్రోహపు నేరములనెల్ల స్వయముగా విచారించుచు, న్యాయవాదుల ప్రసంగముల సావకాశముగ వినుచు సాక్ష్యముల నెల్లఁ బరిశీలించుచు, నన్యాయముగ జరుగకుండ జాగరూకతతో ధర్మము బరిపాలించెడి ప్రతాపరుద్రుఁ డానాఁ డొక రాజద్రోహపు నేరమును విచారించునని ప్రకటింపఁబడి యుండెను. రాజద్రోహులు శిరచ్ఛేదనాది కఠినశిక్షలకుఁ బాత్రులగు చుండుటచేత రాజభక్తులగు నా నగరవాసులా ద్రోహి శిక్షింపఁబడుచుండఁ గన్నులారఁ జూడవలెనని తండోప తండములుగ రాజసభఁ జేరిరి. ప్రతాపరుద్రుఁడు మంత్రిగణ పరివేష్టితుఁడై సభాధ్యక్షపీఠము నలంకరించి యుండెను. నగర దండనాథుఁడును, నిందితుని పక్షమున వాదింపవచ్చిన న్యాయవాది ప్రముఖుఁడగు విశ్వనాథుఁడును, వారియెదుటఁ గూర్చుండియుండిరి. వారి కొక్కింత దూరమున నొక బల్లపైన ప్రభాకరుఁడను నొక న్యాయశాస్త్రవేత్త, నింగిఁ జూచుచుఁ గూర్చుండి యుండెను. అతఁడు పడుచువాఁడే. ఐన నాతఁడు పుట్టము గట్టిన విధమును, అంగరఖాను దొడిగినరీతిని తలపాగధరించిన తెఱఁగును జూచిన, నశ్రద్ధయు, సోమరితనమునను పిశాచము లాతని బీడించుచున్నవని గ్రహింపఁగలము. అతఁడెవ్వరివంకను జూచుటలేదు. శిరమెత్తి తదేక ధ్యానమున నాకసమువంకఁ జూచుచుండెను. ఆ సభాభవనమున నొక

ప్రక్కఁ దెల్లగ నెరసిన కేశములుగల యొక పెద్దమనుష్యుఁడును, ఆతనిచెంత నొదిగియున్న యొక సుకుమారియుఁ గూర్చుండి యుండిరి. ఆతని కేఁబది సంవత్సరములకు మించియుండవు. ఆ బాలిక కిరువదేండ్లు మించియు మించకుండెను. ఆమె నేత్రాంచలముల యౌవన వికాస మింకను దాండవమాడు చుండెను. ఆమె రూపలావణ్య వయోభాగ్యముల నసమానయై సౌందర్య రాశివలె నుండెను. వారిచెంతనే త్రివిక్రముఁడు గూర్చుండి యుండెను. సభాసదులెల్లరు - ప్రభాకరుఁడుతప్ప మిగిలినవా రెల్లరు-సత్వాతురముతో నిందితుఁడు భవనముఁ బ్రవేశింప వలసిన దిక్కుచూడ్కుల నిగుడించు చుండిరి. శృంఖలా బద్ధుఁడగు గంగాధరుఁడు సభఁబ్రవేశించి, ప్రభువునకుఁ దలయొగ్గి నమస్కరించి, నియమితోన్నత స్థానముఁజేరి నిలచెను. దశ సహస్రనేత్రము లొక్కసారిగ నాసాధుమూర్తి నవలోకించి, యశ్రుజల పూరితములైనవి.

గంగాధరుఁడు యౌవనప్రాయుఁడు. సుకుమార గాత్రుఁడు తేజోవంతమై విశాలమైన యాతని ఫాలమాతఁడొక మహా దృష్టవంతుఁడని తోఁపఁజేయు చుండెను. సరళములగు నాతని చూడ్కులు ధర్మదయా గుణసంపత్తిఁ జాటుచుండెను. ఆతని జూచి, యాతనికానాఁడెట్టిశిక్ష విధింపఁబడచున్నదో యని తలఁచి జాలిచెందని వారాసభయం దొక్కరైనను లేరు. అతఁడును శాంతభావముఁబూని, రానున్న విపద్దశఁగూర్చి వగవక ధైర్య

కవచధారివలె వినయ వినమితోత్త మాంగుఁడై శిరమువంచి యట్లే నిలుఁవఁబడెను. కాని యాతఁడప్రయత్నముగ శిరమెత్తి సభాంగణముఁ గలయఁజూచు నపుడాతనిదృక్కులు, చంచలము లగు కమల వీక్షణముల నెదుర్కొనినవి. క్షణకాలమాతని నేత్రములందు వింతవికాసము నెలకొనినది. ప్రాణాశఁద్యజించి ధీరునివలె సభ నెదుర్కొనిన గంగాధరుని హృదయ వీధియం దనురాగమెట్టి విప్లవము గలుగఁజేసినది. అరదండములఁగట్టు వడియున్న యపరాధి చివాలునఁ దలవంచి సహజాచారుఁ డయ్యెను.

ప్రభువుచే ననుజ్ఞాతుఁడై, నగరదండ నాథుఁడు విచారణ నుపక్రమించెను. ఆతఁడి ట్లుపన్యసింపఁ దొడఁగెను.

'మహాప్రభూ ! ఇపుఁడు మనయెదుట నుంపఁబడిన నిందితుఁడు గంగాధరుఁడు, విక్రమపురవాసి. ఈతఁడు మాఱు వేసమున మనరాజ్యముల నెల్లఁగలయ ద్రిమ్మరుచు, నీయాస్థానమునఁ బెక్కండ్రు ప్రముఖుల మైత్రిసంపాదించి, రహస్యముగ మన యుద్ధప్రయత్నముల యందలి విశేషములన్నియు, విక్రమ పురపాలకులకుఁ దెలుపుచున్నట్లు నేర మారోపింప బడినది. ఈతఁడనేకపర్యాయము లీసముద్రముదాఁటి, విక్రమపురి కేగి, తిరిగి యిటకు వచ్చుచుండఁజూచిన వారలనేకులుకలరు. వారలలోఁ గొందఱినేలినవారి యెదుటికి బిలిపించి యుంటిని. రఘుపతి మిగుల మర్యాదస్థుఁడు. ఆతఁడీనిందితుని మైత్రిసంపాదించి,

యాతని ప్రవర్తనముఁజూచి యనుమానపడి, యాతని సేవకుఁడగు వాసవునివలన నీరహస్య వృత్తాంతమంతయు నెఱిఁగి, దేశసేవోల్లాసమున నీవిషయమును దేవరవారి భృత్యున కెఱింగించెను. రఘుపతి, వాసవుఁడు నీవిషయముల సమక్షమున మీకు విన్నవింపఁగలరు.

శంకర భగవత్పాదుఁడుగూడ విక్రమ పురవాసియైన నాతఁడు నాతనిమూఁతురును మన రాజ్యముననే స్థిరావాస మేర్పఱచుకొని యున్నారు. వారుగూడ నీ నిందితుని గూర్చిన విశేషములఁ గొన్నిటి తెలుపఁగలరు. ఇందలి నిజానిజములను దేవరవారు పరిశీలించి, దేశద్రోహియగు గంగాధరునికి మరణదండనము శాసింపవలెనని ప్రార్థించుచున్నాను.'

ప్రతాపరుద్రుఁడు గంగాధరునివంకకుఁ దిరిగి

'నీ నివాసము విక్రమపురియా?' యని ప్రశ్నించెను.

'అవు' నని గంగాధరుఁడు సవినయముగ ననియెను.

'నగరదండనాథుఁడు నీపై మోపియుండిన నేరమున కెట్టి సమాధానముఁ జెప్పఁగలవు?

'స్వామీ, ఆ విషయము సర్వమును విశ్వనాథుఁడు తమకు మనవిచేసికొనఁ గలఁడు.

విశ్వనాథుఁడు నిలువఁబడి,

'స్వామీ, రఘుపతిని, వాసవుని బిలిపింపుఁడు. వారిరువురు తాంత్రికులు. మాయోపాయములఁ బన్ని, మర్యాదస్థ

లగు జనులఁ జిక్కులుపెట్టఁ బ్రయత్నించెడి దుర్మార్గులు.. కలటలిని మీా యెదుట నిరూపింపఁ గల' ననెను.

అంత విశ్వనాథుఁడు రఘుపతి నిట్లు త్వరితముగఁ బ్రశ్నింపఁ జొచ్చెను.

'నీకు జీవనాధార మేమి ?'

'నా ఆస్తియే ?'

'నీ ఆస్తి యెచ్చటనున్నది ?'

'ఎచ్చటనున్నదో సరిగా జ్ఞాపకము లేదు.'

'దాని స్వభావమేమి ?'

'అది యెట్టిదైననేమి ? దానితో నితరుల కేమియుఁ బనిలేదు.'

'నీకాయాస్తి పూర్వకుల ద్వారమున సంక్రమించి యున్నదా ?'

'అవును.'

'ఎవ్వరివల్ల నీకది సంక్రమించినది ?'

'ఒక జ్ఞాతివలన'

'చాల దూరబంధుత్వము మున్న జ్ఞాతియా ?'

'కొంచెము దూరమే'

'నిన్నెపుడైనఁ గారాగారము నందుంచిరా ?'

'ఆ విషయ మీా సందర్భములలో నెటులు సహాయకారి యగునో నాకుఁ దోఁపకున్నది'

'నీవు ఋణములఁ దీర్పలేక ఖైదునకుఁ బోయితివా ?'

'ఆహా'

'ఎన్నిసార్లు ?'

'రెండు మూడు సార్లు'

'ఐదారుసార్లు పోలేదా ?'

'ఏమో చెప్పలేను'

'నీవృత్తియేమి ?'

'నాకుఁ బ్రత్యేకముగ నొక వృత్తిలేదు'

'నీవెప్పుడైనఁ దన్నులఁ దింటివా ?'

'తన్నులా! తిన్నట్లయిన'

'నిన్నెవరైన మేడపైనుండి తన్ని క్రిందకుఁ దోసిరా ?'

'లేదు. ఒకసారి మాత్రము మేడమెట్లపై నుండఁగా నొకరు నన్ను దన్నిరిగాని, నేను బుద్ధిపూర్వకముగనే క్రిందకు దొరలి వచ్చితిని'

'పేకాటలో మోసము చేసినందులకేనా నిన్నపుడు తన్నినది ?'

'తన్నినవాడట్లు నలుగురితోను జెప్పుచుండును. అది యబద్ధము'

'నీవు జూదమునే వృత్తిగా నవలంబింపలేదా ?'

'అట్లు చేసెడివారు నేనేగాక ననేకులగు పెద్దలుగూడఁ గలరు'

'ఈ గంగాధరుని వద్దనుండి నీ వెప్పుడైన ఋణమూ దీసికొంటివా ?'

'తీసికొంటిని'

'ఆ ఋణము తీర్చితివా ?'

'లేదు'

'ఈ నిందితు నీ వప్పుడప్పుడు కలుసుకొను చుండు టయేతప్ప'

'యీయనతో నీ కెక్కువ పరిచయ మున్నదనుట యబద్ధము కాదా ?'

'కాదు'

'ఈ సాక్ష్య మిచ్చినందులకు నీవు లంచము పుచ్చు కొనుటలేదా ?'

'లేదు'

'నీవు దేశభక్తి ప్రేరితుఁడవై యే యీ కార్యమును జేయుచుంటివా ?'

'అవును'

గంగాధరుని పూర్వ సేవకుడగు వాసవుఁడిట్లు చెప్పెను.

'నాల్గు సంవత్సరముల క్రిందటనే నీ గంగాధరునియొద్ద సేవకావృత్తికిఁ గుదిరితిని. నాయజమానియొక్క ప్రవర్తనము గాంచి యనుమానపడి, యాతనిని బహుజాగరూకతతోఁ గని పెట్టుచుంటిని. ఇపుడు మీయెదుట నుంపఁబడిన జాబితాలను

బోలిన కాగితముల నాయన జేబులలో నపుడపుడు చూచు చుంటిని. ఆయన వ్రాసికొనెడి బల్లసొరుగులలోనుండి వీనిని దీయుచుండెడి వాడను.

విశ్వ:—నీవే యీకాగితములను ముందా సొరుగులలో దాచి యుంచ లేదా ?

వాస:—లేదు. ఈ కాగితములనే, విక్రమ పురములో నిరువు రుద్యోగులకుఁ జూపించుచు రహస్యముగ మాటలాడు చుండఁగా నేను జూచుచుంటిని. నేను రఘుపతిని ఏడెని మిది సంవత్సరముల నుండియు నెఱుఁగుదును.

అంత నా నగరదండనాధుఁడు కమలనిట్లు ప్రశ్నించెను.

'నీ వీ నిందితు నెపుడైన జూచియుంటివా? '

'చూచితిని'

'ఎప్పుడు? '

'ఐదేండ్ల క్రిందట, నేనును, నాతండ్రియు, విక్రమ పురమునుండి యిచటికిరా నోడనెక్కితిమి. అందీయనఁ గలిసి కొంటిమి.'

'నీవపుడీతనితో నేమేని సంభాషించితివా? '

'చిత్తము'

'మీారిరువు రేయే విషయములఁగూర్చి ముచ్చటించి తిరో, జ్ఞాపకము చేసికొని చెప్పుము.'

'నాతండ్రి విక్రమపురమునఁ బదునెనిమిదేండ్లు కారాగృహశిక్ష ననుభవించి మతిభ్రష్టత నందియుండెను. త్రివిక్రముని సాహాయ్యమున నేనాతనివెంట నిడుకొని మీరాజ్యముఁ జేరవచ్చుచుంటిని. గంగాధరుఁడు మాచరిత్ర నెఱింగి జాలిఁగొని, నాకుఁజాల ధైర్యముఁ జెప్పుచుండెను. ఆనాఁడు మేము తప్ప నింకెవరా నావయందు లేరు.'

"ఆతఁడు పడవనెక్కుటకొంటరిగ వచ్చెనా?"

"లేదు"

"ఆతనితో నెందఱుండిరి."

"మఱి యిద్దఱుండిరి."

"వారేమైన మాటాడుకొనిరా?"

'వారుచాలాసేపు మాటాడిరిగాని, నాకుజాల దూరమున నున్న దీపముకడ నిలువఁబడి యుండుటచే నాకేమియు వినఁబడలేదు."

"ఈతనిచేతిలో నేమైనఁ గాగితము లుండెనా?"

"ఉండెను."

"అవి యీజాబితాల వలెనే యుండెనా?"

"ఏమో నేను జెప్పఁజాలను."

'గంగాధరుఁడు నీవునేమి సంభాషించుకొనిరి?'

నాతండ్రి దీనావస్థఁగాంచి యాతఁడు మిగులఁ జింతిం చెను. నాపై నతికనికరము వహించి,నాతండ్రికెట్లుపచారములఁ

జేయుచుండవలెనో బోధించెను. ఆతని సహాయమునకు బదులుగ నేనిపుడేమైన హానిచేయుచుంటినేమోయని వగచు చున్నాను.'

'అమ్మాయీ, నీవట్లు వగవఁబనిలేదు. నీవెఱింగి యుండిన విషయములను, బ్రభువునకెఱింగించుట నీ విధ్యుక్తధర్మ మని గంగాధరుఁడుకూడ నెఱుఁగును.'

'కష్టతరమగు నొక ముఖ్యకార్య నిర్వహణము నందిపుడు మెలఁగుచుంటిననియుఁ దానతి జాగరూకతతో మెలఁగకుండిన నితరులకు ముప్పు వాటిల్లగలదనియు, నాదుచే నిగూఢవృత్తిని మాఱుపేరునఁ దిరుగుచుంటిననియు, విక్రమపురి ధవళగిరినడుమ నిటునటు కొన్నాళ్ళ వఱకిట్లే తిరుగుచుందు ననియు నాతఁడు చెప్పియుండెను.'

కమల యిఁక మాటాడలేక నిజస్థానమునఁ గూలఁ బడెను. బాష్ప కణములాపె కన్నులనుండి జారి వక్షస్థలమునఁ బడుచుండెను గాని, యాజన సమూహముఁజూచి యాశ్రుప్రవాహ మాగిపోయినది.

అంత భగవత్పాదుఁడిట్లనిరి. ఐదేండ్లక్రిందటఁ దనతో నావమునఁ బ్రయాణ మొనర్చినది గంగాధరుఁడే యని యాతఁడు గుఱుతింపఁజాలక పోయెను.

'నీవిట్లు గుఱుతింపఁ జాలకుండుటకుఁ గారణమేమి? నీవు దీర్ఘకారాగార వాసముచే మతిభ్రష్టుఁడవై పోవుటవల ననే యగునా?'

'అతిదీర్ఘ కారాగార వాసము !' అని యాతఁడతి దీనముగ ననియెను. సభాసదుల గుండెలు ఝల్లుమనియెను.

'నీకీ సందర్భము లేవియు జ్ఞప్తియందు లేవా ?'

'లేవు. నేను బోల్నాడు కారాగారమును జేరినది మొదలీయూర నాకూఁతు నింటనున్నంత వఱకేమి జరిగినదో గోచరింపకున్నది. నాకూఁతు రొనర్చెడి సపర్యల నందుచు నిపుడు సౌఖ్యముగఁ గాలము గడుపుచున్నాను. ఈకమల నాకెట్లు ప్రేమాస్పదమైనదో కూడ నాకు గోచరించుటలేదు.'

భగవత్పాదుఁడు నిలువఁబడి సమాధానములఁ జెప్పునపుడు కమల యాతని కరముల గట్టిగఁబట్టికొని, యాతనికిఁ జేదోడై నిలిచియుండెను. దండనాథుఁడు కూరుచుండఁగనే, వీరిరువురు నిజస్థానముల నాసీనులైరి. త్రివిక్రముఁడును, 'ఐదేండ్లకుఁబూర్వము, కమలా భగవత్పాదులతోఁ బ్రయాణముఁజేయుచు, విక్రమపురమున నోడనెక్కి యందీతని జూచియుంటినిగాని యాతనితో నేమియుఁ బ్రసంగించి యుండలేదు. ఇంతకంటె నాకెక్కువ విశేషములు దెలియవు' అని చెప్పి కూర్చుండెను.

ఈ సమయమున నాయాస్థానమున నొక చిత్రము జరిగెను. గంగాధరుఁడు నాల్గేండ్లకుఁబూర్వ మొకనాఁడితర ప్రయాణికులతోఁబాటొక శకటముపైఁ గొంతదవ్వేగి, యర్థరాత్రమున నొకచోదిగి, మరలఁ గొంతదూరము వెనుకకుఁ

బోయి, ధవళగిరి సైన్యవిక్రమ స్థానముఁ జేరి వారి సంఖ్యను, బరికరణములను దెలిసికొని శత్రువుల కెఱింగించెనని నిరూపించుటకుఁ బ్రయత్నములు జరుగుచుండెను. ఎవరి కొఱకో నిరీక్షించుచు నానాఁడా యూరిలో నొకయింట గంగాధరుఁడు విడిసియుండెనని యొక సాక్షి ప్రభువునకు విన్నవించు చుండెను.

ఇంతవఱకు నీ విచారణ యందెట్టి జోక్యమును గలుగఁజేసి కొనక వెఱ్ఱివానివలె మిన్ను జూచుచున్న ప్రభాకరుఁడొక చిన్న కాగితముపై నేదియో వ్రాసి, దానినొక గోట్టమువలెఁ జుట్టి, విశ్వనాథుని జేరునట్లుగ విసరివైచెను. ఆ కాగితము విప్పి చదివికొని యా న్యాయవాది నిందితుని నఖశిఖ పర్యంతమత్యాశ్చర్యముతోఁ జూడఁజొచ్చెను.

'ఆ నాఁడా యూరిలోఁ జూచిన దీనిందితునే యని నీవు గట్టిగాఁ జెప్పఁగలవా?'

'అవును. ఈతఁడు తప్ప వేఱొకఁడుకాడు.'

'ఇతని బోలువాని నింకొకని నెన్నఁడైనఁ జూచియుంటివా?'

'లేదు. ఈతని గుర్తించుటలో నెట్టి ప్రమాదమును గలుగదు'

ప్రభాకరుని వంకకు వ్రేలుఁ జూపుచు నా న్యాయవాది,

'నా మిత్రుఁడాతని జూడుము. ఈ నిందితుని జూడుము. వారొకరి నొకరు పోలియుండలేదా?'

సభాసదులందఱు నొకేసారిగా వారిరువురిపైఁ బరిశీలన దృష్టి నిగుడ్చిరి. ప్రభాకరుఁ డెప్పటియట్లే నిలచియుండెను గాని తలపాగను మాత్రము దీసివేసెను. ప్రభాకరుఁడించుక న్యశ్రద్ధాన్వితుఁడై యుండెనే కాని వారిరువురి రూపవైఖరుల యందెట్టి వ్యత్యాసమును లేదు. ఒకరిఁజూచి మఱొకరిఁ జూడ నక్కరలేదు. అందుచే నీ సాక్షియొక్క వాఙ్మూలము నిరర్థక మయ్యెను,

విశ్వనాథుఁ డంత్యమున నిట్లుపన్యసించెను.

మహాప్రభూ! రఘుపతి కుటిలాచరుఁడును, దుర్మార్గుఁ డును, విశ్వాసహీనుఁడునని యాతని సాక్ష్యము వలన విశద మైనది. వాసవుఁడాతని యనుచరుఁడు కుట్రలఁ బన్ని సాధు జనులను హింసించు చుండుటయే వీరి వృత్తి. గంగాధరుఁడు వీరి కేదియో సహాయము చేయులేదనెడి యసూయవలన నీ నేరము నాతనిపై మోపిరిగాని యిది కేవలము కల్పితము. విక్రమపురవాసియగు నీ నిందితుఁడు స్వకార్య నిర్వహణము నకై స్వదేశమునకుఁ దఱుచుగాఁ బోయి వచ్చుచుండుటవలననే యీ నేరమిట్టి రూపమున నుంపఁబడినది. వీరారోపించియుండిన దుష్కార్యములఁ జేయఁగల సమర్థత యీ నిందితునకు లేదని యీతని లక్షణములఁ బట్టియే మీరు గ్రహించి యుందురు. సర్వవిదులగు మీకు నేను గ్రొత్తగాఁ జెప్పునది లేదు, నింది తుఁడు శిక్షార్హుఁడు గాఁడనియు, నిరపరాధియనియు విన్న వించుకొను చున్నాను.

ప్రతాపరుద్రుఁడు మంత్రులతో నాలోచించుటకై, వారితోఁ గూడి సభావేదిక విడిచి యేగెను. విశ్వనాథుఁడు తన చుట్టు ప్రక్కల నున్నవారితో నీ విచారణ ఫలితముఁ గూర్చి యత్యాతురముతో ముచ్చడించు చుండెను. ప్రభువుయొక్క దయార్ద్రహృదయమును, న్యాయనిర్వహణ కాంక్షయు నెఱిఁగిన జనులు పెక్కండ్రు గంగాధరుఁడు బంధ విముక్తి నందునని గుసగుస లాడుకొను చుండిరి. రఘుపతి, వాసప్రులు, తమ నీచ ప్రవర్తనము బయట పడునేమోయని భయపడఁ జొచ్చిరి. గంగాధరుఁ డేమి యనుకొను చుండెనో యెఱుఁగము కాని యాతఁడు నిర్భయుఁడై నిలిచియుండెను. ప్రభాకరుఁడు మాత్ర మెవరితోను మాటాడుటలేదు. ఆకసమువంక నిశ్చలముగఁ జూచుచు నాతఁడు కూర్చుండియుండెను. కాని సభారంగ మందలి విశేషముల నాతఁడు పరికించుచునే యున్నాఁడు హఠాత్తుగా నాతఁ డొక్కసారి యెలుగెత్తి 'ఆ బాలికఁ జూడుఁడు మూర్ఛ నందుచున్నది. ఆ ముదుసలి వానికై సహాయముఁజేసి, యామె కుపచారములఁ జేయుఁడు. మీ రా మాత్రము చూడలేరా ?' యని కమలఁ జూపెను. కమల మూర్ఛిల్లి జనకునిచేతులం దొరగి యుండెను. ఆమెను నెమ్మదిగ నటనుండి బయటకుఁ దీసికొనిపోయిరి. శంకరభగవత్పాదుని చిత్తవైకల్య మాతని ముఖమునఁ బ్రతిబింబించుచునే

యుండెను. సభాసదు లెల్లరును బ్రకంపితగాత్రుఁడగు నా వృద్ధుని, మూర్ఛితయగు నాతని పుత్త్రికను జూచినపుడు చాల విచారిమందిరి. ప్రభాకరుఁడు కమలస్థితి నరసివచ్చి మరల గంగాధరునితో నిట్లు ప్రసంగించెను.

'ఆ బాలికస్థితి నెఱుఁగ నీ వాతురత పడుచుంటివిగదా. వినుము. ఆమెకు స్వస్థత చిక్కినది'

ఆమె మనో వికారమునకు నేనే కారకుఁడ నైనందు లకుఁ జాల చింతించు చున్నాను. ఈ విషయమును వాదన పూర్వకముగ నామెకుఁ దెలుపఁగలవా ?'

'తెలుపఁగలను. నీవు కోరినయెడల తెలుపుదును'

గంగాధరుని చేతనే యోరగిలఁబడి నిలచి మాటాడు చున్న ప్రభాకరుని వాచాధోరణి మిగుల నికృష్టముగను నిర సన భూయిష్టముగ నుండెను.

'అట్లు చేయుఁడని మనః పూర్వకముగ మిమ్ములఁ గోరుచున్నాను. నా వందనముల నందికొనుఁడు'

'వినతుఁడైయున్న యా నిందితుఁ జూడకయే ప్రభా కరుఁడు'

'గంగాధరా, నేఁడు నీ గతి యేమగుననుకొందువు ?' అనెను

'వేఱేమున్నది ? అధోగతియే'

'అట్లనుకొనుచుండుటయే సర్వదా శ్రేయస్కరము. కాని నిన్ను విడువవలయునని మంత్రివర్గము రాజును బోత్సహించుచున్న ట్లున్నది.'

కతిపయ నిమేషములు గడచిన పిదపఁ బ్రతాపరుద్రుఁడు తీర్పుఁజెప్పెను.

"గంగాధరుఁడు నిరపరాధి.'

అతఁడు బంధవిముక్తుఁ డయ్యెను.



రెండవ ప్రకరణము.

# ప్రభాకరుఁడు.

---

న్యాయసభ ముగియఁగనే, కమలా భగవత్పాదులు విశ్వనాథ త్రివిక్రములు, గంగాధరుని చుట్టును నిలచి, పరామర్శ మొనర్చు చుండిరి. ఆతని విడుదలకు సంతోషాతిశయములఁ గనఁబఱచు చుండిరి.

విజ్ఞానయుతమగు ఫాలముతో యౌవనునివలె నుత్సాహవంతుఁడై మాటాడుచున్న భగవత్పాదు నపుడు చూచినవారెవరును, విక్రమపురమున నొంటరిగ, జీకటిగదియందు విధియు విరామమునులేక బట్టలఁగుట్టుకొను దర్జియా యితఁడని శంకింపరు. కాని యాకష్టకాలముగూర్చి యెవరేని జ్ఞాపకముచేసినపుడాతని శాంతమూర్తిమే ఘూచ్ఛాదితమై, విచారనిమగ్నమగు వికలస్వరూపము నందుచుండును. సరస సంభాషణలచే నాతని మనోవికారమును రూపుమాపి, ప్రేమవాహినీ తరంగముల నాతని నోలలాడఁజేయఁ గలిగిన దొక్క కమలయే.

గంగాధరుఁడు విశ్వనాథుని కభివందన మాచరించి యాతఁ డొనర్చియుండిన సహాయమునకుఁ గృతజ్ఞత వెలిపుచ్చుచుండెను. బంధవిముక్తుఁడగు నాతని భగవత్పాదుఁ డొకించుక సేపు నిదానించిచూచి, యేమి జ్ఞప్తికిఁ దెచ్చుకొనెనోకాని

నిర్విణ్ణుఁడై నిలచిపోయెను. అసహ్యమును, అనుమానమును ముప్పిరిగొని మదిని వేధింప, భయవిహ్వల చిత్తుఁడై పరధ్యానమున నాతఁడేమి వితర్కించుకొనుచుండెనో!

"నాయనా! కాలయాపన మేల. యింక నింటికేగుదుమా? యని కనుల సహజప్రీతిఁ బ్రశ్నింప నాతఁడా విభ్రాంతినుండి మేల్కాంచి, గంగాధర విశ్వనాథులవద్ద సెలవుఁగైకొని, పుత్రికంగూడి బండినెక్కి గృహాభిముఖుఁడై పోయెను.

ఒక్క త్రుటికాలములో నాస్థలమంతయు నిర్మానుష్య మైనది. ప్రభాకర గంగాధరు లిరువురు మాటాడుకొనుచు, వీధిఁబడి పోవుచుండిరి.

"మనమిద్దఱ మిపుడిట్లు కలిసికొనుట చాలఁజిత్రముగ నున్నది. నీ ప్రతిబింబము వలెనున్న నన్నుజూచి యేమనుకొను చున్నావో?" 'నాకీ లోకమింకను గ్రొత్తఁగనే యున్నది. నా మనసు కుదుటఁబడలేదు"

'అవును అది సహజమే. నీవు పరలోకయాత్రార్థమై, కొంతదూరముపోయి, మరల నీలోకమునకుఁ దిరిగి వచ్చితివి. నేను మాత్ర మీలోకములో నున్నాననుమాట మఱచుటకే సదాకోరుచుందును. అందువలననే మద్యపానముఁ గూడ నల వఱచుకొంటిని. నాకీ ప్రపంచముతో నేమియుఁ బనిలేదు ఈ ప్రపంచమునకు నాతో నంతకంటెను బనిలేదు.

సందిగ్ధ సమయమున, విశ్వనాథునకు సలహానిచ్చి, తన ప్రాణములను రక్షించినది ప్రభాకరుని సూక్ష్మబుద్ధియేయని గంగాధరునకిపుడు జ్ఞప్తికి వచ్చినది. అందుల కాతని మిగులఁ గొనియాడెను.

"నన్ను నీవు పొగడ నక్కరలేదు. నేను నీ పొగడ్త కనర్హుఁడను" అని యాతఁడు నిర్లక్ష్యముగ సమాధానముఁ జెప్పుచుండెను "మొదటి విషయము. నేను జేయఁగలిగినది గొప్పపనిగాదు. రెండవ విషయము, అట్లేల చేసితినో, నేనే యెఱుఁగను. దీనికేమిగాని, గంగాధరా, నిన్నొకమాట యడుగుదునా?'

'నాకు మీరు చేసిన సాహాయ్యమునకు బదులుగ నా మాత్రము స్వతంత్ర మీయజాలనా?'

'నీపై నాకుఁజాల నభిమానమున్నదని యనుకొనుచున్నావా?'

గంగాధరున కేమియుఁ దోఁపలేదు.

'ప్రభాకరా, నేనీవిషయమై యింతవఱ కాలోచింపనే లేదు.'

'ఏదీ ఇపుడు కొంచెమాలోచించి చెప్పుము.'

'మీకునాపై ననురాగమున్నట్లే ప్రవర్తించుచున్నారు గాని, నిశ్చయముగా మీమనస్సున నిట్టి భావమున్నట్లు తోఁపదు.'

'నామనస్సున నట్టిభావ మున్నదని నాకును దోఁచుట లేదు.'

'అయ్యో! ఎటులైననేమి. మీరాగ్రహింపకుఁడు. నేఁబోయివచ్చెదను. సెలవొసంగుఁడు.'

గంగాధరుఁడాతనికి నమస్కరించి, వెడలిపోవుచుండెను. ప్రభాకరుఁడాతని మరలఁబిలిచి,

'అయ్యా. మీయెడ నిర్లక్ష్యభావముతో నున్నానని యేమైన నొప్పుకొంటిరా? నేను జాల దురదృష్టవంతుఁడను. నాయాశాలతలన్నియుఁ దెగిపోయినవి. నేనీ ప్రపంచమున నెవ్వని లెక్కసేయను. ఈ ప్రపంచమున నెవరును నన్ను లెక్కసేయరు."

గంగాధరుఁడు విస్మితుఁడై తన దారిఁ బోయెను. సాయంకాలమైనది. ప్రభాకరుఁడు పిచ్చివానివలె నాకసము వంకఁ జూచుచు, నొంటరిగ నగరవీధు లన్నిఁటను దిరుగుచునే యుండెను. ఒక మార్గమునఁ బోవలయునని కాని వేఱొక మార్గమునఁ బోగూడదని కాని యుద్దేశ్యము లేవియు నాతని కున్నట్లగపడుటలేదు. అంధకారబంధురమైన యారాత్రి జాము ప్రొద్దుపోవుసరి కాతఁడు పట్టణ బాహ్యప్రదేశముఁ జేరెను. ఆతఁడొక యిసుకతిన్నపైఁ గూర్చుండఁబడి లోలోన నిట్లు వితర్కించుకొనుచుండెను.

'ఆతనిపై నీకు నిశ్చయముగ ననురాగమున్నదా? నిన్ను బోలి యున్నాఁడని యాతనిపై నీకనురాగమొదులను?

నీ యందొక్కటైనను మెచ్చుకొనఁదగిన గుణము లేదుగదా. అది నీవే యెఱుఁగుదువు. ఆతని జూచినప్పుడెల్ల నీ యథః పతనము జ్ఞప్తికి వచ్చుచుండుటలేదా ! నీ వెట్టి యుత్తమ స్థితిఁ జెందఁదగినవాఁడవో, యాతని జూచిన దెలియుచున్నదా ! నీవే యాతని స్థితిలో నున్న నా బాలిక ప్రణయదృగంచలములు నీపైఁ బ్రసరించెడివా ? ఆపె సుకుమార లావణ్య గాత్రము నీ యవస్థఁ జూచి కంపించెడిదా ? ఆతనికి నీకును దారతమ్యము తెలిసినదా ? నిజముఁ జెప్పుము. ఆతనిపై నీకుఁ గనికరములేదు. వాఁడు నీవిరోధి. ఆతఁడానిర్జన ప్రదేశమున నాలోచనా నిమగ్నుఁడై పండుకొని - యట్లే నిద్రవోయెను.

ఆతఁడు మేల్కాంచిచూచు నప్పటికిఁ బూర్వ దిశాంగన యర్థచంద్రాభరణ భూషితయై విరాజిల్లు చుండెను. కునికిపాట్లు పడుచు లేచుచుఁ గొంతసేపట్లు గడపి, ప్రభాకరుఁడు చివాలున లేచి, పట్టణాభిముఖుఁడైపోయి, యందు బ్రవేశించి, విశ్వనాథుని యింటితలుపుఁ దట్టెను.

విశ్వనాథుఁడు మర్యాదగల గొప్ప కుటుంబములోనివాఁడు. ఆతనివయస్సు ముప్పది యేండ్లకు మించియుండదు. మేధాశక్తియు, న్యాయవిద్యా పారంగతత్వమును గలిగి, యుత్సాహమును గార్యదీక్షయుఁగల గడుసుమగఁడై, న్యాయాన్యాయ విచక్షణయందు, సరస వచోగుంభనచేఁ బ్రతాపరుద్రు

నొప్పించుచు, నాతఁడు పేరు ప్రఖ్యాతిని, ధనమును గొల్ల లుగ సముపార్జించు చుండెను. విశ్వనాథుఁ డొకపుడైశ్వర్య వతియగు తరుణవయస్కురాలి నొక్కర్తు వివాహమాడనెంచి యుండెను గాని, యా వధువున కంతటి స్థూలకాయునిపై నిష్టము లేకుండటచేఁ గాఁబోలు, నా సంబంధము ముడివడ లేదు.

సోమరిపోతగు ప్రభాకరుఁడాతనికి సర్వకార్యముల యందు సహాయకారిగ నుండెను. విశ్వనాథుఁడెప్పుడు నే యాస్థానమున వాగ్వివాదమునఁ బాల్గొనుచున్నను, నాచోట నే ప్రభాకరుఁ డాకాశము వంకకుఁదలనెత్తి వెఱ్ఱిచూపులఁ జూచు చుండును. వారిరువురు నెచ్చటఁ దిరిగినను గలిసియే యుందురు. వారిరువురును వ్యవహార విషయముల మాటాడుకొనుచునో, లేక వ్రాసికొనుచునో, రాత్రియంతయుఁ గడపుచుందురు. ప్రభా కరుఁడు తెల్లవాఱుజామున, విశ్వనాథుని గృహాంగణము విడచి, రాజవీధి నడచుచు నిద్రమత్తుచేఁ దూలిపడుచు, స్వగృహమున కేగుచుండునని పలువురు చెప్పుకొను చుందురు. కాని యీ బ్రహ్మచారుల జోక్యమెవరికిఁగావలెను ? వెఱ్ఱి ప్రభాకరుఁడు విశ్వనాథుని వెంట గుక్కవలెఁ దిరుగుటకుఁదప్ప నింకెందులకుఁ బనికిరాఁడని మాత్రము జనులందఱు గట్టిగా నమ్ముచుండిరి.

విశ్వనాథుఁడు తలుపుదీసి, ప్రభాకరు నాశ్వాసించి, యింటిలోనికిఁ దోడ్కొనిపోయెను.

"ప్రభాకరా ! ఏమి నేఁడింత యాలస్యమైనది? "

'నేఁడా గంగాధరునితో మాటలాడితిని. ఆతనివిషయమై యేదియో తలపోయుచుంటిని."

"అగుఁగాని, న్యాయస్థానమున నాతని నిర్దోషిఁగా ఋజువుచేయు సమయమున నీకట్టి యూహాయెట్లు స్ఫురించిన దోయీ ! ఆతఁడు నీవలెనున్నాఁడని యెట్లు గుర్తింపఁగలిగి తివి" అది నీ కెట్లు తట్టినది.

'అతఁడు చక్కనివాఁడనియు, నాకుఁగూడ నదృష్ట మున్నయెడల నాతనివలెనే యుండవలసిన వాఁడననియు నను కొంటిని'

విశ్వనాథుఁడు వికటహాస మొనర్చెను.

'ప్రభాకరా! నీ అదృష్టమున కేమిగాని! మన కీపూట కొంచెము పనియున్నది'

ప్రభాకరుఁడు తన యుత్తరీయము దీసివైచి, యంగర ఖాను సడలించి, యొక తడిగుడ్డను దుడిచి తలపై నిడుకొని వ్రాతబల్లకడఁ గూర్చుండెను.

'నేను సిద్ధముగా నున్నాను. ఏవీ. కాగితములు. కష్ట తరమైన విషయము ముందు చూచెదను'

ఆతఁడు కాగితములఁ జదువుచు, నడుమ నడుమ నేదియో వ్రాయుచుఁ దీవ్రముగఁ బనిచేయుచుండెను. రెండు మూఁడు అధ్యాయములు, క్లిష్ట సమస్యలను పరిష్కరించు

టకుఁ గాఁబోలు- తలపై నెండిపోయిన గుడ్డను మరలఁ దడిపి కొని- రెండు గంటలలోఁ బనినంతను ముగించెను. విశ్వ నాథుఁడు గునికిపాట్లు పడుచు, రెండుమూఁడు కాగితములఁ జదివి, యనాయాసముగఁ బని ముగించెను.

'ప్రభాకరా, నీవీదినమున గంగాధరుని విషయమున నిచ్చియుండిన సలహాలన్నియుఁ జాల మంచివిసుమా'

'నేనెప్పుడు మంచి సలహాలనే యిచ్చుచుందును కాదా ?'

'నేను గాదనను, చిన్ననాఁడు జానాము గ్రామమున విద్యాసాగరుని బడియందు విద్యనేర్చిన ప్రభాకరుఁడవే నీవా ? ఈ క్షణములో మిగుల నుత్సాహము, మఱుక్షణములో విచారము. ఇపుడాటు, మరలఁ బోటు :'

'ఆహా ! ఆ ప్రభాకరుఁడనే. అప్పటి యదృష్టమే యిపుడును ! అపుడైనను, నేనితరుల లెక్కలనే చేసి పెట్టు చుండెడి వాఁడనుగాని నా లెక్కలను జేసికొను వాఁడనే కాను ?'

'ఎందుచేతనో ?'

'దేవుఁడెఱుఁగును. అది నా స్వభావ మనుకొందును'

ఆతఁ డంగరఖా జేబులం జేతులిడుకొని, కుర్చీయం దొరగిలఁబడి కూర్చుండి యకాశమువంకఁ జూచుచుండెను.

'ప్రభాకరా! అప్పటికి నిప్పటికి నీ నడక సవ్యమైనది గాదు. నీవు తలఁచికొన్న పనిఁ జేయుటకు శక్తి సామర్థ్యములః

దుదివఱకు వినియోగింపవు. నన్నుజూడుము!' అని ప్రగల్భముగా నా న్యాయవాది మీసము దువ్వికొనెను. ప్రభాకరుఁడు చలింపక నవ్వుచు, 'అబ్బా! యెందులకీ కంఠశోష! నీవు నాకు బోధచేయ నవసరము లేదులే!' యనెను.

'నేనిదివఱకుఁ జేసిన పనినంతయు నెట్లు చేసితిని? ఇపుడు చేయునదంతయు నెట్లు చేయుచున్నాను?'

'కొంతవఱకు నాకు డబ్బిచ్చి నా చేతఁ జేయించుకొనుచున్నావు. కాని విశ్వనాథా! యీ విషయమై నాకు బోధింపఁబూనుట తగదు. నీవు చేయఁదలచిన పనిని జేయుచుందువు. నీవెప్పుడు ముందుచూపే. నేనెప్పుడు వెనుకఁబడియే యుందును.'

'నేనుకష్టపడి, నాశ్రమవలన గొప్పవాఁడ నగుచున్నాను. నేను బుట్టుకలోనే గొప్పవాఁడనై పుట్టలేదుగదా. ఏమందువు?'

'జానామములో నుండుటకుఁ బూర్వమును, జానామములో నున్నపుడును జానామములోనున్న తరువాతఁగూడ నీకుఁదగిన వారితో నీవుచేరితివి. నాకుఁదగిన వారితో నేఁజేరితిని. విక్రమపురమున నాదేశ వ్యవహారభాషల నేర్చునపుడైనను, నీవెక్కడనో యుంటివి. నేనుఅనామకుఁడనై-యుండియు లేనట్లుంటిని.

'అది యెవరితప్పు?'

'మనస్ఫూర్తిగాఁ జెప్పుచున్నాను, ఆదోషములో నీకు భాగములేదని నమ్మఁజాలను. నీవు నిరంతరము, విసువు

లేక, విరామములేక, కృషిచేయుచుంటివి. అట్టి నిరంతరకృషి మాబోంట్లకు సాధ్యమగునా? ఈ యపరరాత్రివేళ మన పూర్వ చారిత్రముఁగూర్చి తలపోయుట దుస్సహము. ఈ ప్రసక్తి వదలి వేఱొకటి యెత్తుకొనుము.'

'అటులైన, నిదిగో, యీనాఁడు న్యాయస్థానమున సాక్ష్యమిచ్చి యుండిన బాలిక, కమల, సౌందర్యవతియని యొప్పు కొందువా ? ఏమి, ఆమె విషయమై ప్రసంగించుట నీకుత్సాహ జనకముగ నున్నదా ?'

ప్రభాకరునియం దట్టియుత్సాహ మగుపడలేదు. ఆతఁడు మరల విచార నిమగ్నుఁడయ్యెను.

' సౌందర్యవతియా ! నేనట్టివారలను జాలమందిని జూచితిని.'

విశ్వనాథుఁడు, గంభీరముగఁ జూచుచు, మీసముల దువ్వికొనుచు, 'నీవామె మూర్ఛవోవుటను దొలుదొల్తనే గ్రహించుటవలన నామెపై నీకనురాగ ముదయించెనేమో యని యనుమానపడితినిసుమా' యనియెను.

'ఆమె మూర్ఛిల్లుచుండెనని తెలిసికొనుట మహాకార్య మా ? కానిమ్ము. నేనిం కేమియు మాటాడఁ దలఁచుకొనలేదు. ఇఁక నింటికిఁబోయి నిద్రింతును.'

విశ్వనాథుఁడు చేత దీపముఁబట్టికొని తన మిత్రుని వీధి గుమ్మమువఱకు సాగనంపెను. అప్పుడే శుక్రుఁడు తూర్పున

బారెడెత్తున వెలుఁగుచుండెను. సమీప నదీతోయములపై నుండి వెల్వడెడి శీతలవాయు స్రోతముల నోకించుక నొచ్చియు, నిర్జీవ ప్రతిమవలెనున్న యీదృశ్యమును గమనింపని వానివలె, ప్రభాకరుఁడు దప్పటడుగు లిడుచు నిజగృహాభి ముఖుఁడై పోయెను.

అట్లుపోవుచు నాతఁడు తన శక్తిసామర్థ్యములు నిరర్థకములైపోవుచుండుట దలఁచి వగచెను. సదాశయాసక్తివలనను, గార్యదీక్షచేతను, దన జీవితమును సార్థకముగ నొనర్చుట యసాధ్యముకాదని యాతఁడెఱుఁగును. అతఁడు స్వగృహమును బ్రవేశించి, యేకాంతముగ ధూళిధూసరిసమాశ్రితమగు శయ్యపైఁబరుండి నిద్రించెను. అతని తలదిండు కన్నిటిధారలచేఁ దడిసిపోయెను.

ప్రభాకరుఁ డుదయించి క్రమక్రమముగ నాకసము నధిరోహించుచుండెను. ఉత్తమమగు సామర్థ్యమును, ఉత్కృష్టమగు భావోత్కర్షమును గలిగి, యీ యంతశ్శక్తుల స్వలాభమునకై వినియోగించుకొనఁజాలక, స్వదేశమునకు స్వయం సహాయము నొనర్చుకొనలేని స్వకీయ నిష్ప్రయోజకత్వమునకు మనః పూర్వకముగఁ దలయొగ్గిన ప్రభాకరునిపైఁ ప్రభాకరుఁడు తన వాఁడి కిరణములఁ బ్రసరింపఁ జేయుచుండెను.

---

మూఁడవ ప్రకరణము.

# రాణారామప్రసాద బహద్దరు.

---

రాణావంశీయుఁడగు రామప్రసాద బహద్దరు సుమారిఱువదేండ్ల ప్రాయమువాఁడు. ఆతఁడు పరిశుభ్రమైన దుకూలముల ధరించి, చక్కఁగా దిద్దఁబడిన కురులతోఁ బటాటోపము గల చూపులతో జోడు గుఱ్ఱముల బండినెక్కి విక్రమపుర రాజమార్గముగుండఁ బోవుచుండెను. ఆ శకటము మెత్తనిగండ్లతోఁ గూడి మిగుల సౌఖ్యదాయకముగ నుండెను. కాని, గుఱ్ఱములఁ దోలెడివాఁడు మాత్రము, నిజోన్నత స్థానమునఁ గూర్చుండి, శత్రుసమూహముపై నుఱికించెడి రథమునట్లు, బండిని దోలుచుండెను. అట్లు తోలుట వలన మార్గమధ్యమున నెవరికైన హానికలుగునేమో యని వాఁడాలోచించునట్లు లేదు. యజమానుఁడైన యాతని మందలించుటలేదు. మానవుల కష్టసుఖముల కోడక కాలచక్రమెట్లు నిరవధికముగ సాగిపోవుచుండెనో, యట్లే రాణాప్రసాదుని బండిచక్రములకును అడ్డులేదు. కష్టపరంపరలచే నార్తిఁగుందెడివారు దేవుని దూఱుటెట్లు నిరర్థకమో, యట్లే రాణాప్రసాదుని బండిచక్రముల క్రిందఁబడి వికలాంగులైన వారాతని దూఱుట నిష్ప్రయోజనకరమే. కాక, హానికరము కూడను. ఏలయన నాకాలమున విక్రమపుర

రాజ్యమున ధనమదాంధులగు జమీందారులు బీదసాదులను యథేచ్ఛగ వేధింపఁగల దురధికారము గలిగియుంకిరి. వారి యనిష్టమునకుఁ బాత్రులైన మందభాగ్యులఁ గారాగారములం దుంచుటకును, గొఱుత వేయించుటకును గూడ సమర్థులై యుండుటచేత నట్టి ధనికులతోఁ గయ్యాటము పాములతోఁ జెల గాటమని జనులంద తెలుఁగుకురు. పురవీథులగుండ మహావేగ ముతో గుఱ్ఱములఁ బరువెత్తించుచుండుటచేఁ బసి బిడ్డలకును స్త్రీలకును బ్రాణహాని కలుగుచుండెనని ప్రజ లెన్నిసార్లు మొఱలిడినను, వాని నాలకించువారు లేరు. పసిబిడ్డలు బండ్ల క్రిందఁబడి మరణింపకుండ జాగ్రత్తఁ దీసికొనవలసిన విధి తల్లి దండ్రులదే కాని ప్రభువులది కాదుగదా!

కర్ణపుటముల భేదించెడి కఠోరధ్వనితో రాణాప్రతా పుని శకటము పరువెత్తుచుండెను. అది వీథియొక్క మూలలఁ దిరుగునప్పుడైన మెల్లఁగఁ బోవుటలేదు. మార్గమునం దాడు కొనుచున్న పసిబిడ్డల నెత్తికొనిపోయియు, స్త్రీల నదలిం చియుఁ బురుషులు లా శకటమునకుఁ దోవ చేయుచుండిరి. ఆ బండివాఁడుగాని, యజమానుఁడుగాని, వీని నేమియుఁ జూచుటలేదు. ఒక శావిచెంత మూలఁ దిరుగుటలో నొక గుఱ్ఱము పసిపాప నొక్కని దొక్కినది. చేరువనున్న జన సమూహ మొక్కసారి యెలుగెత్తి గొల్లుమనెను. గుఱ్ఱములు సకిలించి నిలువఁబడి పోవుటచే శకటముయొక్క తీవ్రగమనము స్తంభించిపోయెను.

గుఱ్ఱములు నిలువకున్న బండినాపెడివారు గారనుట నిశ్చయమే. బండ్లక్రిందఁబడి మొందఱు వికలాంగులైనను, వారిని జూచుటకేని యాగక, యవి నిరంతరాయముగఁ బ్రయాణ మొనర్చుచుండుట యా దేశమున నాచారమే. ఆ బండిపైనున్న సేవకుఁ డొకఁడు భయభ్రాంతుఁడై నేలపై కుఱికెను. గుఱ్ఱముల సంకెళ్ళ నిరువదిమంది పట్టి యాపియుండిరి. నిశ్చింతమగు చిత్తముతో రాణా బండిలోనుండి తిరిగిచూచి 'ఏమి? ఏమివచ్చినది?' యనెను.

దీర్ఘకాయుఁడును, వికృతాకారుఁడు నగు నొకఁడు గుఱ్ఱముల కాళ్ళ మధ్యనుండియొకమూట నెత్తికొని యాబావిచెంత తాతిపైఁ బెట్టికొని, యా బురదలో మోకరించి కూర్చుండి రోదనము చేయుచుండెను.

అమాయికుఁడగు నొక మానవుఁడు సవినయముగ,

'క్షమింపుము. రాణాబహద్దర్ ఒక పపిబాలుఁడు' అని రాణాప్రసాదునకు జవాబిచ్చెను.

'చెవులు బ్రద్దలగునట్లు వాఁ డెందుల కా గోల చేయుచున్నాఁడు? వీని శిశువా యది?'

'చిత్తము. రాణాబహద్దర్, క్షమింపుము, చిత్తము."

ఆ దీర్ఘకాయుఁడు లేచి నిలుఁవబడి రివ్వున బండివైపునకుఁ బరునెత్తుకొని వచ్చుచుండెను. రాణాప్రసాదుఁడు తటాలునఁ దన కరవాలము నొఱలోనుండి యూడఁబెఱుక నుంకిం

చెను. పాపమా దౌర్భాగ్యుఁడాగిపోయి, రెండు బాహువుల నెత్తి, కరములఁజాచి, వికలస్వరముతోఁ బ్రాణము పోయిన దని యఱచెను.

ఇంతలో జనులెల్లరు నా బండిచుట్టు మూఁగిరి. వారు దౌర్జన్యముఁ జేయఁదలఁచినట్లు గాని, క్రోధోద్భూతులైనట్లుగాని యగపడుటలేదు. రాణాను నిందించుటకుఁ గూడ వారు సాహసించుటలేదు. వారందఱు నిశ్శబ్దముగ నిలచినచోటు నుండి కదలుటలేదు. రాణాప్రసాదునకు సమాధానముఁ జెప్పిన యమాయికుఁడు వినయ వినమితోత్తమాంగుఁడై నిలచి యుండెను. కలుగులలో నుండి బయల్వెడలిన యెలుకల గుంపువలె నీ జనసమూహమును రాణా కలయఁజూచి - జేబులో నుండి యొక పట్టుసంచిని దీసెను.

‘మీరు మీ శిశువులను జాగ్రత్తపెట్టుకొనఁజాల కుండుట నాకు మిగుల నాశ్చర్యముగ నున్నది. ఎల్లపుడు నెవరో యొకరు త్రోవకడ్డము వచ్చుచునే యుందురు. మీరు నా గుఱ్ఱములకేమి హాని చేసితిరో యెవరెఱుఁగుదురు? ఇదిగో దీనిని వానికిమ్ము’ అనుచు రాణా, తన సేవకుని చెంతకొక నవరసును విసరివైచెను. అది క్రిందఁబడునపుడెల్లరును దాని వంకఁ దృష్టి నిగిడ్చి చూచుచుండిరి. ‘ప్రాణము పోయినదని తిరిగి యా దీర్ఘకాయుఁడమానుషస్వరమున నఱచెను.

ఆ జనసమూహములో నుండి త్రోవఁజేసికొని శీఘ్రగమనమున నొక నూతన పురుషుఁడాతని జేరవచ్చెను. ఆమాన

ఫుని జూడఁగనే యాతని బుజముపైఁ దలవంచి, యానిర్భా
గ్యుఁడు బాపిచెంత నున్న మృతకళేబరమును వ్రేలితోఁ
జూపుచు, నాక్రందనముఁ జేయఁదొడఁగెను. కొందఱు స్త్రీలా
మృతకళేబరము చుట్టును గుమికూడి నిశ్శబ్దముగ నిలచి
యుండిరి.

ఆ యాగంతుకుఁడిట్లనెను. "నాకు దెలియును.

"నాకు సర్వమును దెలియును. ప్రవరా! ధైర్యము
దెచ్చుకొనుము. నీ బిడ్డ యదృష్టవంతుఁడు కావున జనిపోయి
నాఁడు! ఎట్టిబాధయు లేక క్షణకాలములో జనిపోయినాఁడు
చూడుము! బ్రదికియున్న నొక్కనిమిష మైన నీ బిడ్డకు సౌఖ్య
ముండెడిదా?"

రాణాప్రసాదుఁడు చిరునగవుతో,

'ఓ హో, నీ వొక వేదాంతివలెనున్నావే! నీ పేరేమి?'
యని యడిగెను.

'నాపేరు వినాయకగ్రామణి'

'నీ వృత్తి'

'సారా అమ్మకము, రాణాప్రసాదబహద్దర్ ప్రభూ!'
రాణా యింకొక నవరసును క్రిందకు విసరుచు,

'ఇదిగో! వర్తకవేదాంతీ, నీవు దీని దీసికొని నీ యిచ్చ
వచ్చునట్లు వెచ్చించు కొనుము - ఏమి! గుఱ్ఱములు సరిగా
నున్నవా?'

ఆ జనసమూహము దిరిగి చూడకయే రాణాప్రసాదు బండియుం దొరగిలఁబడెను, బండి నడువసాగినది. ఆతని మనమున బశ్చాత్తాపము గాని చింతగాని లేదు. ఎరువు దెచ్చుకొనిన వస్తువు చెడిపోవ బాగుచేయించి యిచ్చినవానివలె నాతఁడు సంతుష్టాంతరంగుఁడై యుండెను. అపుడొక నవరసు రివ్వున నెగిరివచ్చి బండిలోఁబడి ఖంగున మ్రోగెను. రాణాప్రసాదుఁ డులికిపడి,

« అవును ! బండి నాపును ! దీనిని విసరినదెవరు ? "

అని యఱచెను

ఆతఁడు బండిలోనుండి వంగి తత్పూర్వము గ్రామణి నిలచియున్న చోటుఁజూచెను. అచట, ప్రవరుఁడు రెండుచేతు లతో ముఖము గప్పికొని రోదనము సేయుచుండెను. ఆతని చెంతనే స్థూలశరీరిణియగు నొకయువతి యేదియో కుట్టుకొను చు నిలచియుండెను. రాణాప్రసాదు సరళముగ శాంతస్వరమున నిట్లనెను.

'మూర్ఖులారా ! మిమ్ములనందఱిని బండిక్రిందఁ బడ వేసి త్రొక్కించిచంపెదను. ఈ నవరసును విసరినదెవరో నాకుఁ దెలిసిన, నాతని మెడపైనుండి యీ బండిచక్రములఁ బోని త్తును. ఆతఁడు పూనుకొనిన నెట్టిదురాతములఁ జేయఁగలఁడో జనులందఱు నెఱుఁగుదురు. అందువలననే వారిలో నొక్క రైనను బల్లెత్తి మాటయనలేదు. కన్నెత్తి యాతని జూచుటకుఁ

గూడ సాహసింపలేదు. కాని ప్రవరునిచెంత నిలచియున్న స్త్రీ మాత్రము రాణావంక బెదరక చూచుచుండెను. రాణాప్రసాదున కాపె వంకఁ జూచుట మర్యాదహీనముగదా! అతఁడెల్లర నొకసారి కలయఁజూచి, బండియందొరగిలఁబడి పొనిమ్మని సారథికాజ్ఞ నొసంగెను.

రాణాప్రసాదుని శకటము విక్రమపురవీథుల నధిగమించి యొక రాచబాటఁబడి పడమరదిక్కు పోవుచుండెను. ఆ బాట కిరుపార్శ్వముల రాగులు జొన్నలు మొదలగు పైరులు పెరుఁగుచుండెను. కాని యా క్షేత్రములకు సరియగు కృషి లేకుండుటచే నవకముగఁ బెరుఁగవలసిన పైరన్నియుఁ గృశించియుండెను. చీడపుర్వులకు నాకరములై, సగమెండియున్న యా పైరులే, దుర్భిక్ష పీడితమగు నా దేశమున జనబాహుళ్యమెట్టి విపత్పరంపరలకు లోనైయుండెనో విస్పష్టము చేయుచుండెను.

ప్రతి గ్రామమునందు, నన్నిజాతులవారును, కడుపు నిండఁ గూడు, నొంటినిండ బట్టలును లేక నిఱుపేదలై కాలముఁ బుచ్చుచుండిరి. పడిపోయెడి గృహములు, విఱిగిపోయిన నాఁగళ్ళు, చిక్కిపోయిన పశువులు, పూడిపోయెడి జలకూపములు, శిథిలములగు దేవాలయములు - అన్నియు నంత్యావస్థయందున్నవే. జనపదవాసులగు జనులు గూడఁ గృశించియుండిరి. ముదుసలులు వీథిగుమ్మముకడఁ గూర్చుండి కాయగూరలఁ

దరుగుకొనుచుండిరి. కొందఱు నిఱుపేద లాకలముల నేరికొని తెచ్చి యూరి బావియొద్ద శుభ్రపఱచుకొను చుండిరి. వారు క్షుద్బాధఁ దీర్చుకొనుట కవియే యాధారము. గ్రామస్థుల నిట్టి దుస్థితికిఁ దెచ్చిన కారణములు కూడ విస్పష్టముగఁ గన్పట్టు చునే యుండెను.

పన్నులు! దాఁబడిపన్ను, వృత్తిపన్ను, రాజపన్ను, జమీాందారుపన్ను, ఇంటిపన్ను, రోడ్డుపన్ను, - ఒకసారి వీరికి జెల్లింపవలెను. - ఇంకొకసారి వారికిఁ జెల్లింపవలెను. - ఇట్లు గ్రామములోని ధనమంతయు బీల్చివేయఁబడినది. తుట్టతుదకి పల్లెటూళ్లింకను నామ రూపములతో నిలచియుండుటయే యాశ్చర్యము !

రాణాప్రసాద బహద్దరొక గ్రామముగుండ బ్రయాణముసేయుచుండెను. ఆతని ప్రతినిధి యింటివద్ద బండి నిలచినది. ఆ బండిచుట్టును భయవిభ్రమములతో మూఁగియున్న జన సముదాయము నాతఁడు నిశ్చింతతోఁ జూచుచుఁ గూర్చుండెను. అపుడొక పసులకాపరి, దుమ్ముతో నలముకొనిన మేనితో, నా సమూహమునఁ జేరెను.

‘ వాని నిట్లు పట్టితెమ్ము ! ’ అని రాణా తన భృత్యున కాజ్ఞాపించెను. వాని బట్టుకొని వచ్చిరి. ఆతఁడేమి చెప్పునో వినవలెనను కుతూహలముతో జనులందఱు చుట్టుకొనిరి.

'మార్గమధ్యమున మేము నిన్ను దాఁటి వచ్చితిమి గాదా ?' యని రాణా ప్రశ్నించెను.

'చిత్తము. రాణాబహదూర్, నిజమే ?

'నీవు వింతగాఁ జూచుచుంటి వెవరివంక ?'

'రాణాబహదూర్. ఆ మనిషివంకఁ జూచితిని ;

వాఁడు కొంచెము నిదానించి, తన చేతనున్న కత్తితో నా బండి యడుగునఁ జూపెను. చుట్టునున్న వారందఱు నా బండి క్రింద నేమున్నదో యని వంగి చూచిరి.

'పసువా ? ఆ మనుష్యుఁడెవఁడు ? అటు చూపెద వెందులకు ?'

'క్షమింపుము. మహాప్రభూ ! వాఁడు గొలుసుఁ బట్టుకొని వ్రేలాడుచుండెను;

'ఎవరు ?'

'మహాప్రభూ ! ఆ మనుష్యుఁడు.'

'ఈ పసు పాపి ముఁడు వేధించికొని తినుచున్నాఁడే ! - ఆ మనిషి పేరేమి ? నీవీ ప్రాంతముల నందఱి నెఱుఁగుదువు గదా ? వాఁడెవఁడు ?

'వాఁడీ ప్రాంతములవాఁడు కాఁడు. నేను బుట్టినప్పటి నుండి యిక్కడనే యున్నానుగాని వాని నెప్పుడు చూడలేదు?

'గొలుసు పట్టి వ్రేలాడుచుండెనా ? ఎందులకు ? ఊపిరియాడక చచ్చుటకా ?'

‘ మహాప్రభూ ! అదేచిత్రము. వాని తలకాయ - యిలాగున - వ్రేలాడు చుండెను.’ ఇట్లనుచు నా పసుల కాపరి బండి ప్రక్కకుఁ దిరిగి, వెనుకకు వంగి, ముఖము నాకాశము వంకకుఁ ద్రిప్పి, తలను వ్రేలాడవేసెను.

‘ పోనిమ్ము. వాని పోలిక యెట్లుండెను ? ’

‘ మహాప్రభూ ! వాని శరీరము తెల్లని బూడిదతో నిండి యున్నది. పెనుభూతము వలె నెంతో పొడుగుగా నున్నాఁడు ?

‘ సరియే. మంచిపనిచేసితివి. దొంగవాఁడు నా బండిని బట్టుకొని వచ్చుచుండఁగాఁ జూచి నోరు మూసికొని యూర కుంటివి. విశ్వాసకా ! వీని దీసికొని పొమ్ము ! ’

విశ్వాసకుఁడా గ్రామమున రాణాకుఁ బ్రతినిధి. అతఁడు వీరి పన్నులఁగూడ వసూలు చేయుచుండును. ఆ సమూహ ములో నుండి రాణా యెదుటి కప్పుడే యాతఁడు వచ్చి యుండెను.

‘ చాలును. ఇఁక పొమ్ము ! ’ అని విశ్వాసకుఁడా పసుల కాపరి నావలకంపెను.

‘విశ్వాసకా! ఆ నూతన పురుషుఁ డీరాత్రి మీ యూరిలో విడిసిన యెడల నాతనిఁ గనిపెట్టి యుండుము. అను మానము తోఁచిన విడువకుము’

‘మహాప్రభూ, తమ యాజ్ఞ శిరసావహింతును.’

నాలుగవ ప్రకరణము.

# ప్రవరుని ప్రతిక్రియ.

---

రాణావంశీయుల దుర్గము విశాలమును సమున్నతియు నగు రాతి కట్టడము. దాని చుట్టును ప్రాకారము కలదు. ఫలపుష్పజాతుల వృక్షముల నేకము లాగృహము చుట్టును బారులు దీర్చి నాటఁబడి యుండెను. ఆ కట్టడమున కెదురుగ నొక గొప్ప శిలా విగ్రహమున్నది. రాణావంశీయులలోఁ బేరెన్నికఁగన్న రామప్రసాదను పూర్వీకుని దా విగ్రహము. ఇదియే కాక యా యావరణ ద్వారముల కిరుపార్శ్వములను నింకితర సాంకేతిక స్థలములందు ననేకములగు శిలాప్రతిమ లందముగ నిలుపఁబడియుండెను. రాతికట్టడము. రాతి ప్రాకారము. రాతి విగ్రహములు - ఆ కోట యంతయు శిలామయ మైనట్లుండెను.

రాణాప్రసాదుని శకటమా దుర్గ సామీప్యముఁ జేరు నప్పటికి జాము ప్రొద్దుపోయినది. రాణా రాకను జూచి యా గృహమునంతటను దీపములు వెలిఁగింపఁబడెను. ఆ ప్రభువు బండిదిగి, సేవకులు పట్టిన కంచుదివిటీల వెలుఁగున గృహప్రవేశముఁ జేసెను. ధనమును, సామర్థ్యమును గల జమీందారుల యింట నెట్టి యుత్కృష్టములగు భోగ్య వస్తువు లుండునో

వర్ణించుట యనవసరము. పాలరాతి నిమిడ్చిన బల్లలు మెత్తని పరుపులతోఁ గూడిన కుర్చీలు సోఫాలు, దివ్యకాంతుల నీనెడి దీపములు, కళావంతము లగు సుందర విగ్రహములు, చిత్ర విచిత్రగతుల నా గృహాంగణమునందు విలాసవంతముగ సమర్పఁబడియుండెను. రాణాయొక్క పడక టింటి రామణీయకమునకు మేరలేదు. ఆ గదియొక్క గవాక్షమునకు వెలుపలి వైపున, ఉక్కుతలుపులును, లోపలిభాగమున నద్దములు బిగింపఁబడిన కవాటములు నుండెను. రాణాప్రసాదు గదిలోనికిఁ బ్రవేశించినపు డా కిటికీల వెలుపలి తలుపులు తెఱవఁబడెను. వెలుపలనున్న వృక్షములును వాని నడుమనుండి మిణుకుమిణుకుమని వెలిఁగెడి నక్షత్రములు నా యద్దములోనుండి యా చీఁకటిరాత్రియం దస్పష్టముగ నగపడుచుండెను.

'నా యన్నకుమారుఁడగు గంగాప్రసాదు—ధవళగిరి నుండి రాలేదా ?' యని రాణాప్రసాదు తన సేవకు నడిగెను.

'మహాప్రభూ, యింకను రాలేదు.'

ఒక యఱగంట గడచెను. రాణాప్రసాదు ప్రయాణ దుస్తుల మార్చికొని గవాక్షమున కెదురుగ నొక కుర్చీపైఁ గూర్చుండి, వంటవాఁడు తెచ్చియిచ్చిన పాలగిన్నెను నోటఁ బెట్టుకొనఁబోవుచు, ఫలకో, వెంటనే యా గిన్నెను క్రిందఁ బెట్టెను, శాంతము తోను సహజమగు ధీవితోను 'అదియేమి ? చూడు !' మని పలికి, యా కిటికీవంకను వ్రేలిని జూపెను.

'మహాప్రభూ, ఏది, అదియా ?'

'కిటికీ వెలుపల, ఈ తలుపులఁ దెఱువుము'.

అట్లే తలుపుల నా సేవకుఁడు తెఱచి, బయటకుఁ దొంగిచూచెను. అటనేమియుఁ గానక,

'మహాప్రభూ, ఏమియును లేదు. ఈ చెట్లు నీరాత్రియుఁ దప్ప యిచ్చట నేమియునులేదు,' అని చెప్పి, ప్రభునాజ్ఞకై నిరీక్షించుచుండెను.

'మంచిది తలుపులను మరల యథారీతిగ మూసి వేయుము.'

తలుపులు మూయఁబడినవి. కొంతసేపైనపిదప, రాణా ప్రసాదునకు బండిచప్పుడు వినవచ్చెను. ధవళగిరియందు గంగాధరుఁ డనఁబరగెడివాఁడు, యాతని యన్నకుమారుఁడు—అతని దర్శనమునకై వచ్చియుండెను.

రాణాప్రసాదు, కుమారుని నత్యాదరముతో నాహ్వానించెనుగాని కుశలప్రశ్నము మాత్రము చేయలేదు. వారున్న గదియందు సేవకు లున్నంతవఱకును నెట్టి ముఖ్యవిషయములఁ గూర్చియు వారు ప్రస్తావించుకొనలేదు. సేవకులు పోయిన పిదప నా యువకుఁడును, బిన తండ్రియు నిట్లు మాటాడుకొనిరి.

'నే నే పనిమీఁద ధవళగిరికేగియుంటినో, దానిబూర్తి చేసికొనుటకై యిచటకు తిరిగిరావలసి వచ్చినది. నేను గలలో

నైనఁ దలంపని విపత్తులలోఁ జిక్కువడి యచటఁ జాలకష్టములఁ బాల్పడితిని. కాని ప్రాణాపాయము రానున్నను నే నా పనిని విడుచువాఁడను గాను!

'నాకుఁ బ్రాణనష్టము సంభవింపనున్నను, నా సహాయార్థము నీ వెట్టి స్వల్పశ్రమనైనను దీసికొనవనియే నా యూహ. గోప్యములుగ నుంప వలసిన నా స్థితిగతుల నను మానస్పదములుగఁ జేయుటకు నీవు తోడ్పడి యుండలేదా?'

'లేదు. లేదు. లేదు.'

'కానిండు అదియెట్లైననేమి? నాకు నీయందెట్టి విశ్వాసమును లేదు. నేఁదలఁచియుండిన పనుల కభ్యంతరములఁ గల్పించుటకు నీవు సర్వవిధముల బ్రయత్నింతువనియు, నన్నెట్టి కష్టములఁ బెట్టుటకైన వెనుదీయవనియు, నేనెఱుఁగుదును.'

'ఈమాట నీకిదివఱకే చెప్పియుంటిని. దయయుంచి, నే నపుడు చెప్పినమాటల మరల నొకసారి జ్ఞప్తికిఁ దెచ్చికొని యాలోచించు కొనుము!'

'నాకదియంతయు జ్ఞాపకమే'

'సంతోషము,-అని రాణా సంతసముతో ననియెను.

'కాఁబట్టి నే నీవిక్రమపురమునఁ గారాగారమున బంధింపఁబడకుండుట నీమరదృష్టమేకదా!,

'ఏమంటివి? నాకర్థమగుటలేదు. ఏమంటివి?,

'నాయుద్దేశ్యముఁ జెప్పెదను వినుము. ఇన్నియేండ్లనుండియు, మహారాజుయొక్క యాస్థానమున నీపలుకుబడి

తగ్గిపోవుటచే, నీవు తలఁచినట్లు నన్ను శిక్షించుటకు స్వాతం త్ర్యము లేకున్నది. అట్టి యధికారమే యీనాఁడు నీహస్త గతమైయున్నయెడల, నే నేకారాగారమునందో జన్మాంతము వఱకుఁ గృశింపవలసినవాఁడనే ?'

'నాకు సాధ్యమైన, నంతపనియుఁ జేసెడివాఁడనే. రాణావంశముయొక్క ప్రతిష్ఠను నిలువఁబెట్టుటకు, నిన్నొ మాత్రము చిక్కులఁబెట్ట వెనుదీసెడివాఁడఁగాను. కాని నా యధికారమంతయు నిప్పటికి నేలఁగలిసిపోయినది. ఈయధి కారము గోరువారలెక్కువైరి. కాని కొద్దిమందికి మాత్రమే యది లభ్యము. ఇట్టివిషయములందు విక్రమపురరాజ్య మధః పతితమగుచున్నది. మన సాటివారికెల్లరకు నెట్టి స్వేచ్ఛాలోప ము కలిగినది ! ప్రస్తుతకాలమున నొక క్రొత్త వేదాంతము బయలుదేఱినది. ఈ కాలమున మన యాధిక్యమును నిలువఁ బెట్టుకొనుట సులభసాధ్య మగుపనిగాదు.'

'మన మధికతను నిలువఁబెట్టుకొనఁబడిన పాట్లను, విక్రమపురమున మనలను నిందింపని వారులేరు '

'అటులే యనుకొందము. ఈపాటకపు జనులు మన లను నిందింపఁగలరేకాని యంతకంటె నేమిచేయఁగలరు ?'

'ఏమిచేయుదురా ? మా యందు భయముచే వారు, మన యందు భక్తిగలిగినట్లు నటించుచుందురేకాని వేఱుగాదు సుమా.'

ణీలయినపుడెల్ల బుద్ధివచ్చునట్లు వారిని దండించుటయే యుత్తమమార్గము ! దండనమే మనకుఁ బరమావధి '

'అట్లుగాదు. మనము ద్రోహమొనర్చితిమి. మనయభీష్టముల కడ్డువచ్చినవారినెల్లఁ గఠినముగ దండించి, యొక మహాద్రోహముఁ జేసియున్నాము. మన పరిపాలనా పద్ధతి నిందార్హముగ నాకుఁ దోచుచున్నది. నాతల్లి, యవసానకాలమునందుఁగూడ, నీదురంతములఁ బాప యత్నింపుమని నాకు బోధించియుండెను. నా మాతృసందేశమును శిరసా వహించి, కృతకృత్యుఁడ నయ్యెదను. నేనిపుడు చేయఁగలపని యెంతయో లేదు. కాని యీ రాణాయాసనము నీ మరణానంతరము—నీవు చిరకాలము జీవింపవలెననియే నా కోరిక - నా యధీనమైనపుడు, నా సర్వశక్తుల వినియోగించి, నిర్భాగ్యులగు మన ప్రజల కష్టములఁ దొలగింప యత్నింతును.

'కాని నీవీ నూతన వేదాంతము నవలంభించిన జీవనోపాధినెట్లు సమకూర్చుకొందువు ?'

' స్వయంకృషిచేతనే '

' ఎచ్చట? ధవళగిరిరాజ్యమందా?'

' అవును. మన వంశమునకెట్టి కళంకమును రానీయను. నేనచట మారుపేరున మెలఁగుచున్నాను.'

గంగాధరుఁడా రాత్రి యచట విశ్రమింప నొల్లక, పినతండ్రికడ సెలవుగైకొని వెడలిపోయెను. రాణాప్రసాదు ముఖ

మునందెట్టి వికారభావము నుదయింపలేదు. అతఁడు దరహాస ముఁజేయుచుఁ గుమారునకు సెలవొసంగి, శయ్యాతలముఁ జేరెను.

అతఁడు నిద్రాసక్తుఁడై విశ్రమించిన యాసమయమున, నానాఁడు విక్రమపురవీధియందు బావియొద్దున సుతుని మృత కళేబరముపైఁబడి యాక్రందన మొనర్చిన దీర్ఘకాయుఁడగు ప్రవరుని మూర్తియు, మార్గమధ్యమున నా జనపదమున బసులకాపరి వర్ణించిన కథలో, బండియడుగు, గోలుసుఁబట్టు కొనివ్రేలాడుచుండెడి పొడగరియు, నంతకుముందే గవాక్షము వెలుపల నుండి తన వంకఁజూచిన భీకరలోచనద్వయము నొక దాని వెంటనొకటి జ్ఞప్తికివచ్చినవి. కాని యీవిషయముల కన్యోన్య సంబంధమున్నట్లాతని కెట్టి యనుమానమును గలుగ లేదు. ♦ ♦ ♦ ♦

తెల్లవారెను. రాణాప్రాసాదమునందున్న శిలా విగ్రహములతోఁ బాటింకొక నూతన విగ్రహము చేరినది. అది రాణారామప్రసాద బహద్దరు మృతకళేబరము. ఒక నిశిత కృపాణ మాతని వక్షస్థలమున బ్రవేశించి వెన్నంట దిగి యుండెను.

---

ఐదవ ప్రకరణము.

# వాగ్దానము.

ఒక సంవత్సరము గడచినది. గంగాధరుఁడు విక్రమపుర రాజ్యమందలి రాణా జమీందారీని విసర్జించి ధవళగిరియందు స్థావరమేర్పఱచుకొని యుండెను. ఈ యిరుదేశములను భాషా భేదమున్నదని మా చదువరుల కెఱిఁగింపవలసియున్నది. గంగాధరుఁడు విక్రమపురమునఁ బుట్టి పెరిఁగిన వాఁడగుటచే, నాదేశ భాషయందుఁ బండితుఁడై యుండెను. ఆతఁడు ధవళగిరియందున్నపుడు కూడ, విక్రమపుర దేశభాష నెఱుఁగఁ గుతూహల మొందెడి వారికెల్లరకా భాష నేర్పుచు, జీవనోపాధిని సంపాదించుకొనుచుండెను. కొలఁది కాలములోనే గంగాధరుఁడీ క్రొత్తయూరఁ బ్రసిద్ధికెక్కి చాలధనము నార్జించుచు సంతుష్టి నందియుండెను. ప్రతాపరుద్రుని యాస్థానమున నాతని విషయమున న్యాయవిచారణ జరిగినప్పటినుండియు, శంకరభగవత్పాదుని తోడను, నాతని కుమార్తెయగు కమలతోడను గంగాధరునకుఁ బరిచయము కల్గి, యది దిన దినాభివృద్ధి నందుచుండెను. త్రివిక్రమ విశ్వనాథులును, ప్రభాకరుఁడును, ధవళగిరియందొక చిన్న గృహమున నివసించుచున్న కమలా భగవత్పాదుల నపుడపుడు చూచి పోవుచుండెడివారు.

గంగాధరుఁడు న్యాయస్థానమున నాపత్సమయము నందు, కమల జూచిన నాదిగ నాపెయెడ నిష్కపటమగు ప్రణయభావముఁ గాంచియుండెను. ఆ నాఁడాపె ప్రకంపితాధరముల నుండి వెలువడిన యమృతవాక్కుల మాధుర్య మాతఁడు మఱవఁజాలఁడు. అనుకంపాన్వితమగు నాపె సుందర వదనారవింద మాతని కెల్లపుడును దలపునకు వచ్చుచునే యుండును. కాని యాతఁడు దన ప్రణయప్రేమ నెప్పుడు నాపెకు బహిరంగ పఱపలేదు.

వేసవికాలమున నొక సాయంతనమున, కమల యింటికడ లేని సమయముఁ గనిపెట్టి గంగాధరుఁడు భగవత్పాదుని దర్శింపనేగెను.

భగవత్పాదుఁడొక గవాక్షము నెదుటఁబడక కుర్చీపైఁ గూర్చుండి భారతముఁ బారాయణ మొనర్చుచుండెను. విపదంబుధినుండి గట్టెక్కిన యాతని సహజశక్తి సామర్థ్యములిపు డినుమడించి, యాతని మేధాశక్తి నుత్తేజ మొనర్చి యుండెను. సద్గోష్ఠియుఁ గార్యదీక్షయు నాతని కెప్పటియట్లలవడెను. కొన్నివేళల నాతఁడు హఠాత్తుగాఁ జిత్తవైకల్యము నందినట్లగపడినను, కమల సరససంభాషణలచే నాతని నెప్పటియట్ల చేయఁగలుగుచుండెను. ఈనడుమ నట్టి చిత్తచాంచల్యము గూడ నాతనికిఁ గలుగుటలేదు.

గంగాధరుఁ డాయనకు నమస్కరించి, యాతఁడు గౌరవ పూర్వకముగఁ జూపిన యాసనమునం దుపవిష్టుఁడై.

. మీదర్శనముఁ జేసి చాలదినములైనది. కార్యాంతర నిమగ్నుఁడనై యిటకు రాఁజాలకుంటిని. మీరు స్వస్థులై యున్నారా? కమలకు క్షేమమా? యని కుశల ప్రశ్నముఁ జేసెను.

దేవుని దయవలన నందఱకు క్షేమమే. మాపై దయ గలిగి వచ్చిన మీతో మాటాడుటకు కమల యింటికడ లేదు గదా యని చింతించు చున్నాను.'

'ఆర్యా! అట్టిచింతవలదు. నేనాపె యిచటలేని సమయము గనిపెట్టియే వచ్చితిని.'

సూక్ష్మ గ్రాహియగు భగవత్పాదున కాయావనుని యుద్దేశ్యము తెలిసిపోయెను. ఆతఁడు కమలఁగూర్చి ప్రస్తాపించుట మాన్పఁదలచెనుగాని ప్రేమతరంగములచే నుప్పొంగెడి గంగాధరుని హృదయ యాత్సుక్యమునకా వృద్ధుఁడడ్డు నిలువఁగలఁడా?

'ఆర్యా, మీ ప్రయత్నము నిరర్థకము. ఆపె విషయమై మీతో ముచ్చటింపవలెనను దృఢసంకల్పముతోడనే, నేనిటకు వచ్చితిని. నేను కమలకు ప్రేమించితిని. ఆపెయెడ నాకుఁగల యవ్యాజప్రేమయు, గాఢానురాగమును వర్ణనాతీతములు, దైవానుగ్రహమున మీకును మీకుమార్తెకు నిన్నియెండ్ల

కుఁగల్గిన సంయోగమువలన మీ యన్యోన్య ప్రేమానుబంధ ముల సంపూర్ణముగ గ్రహించినవాఁడనగుట. నా యనురాగ ము నింతవఱకు కమలకైనను దెలిపియుండలేను. ఇదియంత యు నెఱిఁగినవాఁడ నగుటచే, మానవుఁడైనవాఁ డెంతకాలము నిరీక్షించి యుండఁగలఁడో యాతకాలము నిరీక్షించి యుంటిని. మీ యిర్వురిప్రేమకుఁ బాత్రుఁడను కాకయే మీ యిరువురి నడుమ నడ్డుపడుట, మీకు సౌఖ్యదాయకముకాదని నేనెఱుఁ గుదును. కాని నేను కమలను ప్రేమించితిని కమలను ప్రేమిం చితి ననుటకు భగవంతుఁడే సాక్షి.'

'నేను మీమాటల నన్నిటిని విశ్వసింతును. నాకిదివఱకే యీ విషయమై యనుమానము కలిగినది.' విచారకరముగు నాతని కంఠస్వరము గంగాధరుని హృదయముఁగలంచెను.

'కాని, యార్యా! కమలను వివాహ మాడఁగల భాగ్యము నాకుఁగలిగినపుడు, మీ యిరువురకు నెడబంధము చేయు తలంపు నాకున్నయెడల, నేవిషయమై మీతోఁ నుచ్చ రింప సాహసింతునని విశ్వసింపకుఁడు. నాయభీష్టసిద్ధి యటుండ నిచ్చి, మీయిర్వురకును వేఱుచేయఁబూనుట నికృష్టమని నాకుఁదెలియును.

'భగవత్పాదభిషగ్వరా, యింకొకటివినుము. నేనును, నీవలెనే, విక్రమపురవాసినై యుండి, యాదేశమును గోరివిడచి వచ్చినవాఁడను. నీవలెనే, యచటి దుర్మార్గము, నిరంకుశ

త్వము, దౌర్భాగ్యము చూడలేక వచ్చినవాఁడను. నీవలెనే స్వయంకృషిచే జీవనోపాధి గల్పించుకొని, భవిష్య దభ్యుదయము నాశించుచుఁ గాలము గడుపుచున్నాను.

మీకు బంధుఁడనై మీ కష్టనిష్ఠురము లందుఁ బాల్గొనుచు, జీవితాంతము వఱకు మీకాధారభూతుఁడనై యుండవలెననియే నాయాశయము. కమలకు నీపైఁగల యనురాగమును నాపై మఱల్చుకొనుటకై నేను వచ్చుటలేదు. వీలయిన, మీ యన్యోన్యానురాగలతను బెంపొందించుటకు దోహదముఁ జేయవలెననియే నా కృషి.'

భగవత్పాదుఁ డశ్రుజలపూరితమగు నేత్రద్వయము నొక్కసారి పై కెత్తెను. భయానకమై, విభీత విభ్రాంతమైన యాతని యంతరాత్మ ముఖచిహ్నములందుఁ బ్రతిబింబించుచుండెను.

'గంగాధరా, నీసరసవచోరీతియు, గంభీరభాషణమును నాకానందము గలుగఁజేసినవి. నీయుద్దేశ్యముల విస్పష్టముగ నా కెఱిఁగించి యుంటివి. ఇఁకనీతో దాపరిక మెందులకు? నాకుమారైకును నాకునుగల యనురాగమును బెంపొందింపఁ గలవనియే నాదృఢవిశ్వాసము. నీతో నాపె సుఖంపఁగోరు నెడల నాపెను నీకిత్తును. ఆపె వరించిన వానిగూర్చి, నాకెట్టి యనుమానము లుండినను, నవియన్నియు నాపెకొఱకు ఆపె

సౌఖ్యముకొఱకు విసర్జింతును. అపినాయీ దేహముకంటె నెక్కువ. నాప్రాణముకంటె-'

ఆతఁడకస్మాత్తుగ నవశుఁడై మూర్ఛుఁడయ్యెను.

గంగాధరుఁ డొకటిరెండు నిమేషములు నిశ్శబ్దముగఁ గూర్చుండి, పిదప నిట్లనెను. 'నాయందు మీకెట్టి విశ్వాసము జనించినదో, తత్ప్రతిఫలముగ మీయందు నేనును సంపూర్ణ విశ్వాసముంచెదను. నాప్రస్తుత నామధేయము యథార్థమైనది గాదు. నాపేరును గొంచెము మార్చుకొనవలసి వచ్చినది. నా నిజనామమేదియో, దానినెందులకు మార్పవలసి వచ్చెనో, సమగ్రముగ మీకెఱింగింతును. వినుఁడు !'

'అగు !' మని భగవత్పాదుఁడడిగెను.

'మీకు నారహస్య వృత్తములన్నిటిని వెలిపుచ్చి మీ విశ్వాసమునకుఁ బాత్రుఁడగావలెననియే నా కోరిక.'

'అగుము!' భగవత్పాదుఁ డొక్కించుకసేపు కరద్వయముతోఁ గర్ణరంధ్రముల మూసికొనెను.

'ఇపుడు వలదు. నేనడిగినపుడు చెప్పవచ్చును. నీయభీష్టము ఫలప్రదమైనయెడల కమల నిన్ను వివాహమాడ నిష్టపడిన యెడల నీవివాహదినమున నుదయముననే చెప్పవచ్చును ఏమందువు. నీకీపద్ధతి సమ్మతమా ?

'నాకు సమ్మతమే'

'ఇఁక శీఘ్రముగ నింటికేగుము. కమల యింటికివచ్చు వేళయైనది. మనమిర్వురముకలసి మాటాడుకొనినట్లొరులకుఁ దెలియుట మంచిది కాదు. దేవుఁడు మేలొనగూర్చుఁగాత! పొమ్ము!'

౹౭ అవ ప్రకరణము.

# అంతరాత్మ.

అనంతపథానువర్తియగు ప్రభాకరుఁడు జీవాధార భూతుఁడని ప్రశంసించు వారెవరును మన ప్రభాకరుని గుణములఁ బ్రశంసింపరు. భగవత్స్వామిని యింటఁ గూడ నాతఁ డెట్టి మెప్పును బడయలేదనుట యాశ్చర్యమే యున్నది? ఆతఁడా సంవత్సరకాలములో వారి యింటికిఁ దఱుచుఁగా బోవుచు వచ్చుచుండెను. కొన్ని కొన్ని సమయములయందా తని వచోధోరణి సరసముగనే యుండును గాని సామాన్యముగా నాతఁ డెట్టి విషయమునందైనను లక్ష్యములేక, విచార నిమగ్నుఁడై యుండును. ఆ వీధియందును. - ఆయింటి మెట్ల యందు - నాతని కెన్నఁడు లేని యభిమానము కలదు. అర్ధ రాత్రుల యందాతఁడు మధుద్రవ్యములఁ దప్పఁ ద్రాగి యా వీధులందుఁ బలుసార్లు తిరుగుచుండఁగాఁ జూచినవార లనేకులు కలరు.

ఒక నాఁడాతఁడేదియో యాలోచించుకొని కమల యింటి కరిగెను. కమల యొంటరిగఁ గూర్చుండి, యేదియో కుట్టుపనిఁ జేసికొనుచుండెను. ప్రభాకరునితో నెక్కుడు చను విచ్చి మాటాడుట కమల కభ్యాసము లేదు. అందుచే నాతని

రాకవలన నాపె కొంకించుక మనస్సంకోచము కల్గినను, యింటికిఁ వచ్చిన మిత్రుని గూర్చుండుమను టుచితమని యాపెకుఁ దోఁచినది. కమల మోమెత్తి ప్రభాకరుని జూచినపుడాతని ముఖవైఖరి యందేదియో మార్పున్నట్లాపె గ్రహించెను.

‘ అర్యా ! మీ శరీరమునం దస్వస్థముగ నున్నదాఁ ? ’

‘ లేదు. నేనెపుడును దేహారోగ్యమును లెక్కసేయను కమలా, నాబోటి నిరర్థకులు చేయఁగలుగునదేమి ? ’

‘ జీవయాత్ర సౌఖ్యముగఁ గడుపవలెనను శ్రద్ధ మీ కేల కలుగదు ? ’

‘ నా దురదృష్టవశమున ’

‘ పోనిండు. గతమునకు వగవఁబనిలేదు. మీరిపుడైన శ్రద్ధఁబూనరాదా ? ’

ఆతని కన్నుల నుండి యశ్రుకణములు రాలుచుండుటఁ గని యాపె చకితయయ్యెను.

ఆతని వాక్కులు గూడ నశ్రుజలార్థములై యుండెను.

అది యసాధ్యము. తరుణసమయము దాఁటిపోయినది. నేనింతకంటె నుత్తమస్థితినందుదు ననుటకల్ల. నేనింక నధఃపతుఁడనై నైచ్యము నందుదును.’ ఆతఁడు తలవాంచి, హాస్తద్వయముతో నేత్రములఁ గప్పుకొనియెను. ఈతఁడిట్టి సాధుస్వభావుఁడని కమల యెన్నడు నెఱుఁగదు. అందుచే నాపె నిర్ఘాంతపడి నట్లు చూచుచుండెను. ప్రభాకరుఁడాపెను జూడక పోయి నప్పటికి నాపె యేమనుకొనుచుండెనో గ్రహించెను.

'కమలా! నన్ను క్షమింపుము. నేనునీకుఁ దెలుపఁ దలఁచిన విషయముఁ దెలుపకపూర్వమే నిలువునీరై పోయితిని. సావధానముగ నానుడిని విందువా ?'

'ప్రభాకరా! అందువలన మీ కేమైన మనశ్శాంతి కలుగునెడల నేను సంతసముతో విందును. నా కెట్టి యభ్యంతరమును లేదు,'

'ఆహా! యేమి దయ! నీకు దేవుఁడు మేలొడఁగూర్చుఁ గాత!'

కొంచెముసేపటి కాతఁడు ముఖమునఁ జేతులఁ దీసి వేసి, గుండె పదిలపఱచుకొని యిట్లు పలుకఁజొచ్చెను.

'నేను జెప్పిన మాటల కధైర్యపడకుము. నేను బ్రతికి యుండియు, బాల్యముననే మరణించినవానివలె నున్నాను.'

ప్రభాకరా! అట్లుగాదు. నీ వొకించుక పూనికతో స్వకార్యముల నిర్వర్తించుకొనుచుండిన సర్వవిధములఁ దగిన వాఁడ వనిపించుకొనెడివాఁడవే!'

'కమలా, సర్వవిధముల నీకుఁ దగినవాఁడ నగుదును. ఆ మాట నెన్నఁడును మఱవను. కాని నీకుఁ దగినవాఁడనగుట నాకు దుస్సాధము. నీ కొఱకై పరితపించెడి యీ వ్యక్తి— వికలాంగుఁడు, త్రాగుపోతు, నిరర్థకుఁడునగు నీ వ్యక్తి—మొక నీ కనురాగము లేదని నే నెఱుఁగుదును. ఒకవేళ నీ కట్టి యనురాగము కల్గినను, నిన్ను గూడ నధఃపతితను గావించి నీ పవిత్ర

జీవితమును గల్మషయుత మొనర్చి, చెడుమార్గములకు నిన్ను గేల్పట్టి యీడ్చుకొని పోవుచుననికూడ నే నెఱుఁగుదును, నా యందు నీ కెట్టి దాక్షిణ్యమును లేదు. అందులకు మిగుల సంత సించుచున్నాను. నాపై దయ యుంచుమనికూడ నిన్నుగోరను.'

'ప్రభాకరా.! నేను మిమ్ములను రక్షింపఁ గలుగుటకు వేఱొక మార్గము లేదా. మిమ్ములను సన్మార్గమునకు మరల్పఁ జాలనా? మీరు నా యందుఁ జూపిన యాదరమునకుఁ బ్రతి ఫల మేమియుఁ జేయఁజాలనా? నా యందలి విశ్వాసము వలననే, మీ చిత్తవృత్తి నెఱిఁగింపక తిరిగాని, లేకున్న నితరు లకుఁ దెల్పుదురా? నేను మీ కెట్టి సహాయముఁ జేయఁ జాలనా?' యని కమల గద్గదస్వరముతోఁ గన్నీటితో ననెను.

అతఁడు తలఁద్రిప్పుచు,

'నీ వేమియుఁ జేయఁజాలవు, కమలా! నీ వేమియుఁ జేయఁజాలవు. ఒక్కింతసేపు ప్రశాంతచిత్తముతో నేఁ జెప్పు నది వినిన నదియే నాకుఁ బదివేలు సహాయము. నా యంత రాత్మయందు నీ ప్రతిబింబము సర్వకాలములను నిలచియుండు నని నీకెఱింగింపఁ గుతూహలపడుచుంటిని. నేను బరమ నీచమ స్థితియందున్నను, నిన్ను నీ తండ్రిని దొలుదొల్తఁ జూచినపు డేలకో నా మన స్సావేశభరితమయ్యెను. నా భూతజీవిత మందలి కష్టపరంపర లన్నియు నా హృదయమునుండి తొలఁగి పోయినవని తలఁచితిఁగాని యవి మీ సందర్శనముచే నొక్క

సారి నన్ను జుట్టుముట్టి, యపరిమితమగు మనోవేదన గలిగించినవి. నీ సందర్శనముచేతను—నీ సంపర్కముచేతను—వింత వాక్కులు కొన్ని నా కుత్సాహము నుద్బోధించి—అపరిమితములగు—నూతనాశయములను, ధైర్యసాహసలక్షణములను గార్యదీక్షను, బురికొల్పినవి. ఇదియంతయు మాయాస్వప్నము-ప్రమత్తుఁడగు నిద్రాసక్తుని శయ్యాతలముననే యుంచి దేశములఁ ద్రిప్పుకొనివచ్చెడి మాయాస్వప్నము- అయినను, నా నూతన భావోద్దీపనమునకుఁ గారకురాలవు నీవే !- నీ సౌశీల్య లావణ్యములే !'

'అదియంతయు నిపు డేమైపోయినది! ప్రభాకరా! మరల నాలోచించుకొనుము! ఇంకొకసారి ప్రయత్నింపుము'

'కమలా. నిష్ఫలము. నేనందులకుఁ దగినవాఁడను గానని మొదటినుండియు నెఱుఁగుదును. కాని యీ బూడిద కుప్పలోనుండి యగ్నిని ప్రజ్వలింపఁ జేసినది నీవే- ఆ యగ్ని స్ఫులింగ మొక్క దీపమునైన వెలిఁగింపలేదు. ఒక్క ప్రోయి లోఁజేరి వంటకముఁ జేయలేదు. నిరర్థక మైపోయినది. అయిననేమి. ఈ తేజోద్దీపమునకుఁ గారకురాలవు నీవే యని యొఱింగింప వలెనని నాకొక పిచ్చికోరిక'

'పూర్వముకంటె మీకు నాతోఁ బరిచయము కలిగిన పిదప నినుమడించిన మనోవేదనకుఁ గారకురాలను నేనే కనుక—'

'కమలా అట్లనకుము. నన్ను మరల మంచిత్రోవకు ద్రిప్ప సామర్థ్య మెవరికైన నున్నయెడల నది నీయందే కలదు. ఇంతేకాని నా యధోగతికి నీ వెప్పుడును గారకురాలవు కాఁజాలవు'

'నీ హృదయవేదన యంతయు, నావలననే జనించిన దగుటఁ దచ్ఛాంతికై నన్నేమి చేయుమందువు? మీకు క్షేమంకరమగు పని నేఁ జేయఁదగినదిగా సెలవిండు!'

'నానుడువు సావధానముగ వినుటయే నాకు క్షేమంకరము. కమలా నా దుర్వృత్తమును నీ కెఱింగించి చిత్తశాంతి నొందితినని జన్మాంతము వఱకును మఱవను. నీదయకుఁ బాత్రములగు గుణము లింకను నాయందుఁ గలవని సంతసించుచుందును'

'మీరు తలఁచిన నింకను మహత్తర కార్యములఁ జేయఁగలుగుదురని నానమ్మకము.'

'కమలా ఆ విషయము నాకింక జ్ఞాపకము చేయకుము. నేనెట్టివాఁడనో, నాకే బాగుగఁ దెలియును. నా జీవిత రహస్యము నీ హృదయాంతరమున గుప్తమై యున్నదనియు, దానిని నీ వెవరికి బయల్పఱుప వనియు నమ్మికొందునా?'

'అందువలన నీకేమైనఁ జిత్తశాంతి యబ్బిన, నట్లే'

'నీకత్యంత ప్రేమాస్పదులగు వారికిఁగూడఁ జెప్పక దాపగలవా?'

'ప్రభాకరా! ఈ రహస్యము నీది. నాదికాదు. నా మాటను విశ్వసింపుము'

'దేవుఁడు నీకు మేలొనగూర్చుఁ గాత! సెలవొసంగెదవా?'

ఆతఁడు పెదవులపై వ్రేలినిడికొని, ద్వారము దిక్కు సాగిపోయెను,

'కాని యిఁక ముందెప్పుడైన నీప్రసంగము నెత్తెదనని భయపడవలదు. నేనిఁక నీ ప్రసక్తిఁ దలపను. నా యవ్వన కాలమున, నా రహస్యోద్దేశములు నీ హృదయమునఁ బదిలముగ నున్నవనియు, నా తప్పొప్పులు, నా కష్టనిష్ఠురములు, నీవెఱింగి యున్నావనియుఁ దలఁచి యూరడిల్లుదును'

ఆతఁడు పోవుచు వెనుకకుఁతిరిగి కమలఁ జూచుచు నిలువఁబడెను. ప్రతిదినము నాతఁడెట్టి యాలోచనలఁ జేయుచుండునో, యెట్టి హీనావస్థయందుఁ దగుల్కొని కృశించుచుండునో తలంచి, కమల చింతాక్రాంతయై విలపింపఁ దొడఁగెను.

'కమలా! ఊరడిల్లుము! నాకొఱకెట్టి పరితాపమునందఁ దగదు. ఒకటి రెండు గంటలలో దిరిగి నా దుష్ప్రవర్తనమునందుఁ బడి, లజ్జాలేశము లేక తిరిగిన జాలిపడుదువా? ఎల్లప్పుడును నిన్ను మాత్రము నా యంతరాత్మయందుఁ బ్రేమించుచుందును. దయయుంచి నా మాటలు నమ్ముము!'

'చిత్తము'

"నా యంత్యప్రార్థన మిది. దాని నిర్వచించుట నిరర్థకమే యైనను, నా యాత్మలోనుండి యది పైకుబుకుచున్నది. నీకుఁగాని, నీ ప్రియులకుఁ గాని, నే నెట్టి కార్యమునైనఁ జేసెదను. నీ కొఱకుఁగాని నీ ప్రేమపాత్రులగు వారికొఱకుఁ గాని నే నెంతటి త్యాగమునైనఁ జేసెదను. నేను మనస్ఫూర్తిగఁ బల్కుచున్నాను. నన్ను జ్ఞప్తియందుంచుకొనుము. కాలక్రమమున, నూతన ప్రేమబంధములు నీ చుట్టు నలముకొని, నిన్నింటికిఁ గట్టివేయును! కమలా ప్రేమాస్పదుఁడగు నీ ప్రియుని ముఖసందర్శన భాగ్యమున నోలలాడునపుడును, కన్నబిడ్డల ముద్దాడుకొనునపుడును, నన్ను - మఱువకుము నీ ప్రియుల ప్రాణసంరక్షణార్థము ప్రాణత్యాగముఁ జేయుటకేని సంసిద్ధుఁడనైయున్న నన్ను—మఱువకుము. పోయి వచ్చెదను సెలవొసంగుము. దేవుఁడు నిన్ను రక్షించుఁగాక!"

---

ఏడవ ప్రకరణము

# ప్రవరుని గతి.

సాయంకాలమగుచుండెను. ఇరువురు మనుష్యు లనంత పథమునందలి సారాయంగడిఁ బ్రవేశించిరి. వీరిరువురు మా చదువరులకుఁ బరిచయులే. అంకఁడా యంగడి యజమానుఁ డగు వినాయక గ్రామణి. రెండవవ్యక్తి, యానాఁడా గ్రామమున రాణాప్రసాదుని బండిగొలుసుఁ బట్టికొని యెవఁడో పొడుగరి యొకఁడు వ్రేలాడుచుండెనని చెప్పిన పసులకాపరి. వారి శరీరమునందంతటను దుమ్మలనుకొని యుండెను. చాల దూరమునుండి ప్రయాణముఁ జేసి వచ్చినవారివలె వారలసి యుండిరి.

వీరా యంగడిలోఁ బ్రవేశింపఁగనే, యందున్నవారిలో నొకఁడు బయటకు వెడలిపోయెను. కొంచెముసేపైన పిదప మఱియొకఁడట్లే వెడలిపోయెను. మఱికొంచెముసేపైన పిదప మూఁడవవాఁడొక ఁడట్లే చేసెను. ఈ లోపున, గ్రామణి, భార్య యా పసులకాపరిఁ గూర్చుండఁబెట్టి, యొక గిన్నెడు సారాయి నందిచెను. అతఁడు త్రాగుటకు బాగుగ నలవాటు పడినవాఁడగుటచే, దానిని సేవించి, యెట్టి వికారచేష్టలఁ జేయక కూర్చుండెను. అంతట గ్రామణి, రా రమ్ము నీ పడక

కొక గదిఁజూపింతును. బయలుదేఱుమని వానివెంట నిడుకొని, ప్రక్కగుమ్మములోనుండి వీధిలోనికేగి, యటనుండి యొకచిన్న గల్లీగుండ నాతని దీసికొని పోవుచుండెను. మున్ను '105' ఉత్తరదుర్గము నుండి కొనిరాఁబడిన ముసలి బట్టలఁ గుట్టు కొనుచు నేగదియందుండెనో, యా గదిలోనికే యిరువురుఁ జేరిరి. సారాయంగడిలో నుండి వెలుపలకు వచ్చిన మువ్వురు నంతకుఁ బూర్వమే యా సంకేతస్థానముఁజేరి వీరి కొఱకు నిరీక్షించుచుండిరి.

గ్రామణి యతిజాగరూకతతోఁ దలుపునకు లోన గడియ పెట్టి హాస్యముగ నిట్లనెను. ప్రథమ జంబుకా, ద్వితీయ జంబుకా, తృతీయ జంబుకా, చతుర్థ జంబుకుఁడనగు నేను జేసియుండిన యేర్పాట్లప్రకారమీ సాక్షిని దీసికొని వచ్చితిని. ఆతఁడే మీ కంతయుఁ జెప్పఁగలఁడు. ఏదీ! పంచమ జంబుకా! చెప్పుము? రాణాయొక్క బండిగొలుసుఁ బట్టికొని స్థూలకాయుఁడగు ప్రవరుఁడెట్లు వ్రేలాడుచుండెనో వర్ణించుటే పసులకాపరికి బాగుగ నలవాటైనది. ఆతని కగపడినవారెల్లరును, రాణా కును వానికిని జరిగిన సంభాషణముఁ దెలుపవలెనని కోరు చుందురు. ఆకథనే పూసగ్రుచ్చినట్లొక్క యంశమేని విడువక, వికటాభినయములతో వర్ణించుచు, నదేరీతిగ, 'ఈలాగున వ్రేలాడియుండె'నని తలను వ్రేలాడవేయుచు, నూరివారి నంద ఱను పసులకాపరి నవ్వించుచుండును. మరల నింకొకసారి

జంబుక సమూహామున కాతఁడాప్రదర్శనమునే, సహజ రీతి నిటుల వర్ణించెను. "అప్పటినుండి యొక సంవత్సరమువఱ కాతఁడు కనఁబడలేదు. ఒకనాఁడు, నేను గొండపై మేసిన పశువుల నింటికిఁ దోలుకొని పోవుచుండఁగా, నాలుగురు రాజ భటులొక పొడుగాటి మనుష్యుని బెడరెక్కలు విఱిచికట్టి యూరిలోనికిఁ దీసికొని వచ్చుచుండిరి. మొదట నేనామనుష్యుని గురుపట్టలేదుగాని, వాఁడే యానాఁడు బండిగోలును పట్టుకొని వ్రేలాడుచున్న వాఁడని యనుమానము తోఁచినది. సరిగాఁ జూడఁగా నామాట నిజమే యయినది. సందేహాములేదు. వాని చేతులకు మోకులు బిగించినారు. అందుచేతఁ జేతులింత యెత్తున కుబ్బినవి. వాఁడు సరిగా నడవలేక కుంటుచుండెను. కత్తులకొనలను వీపుమీఁద నానించి యాభటులు వానిని ముందరికిఁ ద్రోయుచుఁ దీసికొని వచ్చుచుండిరి. వానిని గ్రామ మంతటఁ ద్రిప్పి, చివరకుఁ గొట్టులోఁ బెట్టిరి. కొన్నాళ్ళవఱకు, గ్రామములోని జనులందఱు చెఱసాలవద్దకుఁబోయి, యినుప కటకటాలలోనుండి వానిని జూచివచ్చెడివారు. రాణాబండి క్రిందబడి కన్నకొడుకు చచ్చిపోవుటచేత వానికిఁ బిచ్చికోవ మెత్తినదని, క్షమింపవలసినదని, మహారాజునకే విక్రమపుర ములోని జనులు మహజరుల ద్వారమున విన్నవించుకొన్నా రనియు, నందువల్లనే వాని నురితీయవలెనని శిక్షపడినప్పటికి వదలిపెట్టవచ్చునని మాగ్రామములో వాడుక పడినది. కాని

యిటువంటి విషయములు చాలఁదెలిసిన ముసలివాఁడొకఁడీ పదంతి సమ్మతిలేదు. వానికి నిజముగాఁ జావుతప్పదని, కుడి చేతిలోఁ గత్తినిబెట్టి మోచేతి వరకు, వాని కనులయెదుటనే కాల్చివేయుదురని, చేతులలోను గాళ్ళలోను, బొమ్మలోను బుండ్లుచేసి వానిలోఁ గళపెళఁగాగెడి నూనె, కరఁగించిన సీసముపోయుదురని, చివరకు నాలుగు గుఱ్ఱముల కాళ్ళక్రిందఁ బడవేసి శరీరములో నే భాగమున కాభాగము విడిపోవునట్లుగాఁ ద్రొక్కించెదరని, మనరాజుగారి తండ్రిగారిని జంపుటకుఁ బ్రయత్నించిన నొకనిని బ్రత్యక్షముగా నిన్నిబాధలు పెట్టినారని యావృత్తుఁడు చెప్పుచుండెడివాఁడు.

చిట్టచివర కొక్కనాఁడు, మాయూరి బావిదగ్గఱ, 10, 15 గజముల యెత్తునఁ బెద్ద స్తంభముల రెండింటిని నాలుగు గజముల దూరమున నిలువుగాఁబాతి వానిపైన నడ్డముగా దూలమొకటి కట్టినారు. ఆయడ్డపుదూలమునకుఁ గప్పియొకటి బిగించి, యందులోనుండి మోకును దూర్చిరి.

ఆ మోకు కొనకొక నుచ్చుపెట్టి, ప్రవరుని మెడ నాయుచ్చులో గట్టిగా బిగించి, రెండవకొనను బదిమంది రాజభటులు బట్టుకొని లాగిరి. తాడిచెట్టెత్తున వ్రేలాడుచున్న యాశవము నటులనే రెండురోజు లుంచిరి. బావివద్దకువచ్చి నీళ్లు తోడుకొని పోవుట కూరిలోని స్త్రీల కందఱకు భయము తోఁచుటవల్ల నా రెండురోజులు, మంగవారము మేమే కష్ట

పడవలసి వచ్చినది. నేనింతకంటెఁ జెప్పన దేమియును లేదు

ఆ పసులకాపరి యీ రీతిని ప్రవరుని మరణ వృత్తాంతమును వారి కెఱింగించునపు డాతఁడు పల్కెడి మాటల కనుగుణముగ నభినయించుచుఁ జేతులఁ ద్రిప్పుచు, వికృత చేష్టలఁ జేయుచుండెను. కథ ముగియగనే గ్రామణి యాతని వెంట నిడికొని వీధిలోనికి సాగనంపి, తిరిగి జంబుకత్రయమును జూడ వచ్చెను. వారు మువ్వురును గుపితులై, సక్రోధులై, నిశ్శబ్దముగఁ గూర్చుండి యుండిరి. వారి విస్ఫారిత నయనము లగ్నిస్ఫులింగముల గ్రక్కుచుండెను. వారి విస్ఫుత నాశికా కుహరములనుండి దీర్ఘోచ్ఛ్వాసములు వెడలుచుండెను.

ప్రథమజం: జంబుకులారా! ఏమి చేయవలెనో యోజింపుఁడు?

గ్రామ:— వేఁటేమున్నది. సంపూర్ణ నాశనమే.

ప్ర. జం:—కోట, వంశము ఆన్నియునా?

గ్రామ:—కోట, వంశము. సర్వమును సంపూర్ణ నాశనమొనర్ప వలసినవే.

ద్వి. జం:—గ్రామణీ ఈ విషయముల నన్నిఁటిని జ్ఞాపకముంచుకొనుట బహుకష్టముసుమా. నీ భార్య కుట్టుపనియందలి గుర్తు లెవరికైనఁ దెలిసిన మనకుఁ జాల ప్రమాదము కలుగును. తిరిగి యాకుర్తుల యర్థము మనకుఁ దెలియవలెను గదా!'

గ్రామ:—మనము భయపడవలసిన యవసరమే లేదు. నా

భార్యయే వీని నన్నిటిని జ్ఞాపక ముంచుకొనఁ గలిగిన సమర్థురాలు. ఆపెగుర్తు లాపెకు విశదముగనే యుండును. తలోదరిని నమ్మఁడు! జనులను బీడించుచున్న జమీందారుఁ డెట్టివాఁడైనను, నాపె జాబితాలోని యక్షర మొక్కటైన మార్పలేఁడు. నమ్మఁడు!



ఎనిమిదవ ప్రకరణము.

# గూఢచారి.

---

రాజభృత్యులలోఁ గూడ ననేకులు మిత్రులు, మన గ్రామణి కను దినమును రహస్యవిషయములఁ దెలుపుచుందురు. గ్రామణి యట్టి యనుచరుల సహాయముచే రానున్న విషయముల నెఱుఁగుచు, నతి జాగరూకుఁడై మెలఁగుచుండెను. ఒక నాఁటి రాత్రి యాతఁడు మిత్రుఁడగు రాజభటుని సందర్శించి వచ్చిన పిదప, భార్యయుఁ దాను నిట్లు మంతన మాడుచుండిరి,

'రాజభటులలోని జంబుకుఁ జూచివచ్చితివి గాఁబోలు. నేఁడు విశేషము లేమైనఁ గలవా?'

'వాఁడెఱిఁగిన వన్నియుఁ జెప్పెనుగాని యెక్కువ లేమియు లేవు. మన విషయమై కనిపెట్టి యుండుటకొక క్రొత్త గూఢచారి వచ్చుచున్నాఁడు'

"సంతోషమే వానిని మన జాబితాలోని కెక్కింపవలసి నదే, వానిపేరు?"

"రఘుపతి"

"రఘుపతి! మంచిది. అతని వైఖరి యెట్లుండునో తెలిసినదా?"

"వయస్సు సుమారు నలుబది సంవత్సరములు. ఎత్తు సుమారు రెండు గజములు నల్లని జుట్టు. పసిమి వన్నె ముఖము.

తెనెకన్నులు. ముఖము పలుచగాఁ గోలగా నుండును. ముక్కు సూటిగా నుండక తమాషాగా నెడమప్రక్కకు వంగి కొనతేలి యుండును. అందు వలన మానిసి చూచుటకు భయంకరముగా నుండును?

"ఓహో! కనులకుఁ గట్టినట్లున్నదే వానిని జాబితా లోని కెక్కించుట్ల త్రేపు!

'మన మెన్నో పేర్లను జాబితాలోని కెక్కించు చున్నాము. జాబితా పెరుఁగుచున్నదే కాని యంతకు మించి మనము చేసినపని యగపడుటలేదు. అబ్బా! ఎంతకాల మైనది!'

'అవును. చాలకాలము గడచినమాట నిజమే, కాని కాలము గడచిననే కాని ప్రతీకారబుద్ధిఁ ద్వేషము, ప్రేళ్ళతోఁ బాదుకొనవు?

'ఇంత యాలస్య మెందులకు? పిడుగు మనుష్యునిపైఁ బడి యొక్కక్షణములోఁ జంపివేయునే!'

'అవునుగాని, మేఘములు కూడుటకును, బిడుగేర్పడు టకు నెంతకాలము పట్టునో తెలియునా?' గ్రామణికి దలి సత్యము బోధపడినది.

"భూకంపము వలన మహా పట్టణము లొక తుత్రుటి కాలములో నిర్మూలన మగుచున్నవి, కాని యొక్క క్షణములో భూకంపము గలిగించుటకుఁ దగిన పరిస్థితు లెన్నాళ్ళనుండి

యేర్పడుచున్నవో తెలియునా? యని భద్రతిరిగి మగని బ్రశ్నించెను.

"చాలకాలమునుండియే కావచ్చును.

దాని ప్రయత్నమంతయుఁ బూర్తియయిన పిమ్మట నొక్కపెట్టున మహాపట్టణములను మ్రింగివేయు చున్నది. అందిన ప్రతివస్తువును నాశనము చేయుచున్నది. ఈలోఁగా నది మన కగపడక పోయినను, దన ప్రయత్నమును సాగించుకొనుచునే యున్నది. నేను జెప్పునది వినుము. అది వచ్చుటకుఁ జాల కాలము పట్టుచున్నను, నది త్రోవలోనే యున్నది.

ప్రతిక్షణమును ముందునకు సాగివచ్చుచునే యున్నది. అది వెను దిరుగదు. ఎచ్చటను నిలదిపోదు. అచిరకాలములోనే గమ్యస్థానము చేరఁగలదు. అన్నములేక మలమల మాడుచున్న జనుల నొక్కసారి చూడుము. వారి మనములందు దృఢముగ నాటుకొనిన యసంతృప్తి, అసమానము వీని దిలకింపుము. క్షణక్షణము విజృంభించుచున్న వారి క్రోధానలముఁ దలంపుము. ఎల్లకాల మిట్లే యుండవలసినదా ?'

'ఓసీ భద్రా! ఈ విషయములందు నాకెట్టి యనుమానము లేదు, కాని యది యెన్నాళ్ళు నిరీక్షించినను రాదేమి ? మనము బ్రదికియుండఁగా నవి సంభవింపదేమో !'

'కానిమ్ము ! మన విజయమును గన్నులారఁ జూడఁగలమనియే నా నమ్మకము. ఒకవేళ మనకట్టి యదృష్టము లేకు

న్నను, మనము దానిరాకకుఁ దోడ్పడిన వారమగుచున్నాము. మనము చేసినదేమియు నిష్ఫలమై పోలేదు. పులిని బట్టి రహస్య స్థలమునఁ గట్టివేసి సిద్ధముగ నుంచుము. తగిన సమయమున దానిని విడువ నగును.'

* * * * *

మఱునాఁడు మధ్యాహ్నము భద్రావతి సారాయంగడి యందు నియమిత స్థానమునఁ గుట్టుకొనుచుఁ గూర్చుండి యుండెను. ఆమె యెదుటబల్లపై నొక గులాబి పుష్పముండెను. దుకాణమునందు కొద్దిమంది మాత్రమే సారా త్రాగుచుండిరి.

ఇంతలో నొక నూతన పురుషుఁడా యంగడిలోఁ బ్రవేశించెను. ఆతఁడెవరో క్రొత్తవాఁడని భద్ర క్రీఁగంటిచూపుననే గ్రహించియుండెను. వెంటనే యామె చేతనున్న పరికరముల నెదుట బల్లపై నుంచి, గులాబిపుష్పముఁ గొప్పులో నిముడ్చుకొని, పిమ్మట నాయాగంతుకుని వంకకుఁ తిరిగెను.

అదేమి చిత్రమోకాని భద్రి యాపుష్పమును స్పృశించిన దాదిగ నాదుకాణము నిశ్శబ్దమయ్యెను. సారాయిద్రాగెడి వారొకరితో నొకరు సంభాషించుకొనుట మానివేసిరి. అంతి యేకాక వారెల్ల కొకరి వెంట నొకరు క్రమక్రమముగ నచ్చోటుఁబాసి వెడలిపోయిరి.

'అయ్యా దయచేయుఁడు' అని భద్రి యాగంతుకు నాహ్వానించెను. ఆమె మరలఁ దన కుట్టుపని నారంభించుచు,

ఆహా! వలుబదేండ్ల వయస్సు. ఘమూయ రెండుగజముల పొడవు, నల్లనిజుట్టు, పసిమివన్నెముఖము, తేనెకన్నులు, పలుచనగు కోలముఖము, సూటిగా నుండక యెడమప్రక్కకు వంగి కొనదేలిన ముక్కు, భయంకరస్వరూపము!' అని యనుకొనియెను.

'దయచేసి యొకచిన్న గ్లాసెడు మంచిరకపు ద్రాక్షారసమును, గుక్కెడు మంచితీర్థము నిప్పింపుము!'

భద్రావతి సవినయముగ వాని నిప్పించెను.

'అమ్మా! ఈ ద్రాక్షారస మెచ్చటిదో కాని దివ్యముగ నున్నది!'

అంతకుముందా రకపు ద్రాక్షారసముఁ జవిచూచిన వారెవరును దానినట్లు ఘనముగఁ బ్రశంసించి యుండలేదు. దాని గుణము భద్రావతికి బాగుగఁ దెలియును. ఆపె కుట్టుపని డాపె వ్రేళ్ళవంక నాయాగంతుకుఁ డొక్కించుక సేపు నిదానించి చూచెను గాని యాతనికేమియు బోధపడలేదు. అందుచే నా దుకాణము నాతడు నాకదొకసారి కలయఁజూచెను.

'అమ్మా! కుట్టుపనిలో నీవు కడు నేర్పరివి!'

'నాకీపని బాగుగ నభ్యాసము.'

'ఆహా! ఇపుడు నీవు కుట్టుచున్న చిత్తరు వెంత రమణీయముగ నున్నది!'

భద్ర మందహాసముతో నాతనిజూచి.

'నీకటులఁ దోఁచుచున్నదా ?' యనినొను.

'అవును. గాని యది యెందుల కుపయోగమో యడుగవచ్చునా?' ఆపె వ్రేళ్ళతి చమత్కారముగఁ గదలుచునే యుండెను. ఆపె మందహాసముఁ జేయుచునే యుండెను.

'ఉపయోగ మేమియును లేదు. కాలయాపన కొఱకే!'

'ఇది యెందులకుఁ బనికిరాదా ?'

'ఏమో చెప్పఁజాలను. ఎవాఁడైనను నాకిది యుపయోగ పడునేమో. వీరిరువురు మాటాడు కొనునప్పుడు దుకాణములోని కిద్దఱు ముగ్గురు మనుష్యులు వచ్చియుండిరి. భద్రావతి సిగలోని పూవులుజూచి, వారెవరికొఱకో వెతకుచు వచ్చినవారివలె నటించి, తిరిగి పోయిరి. ఈ నూతనుఁడు వచ్చినపు డచట నున్నవారిలో నొక్కఁడైన నందు నిలువలేదు. అందఱును వెడలిపోయిరి. ఆ గూఢచారి కన్నులఁ దెఱచికొని సర్వమును జూచుచునే యుండెను గాని వాఁడెట్టి సాంకేతికమును గుర్తింపలేదు.

భద్రావతి కుట్టుపనిని జూచుకొనుచు నిట్లనుకొనియెను.

'ర—ఘు—ఇంకొ కించుకసే పిందే యుండుము. నీవు పోక పూర్వమే పతియని కూడఁ బూర్తి చేసెదను.'

'మీకు వ్యాపారము బాగుగ సాగుచున్నట్లు లేదే ?'

'వ్యాపారము మంటఁ గలిసిపోయినది. జనులు నిరుపేద లైవారు.'

'అవును. పాపము. జనులు నిర్భాగ్యులు! పైగా, నీవన్నట్లు, ఈ దుష్ట పరిపాలనము కూడను!'

'నీవన్నట్లు' అని యామె తటాలున బదులు చెప్పెను.

'క్షమింపుము. అవును. ఆమాట నేనే యంటినిగాని మీరందఱా మాట యనుకొను చుందురుగదా. తప్పేమున్నది?'

'నే ననుకొందునా? నాకును నా భర్తకును బ్రతి దినము నీ యంగడిని నడపుకొను చుండుటయే పని. మేము బ్రదుకుతెరువు నాలోచించుకొనుటే తప్ప, వేఱాలోచన లేమియుఁ జేయము. ఉదయమునుండి సాయంకాలము వఱకు మా యాలోచనమిది. ఇతరులతో మాకేటి నిమిత్తము!'

ఏమైనను రహస్యములు బయల్పడు నేమోయని వేచియుండిన నా గూఢచారి యింకను నిరాశఁ జెందలేదు. అతఁడు నడుమ నడుమ ద్రాక్షారసముఁ జవి చూచుచుండెను. అతఁడెక్కువ జాలిగొన్న వానివలెఁ "పాపము. ప్రవరుఁ డేమయ్యెనో చూడుము! అతని మరణము చాల సంతాప కరము!" అని మరల సంభాషింప మొదలిడెను.

'ఓ హో! జనులిట్టి పనులకుఁ గట్టిఁబట్టిన యెడల, వారు తగిన శాస్త్రి ననుభవించి తీఱవలసినదే! వాని గతి యేమగునో ముందుగనే వానికిఁ దెలియదా? అది యనుభ వింపక తప్పునా?'

'కాని యా నిర్భాగ్యుని విషయమున, మీ ప్రాంతము లందందఱికిని దయయుఁ గోపమును కలిగి యుండవచ్చును.'

'అటులనా !'

'అట్లుకాదా ?'

'ఇదుగో! నాభర్త వచ్చుచున్నాఁడు. వాని నడిగి తెలిసికొనుము!'

వినాయకగ్రామణి యా యంగడిలోఁ బ్రవేశింపఁగనే, యా గూఢచారి నవ్వుచు, జంబుకా! దయచేయుము!' అని యాహ్వానించెను. గ్రామణి తటాలున నిలచి, యాతని వంక నిశ్చలుఁడై చూచెను.

'జంబుకా! దయచేయుము!' అని యొకించుక బెదురుదనముతో నా గూఢచారి మరలఁ బిలిచెను.

'ఆర్యా! మీరు పొరపడుచున్నారు. నన్ను వేఱొకనిగా భ్రమించుచున్నారు. నా పేరదికాదు. వినాయకగ్రామణి గ్రామణి.'

గూఢచారి విస్మృతి నభినయించుచు, 'రెండునొకటియే! దయచేయుము' అని మెల్లగఁ ననియెను. "ఇతఁడు బూర్వమే నీ భార్యయు, నేనును బాపము! నిర్భాగ్యుఁడగు ప్రవరుని గూర్చి యనుకొనుచుంటిమి. మీ పాత్రముల యందందఱికి దయయుఁ గోపము కలిగినవి - అవును అందాశ్చర్యమే మున్నది!"

గ్రామణి తలఁ ద్రిప్పుచు, 'ఏమో. నా కెవరేవిషయమును చెప్పలేదే, నే నేమియు నెఱుఁగను' అని బదులు చెప్పెను.

ఆ గూఢచారి స్వవృత్తియందారితేరిన వాఁడు. ఆతని కేంకను రహస్యముల నెఱుఁగవలయునను నాశపోలేదు. గ్లాసు లోని ద్రాక్షారసము నంతయుఁ ద్రాగి, పానీయము నొక గుక్కెడు మ్రింగి, యింకొక గ్లాసు ద్రాక్షారసముఁ దెమ్మని కోరెను.

గ్రామ:— నాకంటె నీవే యీ ప్రాంతముల బాగుగా నెఱిఁగి నటు లున్నావే ?

రఘు:— లేదు. లేదు. కాని నే నింకను నీ ప్రాంతవాసుల కష్ట సుఖములఁ దెలిసికొనవలెనని కుతూహలు పడుచున్నాను. నాకిచ్చటి జనులపై నమితప్రేమ !

'ఆహా ! ఎంత ప్రేమ ! ' యని గ్రామణి లోలోనఁ దలపోసెను.

రఘు:— 'గ్రామణీ ! నీతో మాటలాడిన కొలఁదిని, మన పూర్వపరిచయము జ్ఞప్తికి వచ్చు చున్నది. '

గ్రామ:— అటులనా !

రఘు:— అవును. యథార్థము ! నీవు బాల్యమున భగవత్పాదుని సేవకుఁడవై యుంటివికాదా ? ఆయన విడుదలయై నపుడు నీవే యాతని కాశ్రయమిచ్చితివికదా ? ఆయనను నీ వద్దకే యుంపిరి. నే నెఱుఁగుదును.'

గ్రామ:— 'నిజమే. '

రఘు:—ధవళగిరిలో, భగవత్పాదుఁడు నాతని కూఁతురును నా మిత్రకోటిలోని వారే.

గ్రామ:—అటులనా.

రఘు:—వారి వృత్తాంతమేమియు మీ కిపుడు తెలియుటలేదు గాఁబోలు.

రఘు:—ఆపె వివాహ మాడఁబోవుచున్నది. వరుఁడు ధవళగిరి దేశీయుఁడు గాఁడు. ఆపెవలెనే విక్రమపుర దేశమందుఁ బుట్టినవాఁడే - అనినట్లు జ్ఞాపకమువచ్చినది. ప్రవరుఁడు (పాపము, ప్రవరునిహత్య మహా ఘోరము.) ఎవరిని జంపి నందుల కురితీయఁబడినాఁడో - ఆ రాణాప్రసాదుని యన్న కుమారుఁడు - అనఁగా - ప్రస్తుత రాణాయగు గంగాధరుఁ డనఁబరఁగెడివాఁడే వరుఁడు. కాని ధవళగిరిలో నాతని నెవ్వరు నెఱుఁగరు. అచ్చట నతనికి రాణాపదవిలేదు.

భద్రావతి తలవంచి తనపనిఁ జేసికొనుచునే యుండెను గాని యా సమాచారము వినినంతనే గ్రామణిముఖము కళా విహీనమై మాఱిపోయెను. దాని గనిపెట్టి జ్ఞాపకముంచుకొనఁ జాలకున్న నా గూఢచారి గూఢచారియేకాఁడు. ఆతని కష్టము నకు ఫలితమా చిన్నయంశ మొక్కటియే. దానివలన నాతని కేమిలాభము కలుగునో యూహింపఁజాలము. దుకాణము లోనికిఁ గ్రొత్తవారెవరైన వచ్చిన నింకను గొన్ని విశేషముల సేకరింప వచ్చునని యాతఁడూహించి యుండెనుగాని, యెవరును వచ్చుటలేదు. రఘుపతి డబ్బుఁజెల్లించి, సెలవుగైకొని, దుకా ణము విడిచి యేగెను. ఆతఁడు తిరిగి వచ్చునేమోయను భయ

మున భార్యాభర్త లిరువురును నిశ్శబ్దముగఁ గొన్ని నిమేష ములవఱకుఁ గదలకుండిరి.

'కమలనుగూర్చి వీఁడుచెప్పినది నిజమగునా?' యని గ్రామణి మెల్లఁగఁ దన భార్యను బ్రశ్నించెను.

'చెప్పినవాఁడు వీఁడగుటవల్ల నబద్ధమయినఁ గావచ్చును. కాని యది నిజమే యేమో.'

'అది నిజమే యైనయెడల, నాపెభర్త యీ దేశము నకుఁదిరిగి రాకుండిన నదృష్టవంతురాలు'

భద్రావతి సహజమగు నిశ్చల చిత్తముతో నిటులనెను.

'ఆపెభర్త యెచ్చటికి రావలెనో, యచ్చటికి రాకమానఁడు. ఆతని కెట్టిగతి వ్రాసియున్నదో యాగతిననుభవింపఁగలఁడు.'

'కాని-ఆపె తండ్రియెడ మనకుఁగల గౌరవము, ఆపె యెడ మనకుఁగల ప్రేమ-వీని ద్రోసిపుచ్చి, నీచుఁడగు నీగూఢ చారితోఁ బాటాపె భర్తపేరుగూడ నీ జాబితాయందుఁ జేర్ప వలసి వచ్చుటెంత వికృతము.'

'ఇంతకంటెను వికృతములగు పనులు జరుగఁగలవు. వారిరువురిపేర్ల నిందు గుర్తువెట్టియే యున్నాను. వారు చేసి కొన్నదాని ననుభవింపక తీఱదు. ఇఁకజాలును.'

భద్రావతి యిట్లనుచు, సిగలోనున్న గులాబిపూవుఁదీసి వేసెను. ఇంచుక సేపటిలో నంగడి జన సంకీర్ణ మయ్యెను.

---

తొ మ్మి ద వ ప్ర క ర ణ ము.

# ప రి ణ య ము.

---

త్రివిక్రముఁడు వడ్డివ్యాపార మొనర్చెడి రత్నాకరునికి నమ్మకమైన గుమాస్తాగా నిరువదేండ్ల ప్రాయమునుండియుఁ బనిచేయుచు, బ్రతిదినము వడ్డిలెక్కలయందే మునిఁగియుండును. భగవత్స్వాముఁడు యౌవనమున వైద్యవృత్తియందార్జించిన ధనమును రత్నాకరుని యొద్దనే నిలువయుంచుచుండుట చేతనే, త్రివిక్రమునితో నాతనికిఁ బరిచయము కలిగినది. త్రివిక్రముఁడును, విశ్రాంతి దొరకినపుడెల్ల నాతఁడు దఱుచుగ కమలాభగవత్స్వాములఁ జూడఁబోయి, వారిక్షేమములనారసి, తండ్రిబిడ్డలకుఁగల ప్రేమానుబంధముల స్వానుభవముచేఁ గాకున్నను, వారియందుఁగని మిగుల సంతసించుచుండెడివాఁడు. కాని యాతఁడు కమలను జూచినపుడెల్ల నామె నవయౌవన లావణ్య మడవిఁగాసిన వెన్నెల కావలసినదే యాయని మాత్రము చింతిల్లుచుండును.

కమలా భగవత్స్వాములు స్వగృహమున విశ్రాంతిగఁ గూర్చుండియుండిరి. పరిచారికయగు భైరవి గృహకృత్యము లొనర్చుచుండుటచే, జనకున కుపచారములఁ జేయునపుడు తప్ప మిగిలిన సమయములందు కమల చదువుచునో వ్రాయుచునో కాలము గడపుచుండును. ఆనాఁడు త్రివిక్రముఁ డుద

యముననే వారియింటికివచ్చి, యచట భోజనమొనర్చి, యంగ కుఁబూర్వమే రత్నాకరు నింటికిఁబోయి యుండెను. కమల తండ్రితో నిట్లు ప్రసంగించెను. "బాబా! త్రివిక్రముఁడెంత సహాయకారి! ఆతని సహాయము నే నెప్పుడును మఱవను. కాని యెల్లప్పుడును వర్తక వ్యాపారములందే యతఁడు నిమగ్నుఁడై యుండునేమి? ఈయన ధనార్జన మెవరికొఱకు? పాపము! వృద్ధాప్యమునఁ దోడునీడలేదు. ప్రియానురాగ మెట్టిదో, పుత్రవాత్సల్య మెట్టిదో యెఱుఁగఁడు! పాపము!"

భగవత్ప్రాదుఁడు గంగాధరునకు వాగ్దాన మొనర్చి నప్పటినుండియు, కమలతో నా విషయమును ముచ్చటించుటకు సరియగు నదనెపుడు దొరకునా యని యెదురు చూచుచుండెను. ఇదే తరుణమని యాతనికిఁ దోఁచినది.

"అమ్మాయీ ఆతని విషయమున కేమిలెమ్మ. అఱువదేండ్లు చేరవచ్చినవి. బ్రతికినన్నాళ్ళు బ్రతుకఁబోఁడు. ఆతఁడు నిలువచేసియున్న ధనమున కాసపడి యెవరైన నాతని వృద్ధాప్యమున కండగా నిలువకపోరు. నీవుగూడ, నాపైఁ గల భక్తిచేఁ బ్రియానురాగ మెట్టిదో, పుత్రవాత్సల్య మెట్టిదో యెఱుఁగక, నీ యౌవనమును నిరర్థక మొనర్చెదవా?

అమ్మా వలదు. అట్లుచేయవలదు. నీయిచ్చవచ్చిన వరు నేరుకొనుము. నిన్నాతనికిచ్చి వివాహ మొనర్తును.'

'బాబా! నీకుపచార మొనర్చుటయందెట్టి యాటంకములున్నను నేను వానిని సహింపఁజాలను'

'అమ్మా ! నీకాభయమువలదు. నీవు వివాహామాడిన నాకెట్టి యభ్యంతరములు గలుగవు. నీ ప్రియభర్తతోఁ గాపురము చేయుచుండ జూడవలెననియే నాకోరిక. గంగాధరుఁడీ విషయమున నాతో నిదివఱకుఁ బ్రసంగించి యుండెను. అతనిపై నీ కనురాగముకలదా ?'

సుకుమారియగు పట్టి యిట్టి కఠిన ప్రశ్నమునకు సమాధాన మొసంగఁగలదా. ఆమె వంచిన మోమెత్తి తండ్రి భుజస్కంధమున నూన్చి, వెక్కి వెక్కి యేడువసాగెను. ఆతఁడామె చుంచుకను దువ్వుచుఁ బొంగి పొరలివచ్చెడి దుఃఖము నాపుకొని 'అమ్మాయీ! ఏల యేడ్చెదవు? నీ భర్త నీకును నాకు నెడబంధము దెచ్చిపెట్టఁడు. పితృవాత్సల్యమును, బతిభక్తియు, నీయందలవడి యుండఁగలవు. అమ్మా! ఏడ్వకుము' అని యోదార్చెను.

మఱునాఁడు భగవత్పాదుఁడు గంగాధరునకుఁ గబురంపి, యాతని వివాహామాడుటకు కమల యియ్యకొనినదని తెలియఁజేసెను. ఈ సమాచారము త్రివిక్రమున కెంతయు సంతసముఁ గలిగించెను. ముహూర్తము నిశ్చయింపఁ బడినది. నియమిత ప్రకారము నాఁటి యుదయమున భగవత్పాదుని రహస్యము గనుక గదియందుఁ గూర్చుండఁ బెట్టికొని గంగాధరుఁడు తన వృత్తాంతమును- నిజనామమును, స్వదేశమును విడిచివచ్చుటకుం గల కారణములను- సవిస్తరముగ నెఱిం

గించెను. అది వినినంతనే భగవత్పాదుని ముఖము కళా విహీన మయ్యెను. ఆతనికి మరలఁ బూర్వపుఁబిచ్చి యెత్తినట్లుండెను. కమల యాతని కుపచారము లొనర్చి యోదార్చెను. ఈ రహస్యముల నింకెవరికి నెఱింగింప వలదని భగవత్పాదుఁడల్లుని గోరెను.

కమలా గంగాధరుల వివాహము నిరాడంబరముగ జరిగినది. త్రివిక్రముఁడమూల్యమగు నొక ముత్యాలసరమును వధువునకుఁ గానుకగా నొసంగెను.

భగవత్పాదుఁడు పుత్త్రికా జామాతలం గూడి సుఖముగఁ గాలము గడుపుచుండెను. శీఘ్ర కాలములోనే యాతనికి మనుమరాలి ముద్దిడుకొనఁ గల భాగ్యమబ్బెను.



పదవ ప్రకరణము.

# విక్రమపుర సామ్రాజ్యము

---

విక్రమపురమందలి యనంతపథమున నత్యుగ్రమగు కోలాహలము విజృంభించెను. పురుషులు, స్త్రీలు, పిన్నలు, పెద్దలు—ఎల్లరును, కత్తినో, కటారినో, తుపాకినో, పిస్తోలునో, పలుగునో, గొడ్డలినో,—చేతికందిన యాయుధము లంది పట్టుకొని, భయంకరారావముల నొనర్చుచు విచ్చలవిడిగ సంచరించుచుండిరి. తుపాకిమందు, తోటాలు, బరిసెలు, గండ్రగొడ్డళ్ళు—మొదలగు మారణసాధనముల నింకను గొందఱు లేనివారికిఁ బంచిపెట్టుచుండిరి. ఆయుధము లన్నియుఁ గ్రొత్తగాఁ బదను పెట్టఁబడి యుండుటచే నవి సూర్యరశ్మియందుఁ దళతళ మెఱయుచుండెను. ప్రతి స్త్రీయు బ్రతి మానవుఁడును, దుర్మార్గులగు ప్రభువులయెడఁ బ్రతీకారభావోన్మత్తులై యుండిరి. వారికి స్వప్రాణములపై నాసలేదు. వాని ద్యజించుటకేని సంసిద్ధులై యుండిరి. ఈ జనసమూహము నడుమ నొక నాయకగ్రామణి నిలచి యాయుధముల నందఱికిఁ బంచిపెట్టుచుండెను. అతఁడే ప్రజానాయకుఁడు.

'దేశభక్తులారా! మిత్రులారా! రండు! జగద్విఖ్యాత మగు బొల్నాడు కారాగారమున మన మిత్రులు దేశభక్తులు

గొందఱు నిర్బంధింపఁ బడియున్నారు. వారిని విడిపించుటే మన ప్రధాన కర్తవ్యము, రండు బోల్నాడు దుర్గముఁ జుట్టు ముట్టఁ దరలిరండు !'

నికృష్టమగు బోల్నాడు కారాగృహ నామము వినఁగనే యా జనసమూహమొక్క పెట్టున నట్టహాస మొనర్చి, ముందునకుఁ గదలెను. గంటలను వాయించుచు, డప్పులను మ్రోగించుచుఁ గర్ణపుటముల భేదించెడి మహారావముల నొనర్చుచుఁ బ్రతివీధినుండియుఁ బ్రతి గల్లీనుండియు, నాయుధ పాణులగు స్త్రీపురుషులు గుంపులు గుంపులుగ వచ్చి, కల్లోల వారాశిలో లీనమగు నక్షీణవాహినులవలె నా ప్రళయ పరివారమునఁ గలియుచుండిరి. బోల్నాడు దుర్గమును - ఎనిమిది బురుజులను - ఈ ప్రజాసైన్యము చుట్టు ముట్టినది. వీరి రాకఁ గనిపెట్టియే, విక్రమపుర ప్రభుసైన్య మెనిమిది బురుజులపై నుండియు నరులపై నగ్నివర్షము గురిపించుచుండిరి. విపరీతావేశోపవిష్టులగు ప్రజలత్యంత సాహసముతో నాలుగు గంటలు, వెనుదీయక పోరాడిరి. ప్రళయ భేరులు - అగ్ని వర్షము - మిన్నులముకొన్న పొగలు - శతఘ్నిచయ సంధానముచే నెగసిన మోతలు - ద్వారములం జేర్పఁ బడిన గడ్డియందు మహాగ్ని ప్రజ్వలనము - సంకీర్ణజన మధ్యమునుండి వెల్వడెడి యార్తారవములు - నిష్ఠురోక్తులు - వారనుభవించిన బాధలు క్షణక్షణము జ్ఞప్తికి వచ్చుచుండెను. వారి విజయోత్సాహము వర్ణనాతీతము !

తుట్టతుదకుఁ దూర్పు బురుజుపైనుండి యొక తెల్లజెండా యెగురుచున్నట్లగపడెను. బోల్నాడు ప్రజా సైన్యమునకు వశీకృతమైనది. దుర్గమునందున్న ప్రభుసైన్య మోటమి నొప్పుకొన్నది ! అష్టద్వారములు పటాపంచెలుగఁ దెఱచుకొన్నవి. వినాయక గ్రామణి కూపిరాడుట లేదు. వెనుకకుఁ దిరిగి చూచుట కాతనికి వీలులేదు. ఆ కోలాహలములో నుండి, 'ఖయిదీలు !' 'ఖయిదీలు !' అనియెడి కేకలు మాత్రము విస్పష్టముగ వినిపించు చుండెను. ఆ మహాధ్వనియందుఁ జేరువ నున్నవారు కూడ నొకరితో నొకరు మాటాడుకొనుట దుర్లభముగ నుండెను. ముందునకుఁ బోయిన ప్రజాసైనికుఁ డొకఁడా కారాగృహాధికారిని బట్టుకొనియెను. ఆ చెఱసాలనున్న ప్రతి గదియొక్క తాళములఁ దీసివేయ వలెనని యాజ్ఞాపించెను ! లేకున్న మరణమే శిక్ష.

ఆ ఖయిదీలంద ఱేనాఁడు బోల్నాడు దుర్గము ప్రవేశించిరో కాని నేఁటికి వారు బంధ విముక్తులైరి. దుష్పరిపాలనాగ్నికి శలభములై మ్రగ్గిన యా ఖయిదీలన్న జనుల కెంత భక్తి. వృద్ధులును బలహీనులునగు కొందఱు ఖయిదీలను బుజములపై నెత్తుకొని, కొందఱు సైనికులా జన సమూహములోనుండి తప్పించి, కోటబయటకుఁ జేర్చుచుండిరి. గ్రామణి కారాగృహాధికారి నొకని బట్టుకొనియెను.

'ఉత్తరపంక్తి యేదియో చెప్పుము ! ఆలస్యము చేయకు'మని గ్రామణి ప్రశ్నించెను.

'అక్కడ చూపింతునుగాని యిపుడచ్చట నెవరును లేరు'

'నూట ఐదు ఉత్తరపంక్తి అనిన నర్థమేమి ? అదియొక యిదిపేరా ? లేక యొక గదిపేరా ? త్వరగాఁ జెప్పుము !'

'అదియొక గదియే'

'ఏదీ. నన్నాగదిలోనికిఁ దీసికొనిపొమ్ము'

'అట్లయిన యీ త్రోవనురండు!'

ఆ యధికారి, గ్రామణి, తృతీయ జంబుకుఁడు- ఈ ముగ్గురు నొకరిచేయి నొకరు పట్టుకొని సూర్యరశ్మి యెట్టిదో యెఱుఁగక యంధకార బంధురములగు నంతర్మార్గముల గుండ నడచి, యేహ్యమగు దుర్గంధమును సహించి, కటికి చీఁకటిగల బిలద్వారములఁ గడచి, మితిలేని మెట్లనెక్కి, కొన్నిచోట్ల మెట్లపైనుండి లోనికిదిగి, యతి త్వరితగతి నడచిపోవు చుండిరి.

ఆ కారా గృహాధికారి యొక చిన్న గుమ్మముకడ నాగి, తాళముదీసి, తలుపు నెమ్మదిగఁ దెఱచెను. వారు ముగ్గురు తలలను వంచి యందుఁ బ్రవేశించిరి. 'ఇదే. నూట ఐదు. ఉత్తరపంక్తి.'

అదియొక చిన్న చీఁకటికొట్టు. చిన్న కిటికీయొకటి, గోడలోఁ జాల యెత్తున బిగింపఁబడి యుండెను. దానిక్రిందనే గోడలో నొక గూడు కట్టఁబడి యుండెను. ఎత్తైన పీట యొకటియుఁ జిన్న మేజాబల్లయు, నొకగడ్డి పఱుపుమాత్ర

మా గదియందుండెను. నాలుగు గోడలును ముఱికిపట్టి నల్లగా నుండెను. ఒక గోడయందొక మేకుమాత్రము కలదు.

'ఆ కాగడా నిటు చూపింపుము. ఈ గోడలపై నేమి యున్నదో చూడవలెను' అని గ్రామణియు యధికారి కాజ్ఞా పించెను. అతఁడట్లే చేసెను. గ్రామణి దీపము వెంటనే నడ చుచు, గోడలపై నేమున్నదో పరిశీలించుచుండెను.

'అగు !- జంబుకా ! యిటుచూడుము ! '

'శం. భ.' యని జంబుకుఁడు చదివెను.

తుపాకిమందుచే నల్లబడియున్న వ్రేళ్లతో నా రెండక్ష రములయరవడిని దిద్దుచు, గ్రామణి తన యనుచరుని చెవిలో రహస్యముగ 'శంకర భగవత్పాదుఁడు' అనియెను.

'ఇదిగో "నిర్భాగ్యుఁడగు వైద్యుఁడు" అని యిచట వ్రాసియున్నాఁడు. ఈ రాతిపై నేదియో చెక్కియున్నారు కూడను, అతఁడే. సందేహము లేదు. నీ చేతిలోని దేమది? పలుగా ? ఏదీ, యిటు తెమ్ము ! '

పుచ్చిపోయిన బల్లయుఁ బీటయు రెండుదెబ్బలతో ముక్కలై పోయినవి. 'జంబుకా వీనిలో నేమైన నుండునేమో జాగ్రత్తగాఁ జూడుము. ఇదిగో కత్తి' అని దాని విసరివైచెను. అది 'తీసికొని, యా పఱుపునుజీల్చి, గడ్డిలోఁగూడ వెతకుము. ఇదిగో దీపముఁ బైకెత్తి పట్టుకొనుము ! '

గ్రామణి యిట్లనుచు, నచ్చటనున్న రాతిపైకెక్కి,

యా గోడలోని గూడు ప్రక్కలఁ బలుగుతోఁగొట్టి చూచి, యచ్చటఁ బనిచేయ నారంభించెను. కొంచెము సేపటిలో, సున్నము, రాళ్లువిఱిగి నేలపైఁ బడుచున్నది. తవ్వనపు డాతని పలుగొక కలుగులోనికి జారెను. నెమ్మదిగ నా కలుగులోనికి జేతిని బోనిచ్చి, గ్రామణి, జాగ్రత్తగ వెదకెను. అం దాతని కేమిదొరకెనోకాని, చేతి నా కలుగులోనుండి తీయఁగనే తటాలున జేబులోనికిఁ జొచ్చెను. పిమ్మట నాతఁడు నేలపై నుఱికెను. పటపులో నేమియుఁ గనఁబడలేదు. పటపును, విఱిగిన కొయ్యముక్కలను బ్రోగుచేసి, వాని కాకాగడా నంటించి, శీఘ్రమే యా చోటుఁ బాసిపోయి, వెలుపలనున్న గుంపునఁ జేరిరి.

బోల్నా పుమర్గమునఁ గూర్చుండి ప్రజలపై నగ్నివర్షము గురిపించిన సేనానాయకు నెట్లు శిక్షింపవలెనో నిర్ణయించు టకుఁ బ్రజాసభ సమక్షమున కీడ్వవలసియుండెను. వినాయక గ్రామణి యా దౌర్భాగ్యుని బట్టుకొని సభ కీడ్చుకొని పోవు చుండెను. కాని ప్రజల యుద్రేక మూగుటలేదు. వెనుక నుండియు, ముందునుండియుఁ బ్రక్కలనుండియు, వా రా వృద్ధుని దన్నుచుఁ గత్తులతోఁ బొడుచుచుండిరి. పాప మాతని ప్రాణము పోయినది. గ్రామణి యా శవమును నేలపై జార విడిచెను. భద్రావతి, కరిపై లంఘించిన యాడుసింగమువలె నా కళేబరముపై కుఱికి, మెడపైఁ గాలూని త్రొక్కిపట్టి,

చేతనున్న భీకరకృపాణముచే శిరచ్ఛేదనముఁ జేసినది! ఆహా! ఎంతకసి!

బోల్నాడుదుర్గము ప్రజాధీనమై యాఱు దినము లైనది. వినాయక గ్రామణి సారాయంగడిఁ బ్రవేశించి, యత్యాతుర మున నిట్లనెను.

'చచ్చి, యమలోకమున కేగిన పీలుడు మీ కందఱకు జ్ఞాపకమున్నాఁడా! అన్నములేని మనలను గడ్డితినుమన్న పీలుడు!' ఎల్లరు నేకకంఠమున ,అంద ఱెఱుఁగుదురు' అని భీకరముగ నఱచిరి.

'వాని బట్టితిమి!'

'పట్టుకొన్నారా? చచ్చినాఁడుగదా' యని మరల నెల్లరు నఱచిరి.

చావలేదు. మన మన్నఁ జాల భయపడి, చచ్చిపోయి నట్లు వదంతి గలుగఁజేసి నాఁడు. దహనక్రియలుగూడ జరి పించినాఁడు. ఈ చుట్టుపట్ల గ్రామాదులలోఁ దిరుగుచుండఁగాఁ బట్టుపడినాఁడు. కాలుసేతులు గట్టి ప్రజాసభ కీడ్చుకొని పోవు చుండగా నిప్పుడే చూచివచ్చితిని.'

ఒక్కక్షణకాల మా యంగడి యంతయు నిశ్శబ్దముగ నుండెను. ఆ క్షణములో గ్రామణియు, భద్రయు నొకరివంక నొకరు చూచుకొనుచుండిరి. 'దేశభక్తులారా! మీ రెల్లరు సిద్ధ ముగ నున్నారా!' యని గ్రామణి మరలఁ బ్రశ్నించెను.

తత్క్షణమే రొండినున్న కృపాణము సవరించుకొని భద్ర బయలుదేరెను. వీధియందు డప్పులు మ్రోగుచుండెను, క్రోధి యనిమొడి స్త్రీ యెక్కతె బొబ్బలిడుచుఁ, జేతులఁద్రిప్పుచు, స్త్రీల కందఱకు నుత్సాహముఁ బురికొల్పుచు నింటింటికిఁ బరువెత్తుకొనిపోయి చెప్పుచుండెను.

పురుషులెల్లరు సక్రోధులై, కంటికగపడిన యాయుధములఁ కేలఁబూని, వీధిలోనికిఁ బర్వెత్తికొనివచ్చిరి. కాని యా స్త్రీజన నికాయము జూచిన నెంతటి ధీరుడకైనను మనస్సు చలింపకపోదు. గృహకృత్యములను విసర్జించి, పాలకై యేడ్చెడి పసిపిల్లల దిగవిడిచి, కన్నుగాలులేక మంచమున బడియున్న ముదుసలులగతి నాలోచింపక, వీరావేశముతో బొబ్బలిడుచు నొకరినొకరు పురికొల్పుకొనుచు బలాఢ్యలగు 'నబలలు' వీధులఁ గిక్కిరిసిపోయిరి. 'అమ్మా! ముసలి ముండకొడుకు పీలుడు పట్టుబడినాఁడు!' 'అక్కా! దుర్మార్గుఁడు పీలుడు చిక్కినాఁడు! ఇవియే వారి కేకలు, అంతట మరికొందరు స్త్రీలరచు వారిని జేరవచ్చి, 'పీలుడు బ్రదికియున్నాఁడా? అన్నములేని ప్రజలను గడ్డిదినుమన్న పీలుడు! మానాయనకు నింట నన్నము లేనపుడు గడ్డి దినుమన్న పీలుడు! నా జొన్నులు పాలులేక యెండిపోయినపుడు గడ్డి గుడువుమని నా బిడ్డకుఁ జెప్పిన పీలుడు. పీలుని నెత్తురు ద్రాగుదుము. పీలుని తలఁ వ్రక్కలు చేయుదము. కాని మాంస ఖండముల నుప్పుతో గ్రుచ్చి

యెత్తి భూమిలో బాతిపెట్టుదము. వాని పైనుండి గడ్డిమొల చును! ఇట్లరచుచు వారందరుఁ బ్రజా భవనమునకుఁ బర్వెత్తికొనిపోయిరి. వారికా తొందరలో నెన్ని దెబ్బలు దగిలినను దెలియుట లేదు. ఆయుధ పాణులగు స్త్రీపురుషులా ప్రజాసభయందొక్క యఱగంటలో నిసుక వేసిన రాలకుండఁ గిక్కిరిసి యుండిరి. అనంతపద గృహంబులందుఁ బసిబిడ్డలును ముసలులుందప్ప నింకెవ్వరును లేరు.

సభాభవన మంతవిశాలమైనది గాదు. వృద్ధుఁడగు పీలుడు గడగడ వణఁకుచు నిలువఁబడి యుండెను. వినాయక గ్రామణియు, నాతని భార్యయుఁ నెదుటనే గూర్చుండియుండిరి. ఆ భవనములోనను, నెదుట వీధియందునుగూడ నేల యీనిన చందమున జనులు తండోపతండములుగఁ జేరియుండిరి. కొందరు యువకులు గవాక్షములలో నెక్కి కూర్చుండి లోపల నేమి జరుగుచున్నదో చూచుచు, బయట వీధిలో నున్నవారలకుఁ దెలుపుచుండిరి.

“చూడుండి! చూడుండి! ముసలిముండ కొడుకును త్రాళ్ళతోఁ గట్టివేసినారు! ఆఁ మంచిపని చేసిరి! గడ్డిమోపును వాని వీపునకుఁ గట్టినారు! ఓహో! అంతే తినుము నుండి! యిపుడు తినుచుండి! అని పీలుని గత్తితోఁ జూపుచు మరలఁ జప్పట్లఁ జఱచుచు, భద్రావతి క్రోధోద్రేకమునఁ గేకలిడుచుండెను.

ఆ సమూహామున భద్రినెఱుంగని వారు లేరు. భద్రి యనిన మాటల నన్నిటిని ముందు వారు వెనుకవారికిని, వారు మఱింత వెనుకవారికిని, దెలుపుచుండిరి. గవాక్షములయందు బిడ్డలవలె నెక్కియున్న యువకులు కూడ బయలునున్న వారికా సమాచారములం బూసగ్రుచ్చినట్లు తెలుపుచుండిరి. అందువలన భద్రావతి యేమిచేసిన, మిగిలిన ప్రజలందఱు నదియే చేయుచుండిరి. చుట్టుపట్ల వీధులలోనున్నవారు గూడ భద్రావతి యున్న తపోలాపముల కానందించుచు, నాకసము చిల్లులు వడునట్లు కరతాళధ్వను లొనర్చు చుండిరి.

దుర్మార్గుఁడగు పీలునిపైఁ గసి తీర్చుకొనకుండ వారి శాంతకాలము గడుపఁగలరు ! తుట్టతుదకు వారు కోపోద్రేకమున నవశులైరి. పీలుని సభావేదికపై నుండి క్రిందికీడ్చిరి. న్యాయాన్యాయ విచారణమింక ననవసరము ! వారి చిత్తానుసార మాతని హింసింపవచ్చును.

వినాయక గ్రామణి యొక్కమ్మడి నా మందభాగ్యునిపైఁ గవిసి, మృత్యుదేవతా సమానమగు కౌఁగిటఁ బట్టి కొనెను. వాని కాలుసేతులఁ గట్టియున్న రజ్జువు భద్రావతి గుప్పిట నిమిడియున్నది. ఇంకెందుఁబోఁగలఁడు ! కిటికీలలో నున్న యువకులు పక్షులవలె నెగిరి నేలపై కుఱికిరి. పీలుడు భద్రావతీ గ్రామణులకు హస్తగతుఁడయ్యెనని వీధులలో మార్గములల 'దొక్కిఁడు లాడుకొను చున్నవారికిఁ గూడఁ

దెలిసిపోయెను. అప్పుడొక మహారవ మా ప్రజాసమూహ ములో నుద్భవించి, మిన్నంటినది. 'బయటకుఁదెండు. ఒంటి స్తంభము వద్దకు బయటికి తెండు !' ఇదియే వారి కోరిక ! వారి యఱపు !

మెట్లపై నుండి తలక్రిందుగఁ బడద్రోయుచు, నడచెడి వాని బడవేయుచు, వెల్లకిల ద్రోసి యీడ్చుచుఁ గొట్టుచు, నిటునటు లాగుచు, గడ్డి కట్టలను నోటఁగుక్కుచు, వస్త్రములు చినిఁగిపోవ, శరీరమునుండి రక్తము ప్రవింప, నెల్ల వారిని గాలును గడ్డముఁ బట్టికొని క్షమింప వేఁడుకొనెను. పిలుని వీథిలోని కీడ్చి, యొంటి స్తంభము కడకుఁ జేర్చి - పిల్లి చెలగాటమునకై యెలుకను విడిచినట్లు - భద్రావతి యాతని నొక్క తన్నుదన్ని విడిచెను. కాని పాపమూతఁడెందుఁబోఁగ లఁడు ? స్త్రీలాతని ఘోరముగఁ దిట్టిపోయుచుండిరి. పురుషు లాతని నోట గడ్డిఁగుక్కి, యుతితీయుఁడని కేకలిడుచుండిరి. కొందఱొక పెద్ద గడ్డికట్ట నాతని నోటికిఁ గట్టిరి. ఉరితాడు మెడకు దగిల్చి, పైకిలాగిరి. తాడు తెగినది గొల్లున నేడ్చుచు బడుచున్న వాని బట్టుకొని కట్టి మరలఁ బైకిలాగిరి. రెండవతూరి త్రాడు తెగినది. గొల్లున నేడ్చుచుఁ బడుచున్న వాని బట్టుకొని కట్టి మరలఁ బైకిలాగిరి. ఈ పర్యాయ మారజ్జువునకు దయ గలిగినది. ఒక్కించుకసేపాతఁడు గాలిలో వ్రేలాడుచుఁ గాలు సేతుల గించుకొని- మరణించెను. వానినోట గడ్డిగ్రుక్కి-

శిరము నఱికి, యొక బరిసెకొనకు దానిఁగ్రుచ్చి, స్త్రీ, పురుషులు వానిచుట్టును నృత్యముఁ జేయఁజొచ్చిరి.

---

పదునొకండవ ప్రకరణము.

# గృహదహనము.

---

ఒక సాయంతనమున విక్రమపుర రాజ్య మందలి రాచ బాట నిరువురు పురుషులు నడచి పోవుచుండిరి. వారు మిక్కిలి బడలియుండి యాఁకలిఁ గొన్నవారివలెఁ గృశించి యుండిరి. ఆ బాటయందే మనకుఁ జిరపరిచయుఁడగు పసులకాపరి, స్వగ్రామము చెంత మేయుచున్న మందలకుఁ గాపుండెను. వారిరువు రాతనిఁజూచి.

'ఈ రాత్రియే'

యనిరి. పసులకాపరి.

'ఈ రాత్రియేనా?'

యని తిరిగి ప్రశ్నించెను,

'అవును. సమయమున కిచటికిఁ జేరలేకపోదు మేనూ యను భయముచేతఁ బరుగెత్తుకొనుచు వచ్చితిమి. చాల నలసి యున్నాము. కొంచెముసేపీ గడ్డిపైఁ బండుకొని శ్రమ తీర్చి కొందుము. నీవింటికిఁ బోవునపుడు మమ్ము నిద్రలేపి పొమ్ము! అని చెప్పి వారిరువు రాగడ్డిపైఁ గాళ్ళు చాచికొని పరుండి గుఱ్ఱువెట్టి నిద్రపోసాగిరి.

సాయంకాల మాయెను. పశురింఛోళి గృహోన్ముఖ మయ్యెను. అరుణార్క బింబము నపరదిశం గాంచినపుడస్త

గిరి దహింపఁబోయెడి యగ్నికరణమా యిది యని యా పసుల కాపరికిఁ దోచెనేమో! ఆతఁడా నూతనుల దట్టి లేపెను.

'ఈ రాత్రియే అర్ధరాత్రి వేళ' నని వారు మరలఁ జెప్పి రాణావంశీయుల ప్రాసాదము వైపున కా పొలములలో నుండి యుడుపడి యేగిరి.

ఆ గ్రామమున జనులెల్లరు బ్రొద్దుగ్రుంకఁగనే యున్న దేవోలిని, మేడలెక్కియు, నిండ్లెక్కియుఁ, జెట్లెక్కియు నందఱు నొక్క వైపునకుఁ జూచుచుండిరి, వా రెవరిమాటలను లక్ష్య పెట్టుటలేదు. విశ్వాసకుఁడన్న నా యూరివారందఱు నడలు చుండెడివారు. ఆనాఁడు వారి కా ధైర్యస్థైర్యము లెచ్చట నుండి వచ్చినవో కాని, వలదన్నను వినక, నిచ్చెనలతో విశ్వాస కుని మేడపై కెక్కిరి. ఈ వికృత చేష్టితములఁ గాంచి, విశ్వాస కుఁడు భయభ్రాంతుఁ డయ్యెను. ఒక్క సాయంకాలములోన గ్రామవాసు లంద ఱెట్లు మార్పుఁ జెందిరో యని యాతఁడు మిగుల నాశ్చర్యముఁ జెందెను. అందుచేఁ దన కేమి కీడు వాటిల్లనున్నదో యని యాతఁడు గృహద్వారముల నన్నింటిని లోన గడియ వెట్టుకొని కూర్చుండెను.

అర్ధరాత్రమయ్యెను. గ్రామదేవాలయమందలి కంచు గంట విధి విరామములేక మ్రోగుచుండెను.

రాణాకోటలోని జనులందఱు గుండెలపైఁ జేతులుంచు కొని నిద్రాప్రమత్తులైయున్న యా నిశీథసమయమున—నా

నిబిడాంధకారమున—నిరువురు వ్యక్తు లాప్రాసాదప్రాకారము దాఁటి, యా కోట పూర్వపశ్చిమభాగములఁ జేరవచ్చిరి. ఇరు కెలంకుల నొక్కసారిగ మహాగ్నిశిఖలు ప్రజ్వరిల్లినవి. మరల నా వ్యక్తిద్వయము వచ్చినత్రోవనే తిరిగిపోయి యంధకార మున నదృశ్యులైరి.

ఆ మంటలు దృష్టిపథమున గోచరింపఁగనే యా గ్రామ మందలి జనులు కోలాహలము గావించిరి. వారు నిలచి యుండిన స్థానములనుండి కదలలేదు. ఇరుపురాశ్వికులు మహా వేగమున నా కోటకడనుండి గ్రామములోనికిఁ బరువెత్తుకొని వచ్చుచుండిరి. గ్రామములోఁ బ్రవేశింపఁగనే త్రోమరండు. రాణాకొడుకు కగ్నిప్రమాదము కలిగినది. కడవలు, బిందెలు, తీసికొనిరండు. అగ్నిఁ జల్లార్పదము. తోడురండు.? అని వారిరు వురు నత్యాతురముతోఁ గేకలిడుచుండిరి. ఆయాశ్వికులు విశ్వాస కుని గృహముకడ గుఱ్ఱములనుండి దిగి, యాతని జూడఁ బోయిరిగాని, సేవకులు తలుపులఁ దీసి లోనికిఁ బోనియ్య రయ్యె. జనులలో నొక్కఁడైనను, జేయి గదల్పఁడయ్యె. సహాయముచేయుదుమని రారయ్యె. మంటలు హెచ్చినకొలఁ దిని జేతుల ముడిచికొనియుండిన జనుల యుత్సాహముకూడ హెచ్చుచుండెను. పాప మా యాశ్వికు లేమిచేయఁగలరు ? వారు వచ్చినత్రోవఁ బడిపోయిరి.

మఱునా డాజానపదుల వీరావేశము హెచ్చినది. విశ్వా

సకుని ద్వారములు ఛేదింపఁబడినవి. విశ్వాసకుఁడు, వాతని యనుచరులను ఖయిదీలుగాఁ బట్టువడి, విక్రమపురమున కాఁనాఁడే యంపఁబడిరి.

ఈ దుర్గమే నాఁడే సమయమున, నీతి హెూత్రునిన కాహుతి గావింపఁబడినదో, యానాఁడే, యా సమయముననే విక్రమ పురరాజ్యమున సల్దిక్కుల నిట్టి దుర్గము లనేకములు దహింపఁబడినవి. ఆ విశాల దేశమున నొక్కరైనను వాని జల్లార్చ యత్నింపలేదు. వానియందుఁబసి క్రమ గ్గడివారి నొక్కరి నైనను రక్షింపఁ దలపఁలేదు. అమూల్య వస్తుచయముతో నిండిన సమున్నత ప్రాసాదములు మహెూన్నతాగ్ని జ్వాలల భస్మీపటలము లైనవి.

ఈ యగ్నిజ్వాలలు చల్లారినను, జనుల క్రోధాగ్ని జ్వాలలు చల్లారలేదు. బోల్నాడు విజయము లభించిన దాదిగ విక్రమపుర ప్రజాసైన్యము, వినాయకగ్రామణి నాయకత్వమున మహెూత్సాహ పూరితమయ్యెను. వారు దారుణ కృత్యము లొనర్ప వెనుదీయుటలేదు. పురుషులకంటె స్త్రీలప్రతిమానలై యుండిరి. వారిపట్టుదల యసమానము. జనులు తిండిలేక మల మలమాడుచున్న యా సమయమున, మహారాజగు విజయ రాముఁడు పరివార సమేతముగ వారశాలి పురమున కరిగి విందులతోడను క్రీడా వినోదములతోడను బ్రొద్దు పుచ్చుచుండె నని వినవచ్చెను. సుమారార్వేలమంది స్త్రీలు దేశమున నల్డి

క్కు లనుండి బయలుదేఱి, విక్రమపురిం గూడుకొని, ప్రభుదర్శనార్థులై వారశాలి పురమున కేగి, తినంగూడు లేకున్నను రాజప్రాసాదమును ముట్టడించి విజయరాముని బట్టుకొని విక్రమపురికిఁ దెచ్చిరి. జమీందారులును, ధనవంతులును, వెండిబంగారము మూటగట్టుకొని స్థిరాస్తులపై నాస త్యజించి, ధనశాగరికిఁ బాఱి పోవుచుండిరి. దేశపరిపాలన మంతయుఁ బ్రజాసైన్యముల హస్తగతమయ్యెను. జనులు పన్నులఁ జెల్లించుట మానిరి. రాజు లేఁడు. జమీందారు లేఁడు. [illegible] పన్నులును లేవు,

# లేఖ

---

రత్నాకరుఁడు కోటీశ్వరుఁడు. ఆతని వ్యాపారము పెద్దది. ధవళగిరి రాజ్యమునను విక్రమపురీ రాజ్యమునను ఆతని ఖాతాదారులనేకులు కలరు. ఇరురాజ్యముల వారాతని యెడల నమ్మకము గలిగియుండిరి. విక్రమపురమున సంభవించిన విప్లవము వలన నా దేశీయు లనేకు లాతని విక్రమపుర ప్రతినిధికడ ధనము దాఁచుకొనుచుండిరి. ధవళగిరికిఁ బాఱిపోయి వచ్చిన విక్రమపురీయు లందును సొంత వ్యాపారముల కొఱకును స్వదేశమందలి విశేషములఁ దెలిసికొనుటకును నాతని గృహమున కనుదినము వచ్చుచుఁ బోవుచుండిరి.

ఒకనాఁడు త్రివిక్రముఁడు, రత్నాకరు నింట నిజస్థానమున కూర్చుండి చాలతొందరగఁ బని చూచుకొనుచుండెను. విక్రమపురమునుండి పాఱిపోయి వచ్చిన పెద్దలు పలువురు భవనమునందే యిటునటు దిరుగుచుండిరి. గంగాధరుఁ డాతని దర్శింపఁబోయి, నమస్కరించి, చెంతనున్న బల్లపైఁ గూర్చుండెను.

గంగా:—'అయ్యా! ఏమి. నేఁడు మీరు చాల దొందర పని మీఁద నున్నారు?'

త్రివి:—‘గంగాధరా! విక్రమ పురమున సంభవించిన విప్లవమువలన, నచ్చట మా ప్రతినిధి కెక్కువ యొత్తిడి కల్గుచున్నది. ఆతనికి సహాయభూతుఁడనై యుండుటకు నే నచ్చటికిఁ బోవలెనని యాజ్ఞయైనది. రేపుదయమున నే ప్రయాణము’

‘నా మాట వినుఁడు. మీ రచటికిఁ బోవలదు. ఆ దేశ మిపుడు చాలఁ గల్లోలముగ నున్నది. మీరు వృద్ధులు, కష్టముల కోర్వలేనివారు. ఆ పురమున బ్రస్తుతకాలమున వశపడి యున్న ప్రజలు యుక్తాయుక్త వివేకశూన్యులు. వారొనర్చుచుండిన దారుణకృత్యములను వినుచుండియు, మీ రెట్లచటికి బోవ సాహసించుచున్నారు?’

‘కానిమ్ము. నా కేమి భయము! రత్నాకరుని పేరు చెప్పిన నెవరును నాపైఁ జేయివేయరు. అయినను స్వామికార్యముఁ జేయక దప్పునా?’

‘ఆర్యా, అట్లనుకొననలదు. మీ కిట్టి ధైర్యమేలకలిగినదో యూహింపఁజాలకున్నాను. వేఱొకరి నచటి కంపినఁ జెల్లదా. మీ రేల పోవలెను.’

‘గంగాధరా! ఎవరో యొకరు పోవలయును. వేఱొకరేల? ముసలివాఁడను నేనే సిద్ధమైయున్నాను. తప్పదు.’

ఆ సమయమున సేవకుఁ డొక యుత్తరము దెచ్చి త్రివిక్రమున కిచ్చెను. దానిపైఁ జిరునామ—

శ్రీ రత్నాకర సాహుకారులు చూచుకొని
మహారాజశ్రీ రాణా గంగాప్రసాద బహద్దరు గారికి
ఇప్పించవలెను. జవాబు.
ధవళగిరి.

యని వ్రాయఁబడియుండెను.

త్రివిక్రముఁడు గంగాధరుని నిజ నామ మెఱుఁగఁడు. అందువలన నాతఁడా గృహముననున్న పలువుర కాయుత్తరము జూపించుచు, నా చిరునామాదారుఁ డెచ్చట నుండెనో తెలుపుఁడని కోరుచుండెను.

'బలవన్మరణముఁ జెందిన రామప్రసాదుని యన్న కొడుకు గాఁబోలు నితఁడు. నేనీనిర్భాగ్యు నెన్నఁడుఁ జూడనే లేద'ని యొకఁ డనియెను. "స్వ సంతానమును విసర్జించి పాఱిపోయిన పిఱికిపంద వీఁడు. వీని నే నెఱుఁగ" నని యింకొక డనెను. "పిదపఁ గాలపు మాటలను విని, పినతండ్రితో వైరముబెట్టుకొని సుక్షేత్రములఁ బాగరెక్కిన ప్రజలకు వదలివేసిన వాఁడు వీఁడని మఱొకఁ డనియెను. గంగాధరుఁ డీ నిందావాక్యము లన్నియు, నిశ్చకితుఁడై వినుచు గూర్చుండెను. ఈ దూషణ భాషణము లాతనికి భూషలుగాఁ దోఁచెను. వారందరా చోటు బాసిపోయిన పిదప నాతఁడు

'ఆర్యా, నే నీతని నెరుఁగుదును. ఈ యుత్తరము నా

కిచ్చిన నే నాతని కందజేయఁగల' ననియెను. త్రివిక్రముఁ డందు లకు సంతసించి దాని నాతని కిచ్చెను.

గంగాధరుఁ డా కమ్మఁగైకొని పురబాహ్య ప్రదేశమున నిర్జనమగు నొక స్థలముఁ జేరి దాని విప్పెను. దానియం దిట్లు వ్రాయఁబడి యున్నది,

"అభయ దుర్గము, విక్రమపురము,
షష్ఠాని జ్యేష్ఠ శు॥ తదియ

'శ్రీరాణా గంగాప్రసాద బహద్దర్ ప్రభూ!

మా గ్రామవాసులు నాపైఁ బడి, బలాత్కారముగాఁ నా సొత్తు నంతయు లాఁగికొని నా గృహమును నిర్మూలన మొనర్చి, నన్నవమానపఱచి, యీ విక్రమపురమునకు నడి పించుకొని వచ్చినారు. త్రోవలో నేను మిక్కుటముగ నవస్థ పడితిని.

రాణాప్రభూ, 'దేశమును విడిచిపోయిన మీకుఁ బ్రతి నిధినై జనులకుఁ ద్రోహముఁ జేసితి'నను నేరము నాపైమోపి. నన్నీ చెఱసాలయం దుంచిరి. ఈ నేరమునకే ప్రజాసభయందు విచారణ జరుగఁ గలదు, మీ సహాయము లేనియెడల, నాకు మరణదండనము తప్పదు. మీ యాజ్ఞానువర్తినై ప్రజలకు మే లొనర్చుటకే కృషి చేసితినని వారికెంత నచ్చఁజెప్పినను, వా రా మాటలను లక్ష్యపెట్టుట లేదు. శిస్తు వసూలు చేయుట చాల కాలము క్రిందటనే మానియుంటినని వారికెంత చెప్పినను,

లాభము లేకున్నది. నీ వీ దేశమును విడిచి పాఱిపోయిన వాని ప్రతినిధివి. వాఁడేఁడీ?' యనియే వారి సమాధానము.

శ్రీరాణామహాప్రభూ! 'ఏఁడీ! ఆతఁ డెచ్చట నున్నాఁడో! ఏఁడీ' యని నిద్రలో నేనడుగుచుందును. నన్నుద్ధరింప రాఁడాయని దేవుని వేఁడుకొందును. ప్రత్యుత్తరము లేదు. రత్నాకరుని ద్వారమున మీకుఁ జేరఁగలవేమో యని, యీ నా దీనాలాపముల ధవళగిరికిఁ బంపుకొనుచున్నాను.

మహాప్రభూ! మీరు దైవభక్తి గలవారలేని, నిష్కళంకమగు వంశమునకు గౌరవము గూర్పనెంతురేని, నన్నుద్ధరించి, బంధవిముక్తుని జేయుఁడని ప్రార్థించుచున్నాను. విశ్వాసముతో మీ యాజ్ఞల నిర్వహించితి ననుటయే నా తప్పు. ఓ రాణామహాప్రభూ! నా విశ్వాసము మఱవక రక్షింపుఁడు. నా ప్రార్థన నాలింపుఁడు!

ఇట్లు,
'నిర్భాగ్యుఁడగు,
'విశ్వాసకుఁడు.'

విశ్వాసపాత్రుఁడగు భృత్యుని యాపత్తువలన గంగాధరునకు మిగుల జాలి కలిగెను. కమలను వివాహమాడి, దాంపత్యసుఖ మనుభవించుచు, నాతఁడు రాణాసంస్థానములోఁ జేయఁదలఁచిన పని నంతయుఁ జేయుచుండెను. తానే స్వయముగ నన్నిపనులఁ జూచుకొనుచు, సాధ్యమైనంతవఱకు బీద

జనులవద్దనుండి రావలసిన బాకీల నన్నిఁటి నెత్తివేయవలెనని యాతఁడు సంకల్పించి యుండెనుగాని యట్లు చేసి యుండలేఁడు. కాలయాపనమైనది. ఇపుడు చేయఁగలుగునది లేదు.

"కాని నే నెవ్వరిని బీడింపలేదు. వారినుండి యొక దమ్మిడీ నైనను బన్నులక్రిందఁ బుచ్చుకొనకుండుటయే కాక, బుద్ధిపూర్వకముగా వాని నన్నిఁటిని వదలుకొని, నా జీవనోపాధిని నేనే సంపాదించుకొనుచుంటిని. జనులఁ బీడింప వలదనియు, భూములను యథేచ్ఛగ ననుభవింప నిమ్మనియు, విశ్వాసకునకు లిఖితపూర్వకముగఁ దెలియఁబఱచి యుంటిని. విశ్వాసకుఁడు స్వక్షేమము కొఱకే కాగితముల నన్నిఁటిని బహిరంగ పఱపకమానఁడు. కావున నేభయపడవలసిన యవసరము లేదు.

"అదియుఁగాక, యఱువదేండ్ల వృద్ధుఁడగు త్రివిక్రముఁడు, స్వామి కార్య నిర్వహణమునకై యెట్టి యుత్సాహముతో విక్రమపురి కరుగుచున్నాఁడు! ఆహా! నా ప్రాణము లపైఁ దీపిచే, విశ్వాసకుని నా పత్నమయమున రక్షింపని యెడల నాకును, నా వంశమునకు నెట్టి యపకీర్తి రాఁగలదు? నేను భయపడుటకుఁ గూడ నెట్టి యవకాశముఁ గానిపించుట లేదు. విక్రమపుర ప్రజలయెడ నాకుఁ గల సదభిప్రాయముల సునాయాసముగ నిరూపింపఁ గలుగుదును. కావున వారు నన్ను నిర్బంధముల పాల్సేయు కుండుటయేకాక, గౌరవింపఁగలరు.

"విశ్వాసకుని యార్తారవము నాకర్ణములఁ బ్రతి ధ్వనించుచున్నది. నమ్మకమైన భృత్యుఁడు - నాకు పితృ యుఁడై యుండుటయే యాతని దోషము - ఛీ! ఆతని విడి పింపఁ జాలకున్న నా జీవిత మెందులకు? నేను విక్రమపురికిఁ బోవలయును. నిశ్చయము!

"కాని యీ వార్త నెట్లు కమలకు వినిపింపఁ గలు గుదును? మూఁడేండ్లనుండియు వియోగమన నెట్టిదో యెఱుఁ గక, సంతత సౌఖ్యము ననుభవించుచున్న కమల కీయుదంత మెంత హృదయ ఛేదకమగునో? ఆపె నా ప్రయాణోద్దేశ మెఱిఁగిన నన్నుఁ బోనిచ్చునా? విశ్వాసకుని విడిపించి, నే నచిరకాలములో దిరిగి రాఁగలను. కమల యీ కష్టము ననుభ వింపవలెను"!

గంగాధరుఁ డిట్లాలోచించు కొనుచు నింటికిఁబోయెను. మఱునాఁటి యుదయముననే నిర్విచారి యగు కమల గృహాంత రమున నున్న యదనుఁ జూచి, యొంటిగా నుయ్యెల యందూగు చున్న పసిబిడ్డను ముద్దిడికొని, కన్నులవెంట రాలు నశ్రుకణ ములఁ దుడిచికొని, గంగాధరుఁడింటిలో నుండి బయటఁబడి విక్రమపురికి వెడలిపోయెను.

ఆతఁ డిలువిడచి యొక గంటకాలము గడచిన పిదప బఱచారిక యొక్కరిత యొక యుత్తరమును కమల కందించెను. గంగాధరుఁడే యీ యుత్తరము వ్రాసి, పోవునపుడా దాసి

చేతికిచ్చి, కొంచెము సేపైన పిదప కమల కిమ్మని యాజ్ఞాపించియుండెను. అంతకు విశేషము లేమియు లేవు. విశ్వాసకుని రక్షింప విక్రమపురి కేగవలసి వచ్చినదనియు, శీఘ్రకాలములోఁ దిరిగి రాఁగలననియు, నంత దనుక, జనకున కుపచారములఁ జేయుచు, గృహకృత్యముల నిర్వహించుకొనుచు నిర్భయముగ నుండుమనియు మాత్రమందు వ్రాయఁబడి యుండెను.

మొదటి ప్రకరణము.

# కాళీదుర్గము

---

గంగాధరుఁడు సముద్రముదాఁటి విక్రమ పురాభిముఖ ముగ రాచబాటయందుఁ బ్రయాణ మొనర్చుచుండెను. ఆ మార్గము సుగమముగా లేదు. త్రోవయందుఁ బ్రతియూరను బ్రయాణికుల నందఱి నాపివేయు చుండిరి. భద్రావతి తయారు చేసిన జాబితాల నన్ని గ్రామములకుఁ బంపియుండిరి. ప్రతి ప్రయాణికుని పేరును దెలిసికొని, యాతనిపేరా జాబితాలో నున్నదేమో చూచి, కొందఱిని ముందునకుఁ బోకుండఁ ద్రిప్పి బంపుచుఁ గొందఱి నచ్చటనే యాపివేయుచు, మఱి కొందఱిని ముందునకుఁ బోనిచ్చుచుఁ బ్రతియూరివారు నిట్లు చిత్తానుసారముగ బ్రయాణికుల కాటంకములఁ గలుగఁజేయు చుండిరి. అతి కష్టముపై గంగాధరుఁడు కొన్ని గ్రామములఁ గడచి. యొకయూర బ్రొద్దుగ్రుంక నారాత్రి యచట విశ్రమించెను, అర్ధరాత్రమున నిరువు రాశ్వికులాతనిఁ దట్టి లేపిరి. వారిరువురుఁ ద్రప్పుదాగి, యున్మత్తులై యుండిరి. అతి మాలిన్యములగు దుస్తులతోడను, నెత్తురు టోపులతోడను, వికృతాకారులగు వారు, "రణాప్రసాద్. గుఱ్ఱమెక్కి మావెంటరమ్ము. నన్ను సురక్షితముగా విక్రమపురికిఁ జేర్పవలెనని మా కాజ్ఞయైన"దని

గంగాధరునకుఁ దెలియఁజేసిరి. గంగాధరుఁ డిట్టి సహాయ
మావశ్యకమని ముందే తలఁచి యుండుటచేత, మిగుల సాహస
ముతో "అట్లేవత్తును. మీ సహాయ మూరకపోదు. తగిన
బహుమతి నీయఁగలవాఁడ"నని వారివెంటఁ బయనమయ్యెను.
ఆతని ముందొకఁడును. వెనుక నొకఁడును గుఱ్ఱముల నడిపించు
కొని పోవుచుండిరి.

ప్రాతఃకాల మగుసరికి వారు భవాని పట్టణముఁ జేరి.
యచట సత్రమునం దొకించుక తడవు విశ్రమింప నుద్యుక్తు
లైరి. ఆ యూరివారందఱు నప్పుడే మేల్కాంచి, యెఱ్ఱటోపు
లను ధరించి, వీధులయందుఁ గోలాహల మొనర్చు చుండిరి.
గంగాధరుఁ డా సత్రము నెదుట నశ్వముపైనుండి దిగుచున్నపు
డాతని జూచుట కనేకులు చుట్టుకొనిరి. కొందఱు, పాఱుఁ
బోతా! దిగు'మని యొక్కసారిగఁ గేకలిడిరి. గంగాధరున కా
జనసమూహము యొక్క చర్య యతి వికృతముగఁ దోఁచెను,

'అయ్యలారా! నేను పాఱుఁబోతును గాను. నేను
బుద్ధిపూర్వకముగనే విక్రమపురికిఁ దిరిగి పోవుచున్నాను'
అని గంగాధరుఁ డనియెను. జనులలో నొక డాతని వైపునకు
దుమికి "నీవు పాఱుఁబోతువు. నీవు జమీందారుఁడవు. నీకుఁదగిన
శాస్తి కాఁగల"దని యఱచెను.

'కానిండు! మీ కెందులకిగోల? విక్రమ పురిలో నివి
యన్నియు విచారింపఁ గలరు!' అని యా సత్రాధికారి ప్రజ
లను శాంతిపఱుపఁ జూచెను.

'విచారణయా! బలే! దేశద్రోహిఁగా శిక్షింప వలసి నదే'యని వాఁడు మరల నఱచెను. మిగిలిన వారెల్ల రుత్సాహముతో గొల్లుమనిరి. ఆ మహాధ్వని యాఁగి పోవఁగనే, గంగాధరుడెల్లెత్తి, 'ఆయ్యలారా. మీరు పొరపడు చున్నారు. నేను దేశద్రోహిని గానని యెను.

'అబద్ధము! చట్టము ప్రకారము వీఁడు దేశద్రోహి! నీ ప్రాణము నీదికాదు. మాచేతులలో నున్నది, అని మరల జను లరచిరి. జను లాయా దేశమున నేమి చేయుదురో యని సత్రాధికారి భయపడి గంగాధరుని సత్వరముగ సత్రములోనికిఁ జేర్చి తలుపులను మూసెను. గంగాధరుఁ డాతనికి నమస్కరించి.

'అయ్యా! వాఁడేదో చట్టమనెనే, అదేమి చట్టము? అని యడిగెను.

అదియా ఈ దేశమును విడిచి పారిపోయిన వారి స్థిరాస్థులను విక్రయము చేయుమని చట్టము.'

'అది యమలులోనికి వచ్చి యెన్నాళ్లయినది.

'నాలుగు దినము లయినది.

'ఓహో! నేను ధవళగిరిలో బయలుదేరిన నాఁటి నుండియే?'

'దేశమునకుఁ దిరిగివచ్చిన పాఱుబోతులను శిక్షించుట కిట్టి చట్టములింకను గొన్ని యమలులోఁ బెట్టఁబడుననుప వదంతి కలదు. నీ ప్రాణము నీదికాదని వాఁడఱచెనే, యిందువలననే.

'కాని యిప్పటివఱకు నటువంటి చట్టములేవియు లేవు గదా ?'

'ఇప్పటికి లేకున్న నేమి ? క్షణములోనవి యమలులోనికి రావచ్చును. అయిన వానితో నీకేమిపని ?'

ఆ పగలంతయు గంగాధరుఁడా సత్రమునందే విడిసి యుండెను. మరలఁ బొద్దు గ్రుంకఁగనే, యనుచరులిరువురితోఁ బయనమై తెల్లవాఱుసరికి, విక్రమపుర ప్రాకార పశ్చిమద్వారముఁ జేరిరి. అధికారివలె నున్న యొకఁడు వీరి యొద్దకు వచ్చి,

'ఈ ఖయిదీ కాగితములేవి ?' యని ప్రశ్నించెను. గంగాధరున కాతని మాటలు కడువింతగఁ దోఁచెను.

'అయ్యా, మీ రెవరో నెఱుఁగను. గాని మీరు పొరపడుచున్నారు. నేను ఖయిదీని గాను. నే నీ దేశస్థుఁడనే. బుద్ధిపూర్వకముగా నీ దేశమునకుఁ దిరిగి వచ్చితిని. దేశముయొక్క కల్లోలస్థితిని జూచి నాసంరక్షణ కొఱకే సైనికుల సహాయమపేక్షించితిని గాని వేరుగాదు.' అని యాత డభిమానముతోఁ బల్కెను. కాని యాయధికారి యీమాటలను లక్ష్యపెట్టినటుల లేదు. అతఁడు తిరిగి,

'ఈ ఖయిదీ కాగితము లేవి ? యని యడిగెను. ఆ సైనికులలో నొకడు, టోపీలోనుండి కొన్ని కాగితములఁ దీసియిచ్చెను. ఆ కాగితములఁ జదువుకొనుచు, నందు విశ్వాసఁకుని జాబు

గని యాతఁడాశ్చర్యముతో గంగాధరునిఁజూచి, వేరుమాటాడ కయే వెనుకకుఁ దిరిగిపోయెను.

గంగాధరుఁడును, సైనికు లిరువురును గుఱ్ఱములపై నుండి దిగలేదు. గంగాధరున కేమియు దోఁచుటలేదు. ఆతఁ డిటునటు చూచుచుఁ గూర్చుండెను. జనులు, బండ్లు, పశువులు గ్రిక్కిరిసి యా ద్వారముకడఁ దొ్రక్కులాడు కొనుచుండిరి. తిరుబండముల నింకితర వస్తువులను, బురములోనికిఁ గొని పోవుడి బండ్లెక్కువ యాలస్యము లేక లోనికిఁ బోఁగలుగు చుండెనుగాని పురములోనుండి బయటఁబడుట మాత్రము దుర్లభముగనుండెను. ద్వారమున కడ్డముగ సైనికులనేకులు నిలచియుండిరి. బయటకు వచ్చెడి ప్రతిమానవుని బ్రశ్నించుచు, నాతని కాగితములఁ బరిశీలించుచుఁ బ్రతి బండిలోని పరికరము లను జాగరూకతతోఁ బరీక్షించుచు, నా ద్వారపాలకు లతి కష్టముపై వారిని బయటకుఁ బోనిచ్చుచుండిరి. ద్వారమునకుఁ జాలదూరమున నున్నవారు కొందఱు సావకాశముగ నేలపైఁ బండుకొని నిద్రించుచుండిరి. మఱికొందఱు చుట్టలఁ గాల్చు కొనుచు సంభాషించు కొనుచుండిరి. ఇంకఁ గొందఱు వచా రులు సేయుచుండిరి. స్త్రీ పురుషాదు లాబాలగోపాలము నెఱ్ఱ టోపులను ధరించియుండిరి.

ఆ దృశ్యము గాంచఁగనే గంగాధరుని గుండె జల్లు మనియెను. ఆ దేశప్రజల కెన్నఁడు నెట్టిద్రోహమును జేసి

యుండ లేదని రుజువు చేసికొనిననే కాని, యీ పురముఁ బ్రవే శించినపిదప బయటఁబడుట యుపాధ్యాయుని యాతనికిఁ దోఁచెను. ఇట్లొక యఱగంట గడచినది. ఆ యధికారి తిరిగివచ్చి, యాతని దోడ్కొనిపోయి ద్వారము దాఁటించెను. ఖయిదీని గమ్య స్థానమునకుఁ జేర్చిన ట్రూపైకులకు రసీదునిచ్చి యంపివేసెను. గుఱ్ఱముపైనుండి దిగిన గంగాధరుని వెంటనిడుకొని, యా యధి కారి యొక యింటిలోనికిఁ బోయెను. అచట సైనికు లనేకులు త్రాగి యొడలు తెలియక నిదురించుచుండిరి. కల్లువాసనతోను, బొగాకువాసనతోను, మిగుల నసహ్యముగ నున్న యా గది యందు బల్లలపైఁ గొన్ని జాబితాలు పఱవఁబడి యుండెను. ఒక యధికారి యచటఁ గూర్చుండియుండెను. వాఁ డొక చిన్న కాగితముఁ దీసికొని, దానిపై వ్రాయఁబోవుచు,

'గ్రామణీ. వీఁడా రాణాప్రసాద' ని యడిగెను.

'ఇతఁడే'

'రాణాప్రసాద్. నీ వయసెంత ?'

'ముప్పదియేఁడు'

'రాణాప్రసాద్. నీ వివాహమైనదా ?'

'అయినది'

'ఎచ్చట ?'

'ధవళగిరిలో'

'రాణాప్రసాద్ నీవు కాళీమర్గమునఁ జెఱ ననుభవింప వలెను.'

'ఇది యేటిన్యాయము! నా యపరాధమేమి?! యని గంగాధరుఁ డాశ్చర్యచకితుఁడై ప్రశ్నించెను. ఆ యధికారి కాగితముపై వ్రాయుటనాపి, మోమెత్తి యాతనిజూచి, రాణా ప్రసాద్, నీవీ దేశమును వదలి పోయినప్పటినుండియు, మాకు నూతన న్యాయశాస్త్రము, నూతనాపరాధములు నేర్పడినవని నిర్దయతో నవ్వుచు ననియెను.

'దయచేసి మీ రొక్క విషయ మాలోచింపుఁడు. నా మిత్రుఁ డొకడు నా సహాయ మపేక్షించి, యుత్తరమంప బుద్ధిపూర్వకముగ వచ్చితిని. ఆ యుత్తరము మీ యెదుటనే కాగితములలో నున్నది. నా కా మాత్రము స్వతంత్రతలేదా?'

"రాణాప్రసాద్, పాఱుఁబోతులకు స్వతంత్రిత లే"దని కఠినముగఁబల్కి యాతఁడు వ్రాసినచీటి నొకసారి చదివికొని, దానిని గ్రామణి కందిచ్చుచు, 'నొంటరిగా నని' యూదిచెప్పెను.

గ్రామణి, యాఖయిదీని వెంటఁబెట్టుకొని పురాభిముఖముగఁ బోవ సాగెను. ఇరువురు సాయుధులగు సైనికులు వారి వెంట నడచుచుండిరి. కొంత దవ్వేగిన పిదప గ్రామణి, గంగాధరు నిట్లు రహస్యముగఁ బ్రశ్నించెను.

'శంకర భగవత్పాదుని యల్లుడవా నీవు?

ఈప్రశ్నవలన నతఁడెవరో యెఱుకగలవాఁడని గంగాధరున కాశ పొడమెను.' 'అవును నేనే'

'నాపేరు వినాయకగ్రామణి. అనంతపదమున నొక

సారాయంగడికి యజమానుడను. బహుశః మీ పేరు వినియే యుండవచ్చును.

'నా భార్య తండ్రిని జూచుటకు మీ యింటికే వచ్చి నది కాదా?'

'అబ్బా! నీవీ దేశమున కెందులకు వచ్చితివ'ని గ్రామణి యత్యాతురముతో ననెను.

'నేనింతకుముందే చెప్పియుంటిని గదా నీకది యబద్ధ మని తోఁచుచున్నదా?'

'అబద్ధము కాకున్న నేమి?' యని గ్రామణి చాల నొచ్చుకొనెను.

'నేను మోసపోయితిని ఈ దురవస్థ - యీ యన్యాయము - నేఁ గని విని యెఱుఁగను. నా కొక్క సహాయముఁ జేసెదవా?'

గ్రామణి, శిరము నిటుఁ నటుఁ ద్రిప్పక, సూటిగ ముందు నకుఁ చూచుచు, నడచిపోవుచు 'జేయ' ననియెను.

'నన్నన్యాయముగా నీ చెఱసాలయం దుంచుచున్నారు. గదా! ఇతరులతో నుత్తర ప్రత్యుత్తరముల జరుపుకొనుటకు నా కవకాశము గలదా!

'ఏమో, చూతువుగదా'

'ఇదియన్యాయ మని చెప్పుకొనుటకు వీలులేకుండ, నీచెఱసాల యందు మ్రగ్గవలసియే యుండునా?.

10

'ఏమో మూతువుగదా, ఇంతకంటె నధమములయిన చెఱసాలలో నెంతమంది నిదివఱకు బూన్చిపెట్టలేదు'

'నేనా! వినాయకగ్రామణీ. నే నెవరినైన నట్లు చేసితినా' గ్రామణి వేఱు మాటాడలేదు. ఈతఁడెట్టి సహాయము జేయఁగల వాఁడు కాఁడని గంగాధరుఁ డాశాహతుఁడయ్యెను.

వారు కాళీదుర్గముఁ జేరిరి. ఇనుప ద్వారముఁ గడచి, దుర్గంధ యుతములగు గల్లీల గుండ నడచి, గంగాధరుఁ డొక విశాల మందిరము లోనికిఁ గొంపోఁబడెను. అచట సుమారేఁబదిమంది స్త్రీ పురుషులుండిరి. స్త్రీలందఱు వ్రాయుచనో, చదువుచనో, యల్లుచనో కూర్చుండిరి. పురుషులు కొందఱిటు నటుఁ బచారులు సేయుచుండిరి. గంగాధరుఁ డిట్టివోట సుకుమార గాత్రులగు నుత్తమ వంశజులఁ గనవచ్చునని యనుకొనలేదు. ఆతఁడులికి పడియెను. గాని వా రెల్లరు నీతని జూడఁగనే నిలువఁబడి సవినయముగ నాహ్వానించిరి. విక్రమపురమున నిన్నాళ్ళ వఱకును ధనధాన్య సౌభాగ్యములలోఁ దులఁదూఁగుచుండిన సంపన్న గృహస్థులు వీరు. వీరిలో నొక సరసుఁడు ముందునకువచ్చి, యా నూతనునకు నమస్కరించి.

'మీవలె నిర్భాగ్యులగు నీ మిత్రబృందము పక్షమున మిమ్మీ కాళీదుర్గమున కాహ్వానించు చున్నాను. మాకుఁగూడ నీయవస్థ సంభవించి నుమలకు మేమందఱముచు వగచు చున్నాము. మీ రచిరకాలములో స్వేచ్ఛావరు లగుదురు

గాక యని కోరుచుందును. మీనామమేదియో సెలవిత్తురా?'

'ఆపన్నమనుమున స్నేహ వాత్సల్యములఁ జూపెడి మీకు వందనములు. నేను రాజావంశీయుఁడను. నాపేరు గంగాప్రసాదు.'

'కాని, మీ కొంటరి శిక్ష కాదుకదా?'

'ఏమో! ఆమాట యనుకొనుచుండఁగా వింటిని గాని యర్థము బోధపడ లేదు.'

"అయ్యో పాపము! కడు విచారకరము! కాని ధైర్యముఁ బూనియుండుఁడు. మాలోఁ గొందఱిని మొదట నొంటరిగనే యుంచిరిగాని కొలఁది కాలములోనే మాలోఁ జేరనిచ్చిరి." యనుచు నా సరసుఁడు వెనుకకుఁ దిరిగి, మిత్రబృందము నుద్దేశించి, 'మిత్రులారా! వీ రొంటరిగనే యుంపఁబడుదురని తెలుపుటకుఁ జింతిల్లుచున్నాను.' అనియెను. వా రెల్ల రా క్రొత్త ఖయిదీపై మిగుల జాలిగొందిరి. అధైర్యపడవలదని ప్రోత్సహించిరి. గంగాధరుఁడు సవినయముగ వారి యొద్దనుండి సెలవుగైకొనియెను. చెఱసాల యధికారి యాతని నొంటరిగ నొకగదియం దుంచి, యినుప కవాటమును బిగించెను.

---

# రక్తబలి.

విక్రమపుర ప్రజాసైన్యము విక్రమవిహార మొనర్చుచుండెను. విజయరాముఁడు ప్రజాపీడన మొనరించి, నిరంకుశ పరిపాలన మొనరించినందులకు మరణదండనమునకుఁ బాత్రుఁడయ్యెను. రాజాంతఃపురమున కెదురుగ రాజవీథియందు, మహారాజగు విజయరాముని కంఠరక్తము చిందియున్నది. పాపమెట్టివాని కెట్టిగతి! ప్రజల హింసించియుండినఁ బెక్కురు సంస్థానాధిపతులను, రాజబంధువులను, కారాగారములందుంచిరి. న్యాయవిచారణ మొనర్చుటకొక ప్రజాసభ యేర్పడెను. ఆ సభకు లెట్టి నియమములఁ బాటింపక, ద్రోహుల నేరములను విచారించుచు, శిక్షానర్హులగు కొద్దిమంది ఖయిదీలను విడచుచుండిరి. కొందఱిని మరలఁ గారాగృహములోనికిఁ బంపివేయుచుండిరి. దేశద్రోహులని నిర్ణయించిన వారల కురిశిక్ష విధించుచుండిరి. క్రూరస్వభావులగు ప్రజాసైనికులొక్కొకపు డట్టి శిక్షితులపైఁ బడి, పలువిధముల హింసించి చంపుచుండిరి. ప్రజ లనేకులు, సాయుధపాణులై సైనికులతోఁ బాటు మారణవ్యాపారములందు సంచరించుచుండిరి. ప్రభువుల విలాసభవనములు, ప్రజల దారుణక్రియారంగములుగ మాఱెను.

విక్రమపురమున రత్నాకరుని వ్యాపారనిలయ మొక్క సమున్నతసౌధము. ఆ గృహ యజమానుఁడగు నొక రాజబంధువు ప్రజలకు భయపడి, వంటలవాని వేషమునఁ బురప్రాకారములఁ దాఁటిపోయి ప్రాణము దక్కించుకొనియెను. ఈ సౌధమంతయు వలనఁ బ్రజాధీనమైపోయెను. ఆ ప్రాసాదము చుట్టునున్న విశాల ప్రదేశమున నొక పెద్ద సానత్రాయి నెలకొల్పఁబడి యుండెను. ప్రజల మాయుధములు నరకంఠవిచ్ఛేదముచే మొక్కవోయి నపుడు, మరలఁ బదును వెట్టుకొనుట కిది యుపయోగింపఁబడు చుండును. త్రివిక్రముఁ డొంటరిగ నా సౌధాంతరమునఁ గార్యస్థానమునఁ గూర్చుండి, తన మిత్రకోటిలో నెవరును విక్రమపురీయుల దురాగ్రహమునకు గుఱి కాలేదు గదయని సంతసించు చుండెను. ఇంతలో నా సౌధ ప్రకార ద్వారము దెబ్బ చిన చప్పుడాతనికి వినవచ్చెను. ఆయుధములఁ బదును వెట్టికొని పోవచ్చిన జనులే దాని దెఱచి యుండిరని మాతఁడూహించెను గాని, జన సమ్మర్దముచేఁ గలుగు సందడి మాతనికి వినిపించుట లేదు. రెండు నిమిషములలోఁ గమలా భగవత్పాదు లీతని కట్టెనుటఁ బ్రత్యక్షమైరి.

‘ ఏమిది ? ఏమిది ? ఏమి మూశినది ? ఈ యూరి కేలవచ్చితి ? ’ రని త్రివిక్రముఁ డత్యాతురమునఁ బ్రశ్నించెను.

కమల వెక్కి వెక్కి యేడ్చుచు, ‘ నాభర్త యిచ్చటనే యున్నా ’ డనియెను.

త్రివి:—'ఇచ్చటనా? విక్రమ పురములోనా?'

కమ:—'ఇచ్చటనే నాలుగైదు దినములైనది- వచ్చి- ఎవరినో రక్షింప వచ్చెనట- పట్టువడి ఖయిదులో నున్నాఁడు'

త్రివిక్రముఁ డయ్యోయని విలపింపఁ దొడఁగెను. అపుడే యా ప్రాకార ద్వారముఁ దెఱచి నటుల మరల నడుగుల చప్పుడు వినవచ్చెను. జనుల గుంపొకటి లోన బ్రవేశించి నటుల గొప్ప సందడి యయ్యెను. భగవత్పాదుఁడు, "ఈ సందడి యేమి?" యనుచు గవాక్ష కవాటములఁ దెఱవఁ బోయెను.

'వలదు! చూడవలదు!' అని త్రివిక్రముఁ డఱచెను. భగవత్పాదుఁడు గడియ దీయఁబోవుచు నాగి, వెనుకకుఁదిరిగి.

"అయ్యా! యేమనుకొంటిరో కాని నాకీయూరఁ జాల పలుకుబడి కలదు. నేను బోల్నాడు దుర్గమునఁ బదునెనిమి దేండ్లు చెఱ ననుభవించిన వాఁడనగుట నన్నెఱిఁగిన వారెవరును, ద్రోహముఁజేయు తలంపుతో, నాపైఁ జేయెత్త సాహసింపరు. అనేకులు నన్నాలింగన మొనర్చుకొని, భుజస్కంధములఁ గూర్చుండఁ బెట్టికొని త్రిప్పియుండిరి. మా ప్రయాణమున కెవ్వరు నంతరాయములఁ గల్పింపనే లేదు. గంగాధరుఁ డిచ్చటనున్నది సునాయాసముగఁ దెలిసికొంటిని. ప్రజలకు నాపై నిట్టి విశ్వాసము గలదని నేనెఱుఁగుదును. కమలతో

నామాటయే చెప్పితిని. ఈ సందడియేమి ?' యని యాతఁడు మరల గవాక్షముఁ దెఱవఁబోయెను.

త్రివి:—' వలదు చూడవలదు! అమ్మాయీ. కమల! నీవైనను జూడవలదు! భయపడకుము. గంగాధరుఁ డిట్టి విపత్తులలో నున్నాఁడని నేనెఱుఁగనే యెఱుఁగను. ఆతఁ డేచెఱసాల యందున్నాఁడు ?'

కమ:—' కాళీదుర్గమున'

త్రివి:—' కాళీదుర్గమా! అమ్మా కమలా! నీవు సర్వము నెఱింగిన దానవు. ధైర్యవతివి. సమయానుకూలముగ నీవు ప్రవర్తించు టుత్తమము. నీవేమనుకొందువో గాని, నేను జెప్పినట్లు చేయుట నీకు శ్రేయస్కరము. నీవిప్పుడు చేయఁగల పనియేమియు లేదు. ఇలు విడిచి పోఁజాలవు. నీ భర్త కొఱకెట్టి కష్ట పరంపరల కైనను జంకకుము. విభ్రాంతిఁ జెందక నాకు విధేయురాలవై యుండుము. నిన్నా తుది గదిలో నుంచెదను. అచటి నుండి యీవలకు రాకుము, ఇంచుక సేపు నీ తండ్రితో నేకాంతమున మాటాడవలసి యున్నది ?

త్రివిక్రముఁ డాపెనాగదిలోనికిఁ జేర్చి, తిరిగి వచ్చెను. గవాక్షముఁ దెఱచి, త్రివిక్రమ భగవత్పాదులు బయటికిఁ దొంగిచూచిరి.

చూచుటకేమున్నది! వికృతాకారులగు స్త్రీ పురుష

లగుచు. వారి సర్వాంగకములును, వసనములును రక్తరక్తములై యున్నవి. ఆయుధము లన్నియు శోణితధారలచేఁ బునీతములై యున్నవి. వారి నేత్రముల రుధిరము గూడుకొన్నట్లరుణములై యున్నవి. ఆ భయంకర పిశాచమూర్తులు యథేచ్ఛగ నా ప్రదేశమునఁ దిరుగాడుచుండిరి. ఆ రాక్షసుల నిశ్వాసోచ్ఛ్వాసము లగ్నిస్ఫులింగములఁ గ్రక్కుచున్నవి. వారి పదాఘాత జనితధ్వనులచేతను, వికృతాక్రందనములచేత నా ప్రాసాద ప్రాకారములు ప్రతి ధ్వనించుచుండెను. బీభత్స స్వరూపులగు నిద్దరు సాన ఖాతిపిడిని బట్టి గిరగిరఁ ద్రిప్పుచుండిరి. ఎవరికి వారు మిగిలిన వారికంటె ముందుగఁ దమ కత్తిని బదును పెట్టుకొని పోఁజూచుచుండిరి. అందుచే నా గుంపునందొకరి నొకరు త్రోసికొనుచుఁ ద్రొక్కుడు లాడుకొనుచుండిరి. ఆయుధములకుఁ బదును వెట్టికొనినవారొకరి వెంట నొకరు, భీకరముగ నఱచుచు, నరశోణితముఁ జవిచూచిన ఘాతుక మృగము లెట్లు మరల నట్టి రక్తాసక్తిమై నున్మత్తములై తిరుగునో, యట్లే వీథులంబడి పరుగెత్తుచుండిరి. భగవత్పాదుఁడు సవితర్కములగు చూపుల మిత్రుని జూచెను. త్రివిక్రముఁడు మందస్వరమున నిట్లనియెను. "వాండ్రు ఖడ్గములను జాపుచున్నారు. నీకీ ప్రజలతోఁ బలుకబడి యున్న మాట సత్యమే యగు నెడల, వీరికి నీ వెవరవో తెలుపుకొని, కాళీమర్గమునకుఁ దోడ్కొని పొమ్మనుము. ఒకక్షణమైన

పాలసింప వలదు !" ఆతఁడు వెంటనే బయలుదేఱిపోయెను.

త్రివిక్రముఁడు కిటికీలోనుండి మరల దొంగి చూచు నప్పటికి భగవత్స్వాముఁడు గుంపునఁ గలిసికొనియెను. ఆతని చుట్టును జనులు మూఁగియుండిరి. ఆతఁ డస్పష్టములగు మాటలతోఁ గ్లిష్టముగ స్వకీయ చరిత్రముఁ జెప్పుకొనెను. జనుల సమరోత్సాహ మంతలో భక్తి పూరితమయ్యెను. పలువు రాతని కౌఁగలించుకొనిరి. కొందఱాతనికి సాష్టాంగదండ ప్రణామముల నాచరించిరి. ఒక ధృఢకాయుఁ డాతని బుజములపై నెక్కించుకొనియెను. 'జయము ! బోల్నాడు ఖయిదీకి జయము. కాశీదుర్గమునకు బోవుము ! బోల్నాడు ఖయిదీ చుట్టమును విడిపింతము !... బోల్నాడు ఖయిదీకిఁ దోవచేయుఁడి ! కాశీ దుర్గములోని రాణాను విడిపింపుఁడి ! యని బొబ్బలిడుచుఁ జిందులు ద్రొక్కుచు, భగవత్స్వాము నెత్తుకొని, యా కిరాత సమూహము రాజవీధిఁ బడి పోవుచుండెను.

త్రివిక్రముఁడు గవాక్షమును మూసి, కమలను జేరఁబోయి,

'అమ్మా ! నీ తండ్రి నీభర్తను జూడఁబోయినాఁడు. నీ వేమియు భయపడకుము. భగవత్స్వాముఁడు బోల్నాడు ఖయిదీ యగుటవలన నీదేశమునఁ జాల పలుకుబడి గలదు. నీభర్తను దప్పక రక్షింపఁగలఁడు' అని ధైర్యముఁ జెప్పుచుండెను. పరిచారికయగు భైరవి పసిబిడ్డ నెత్తుకొనివచ్చి తల్లి యొడిలో నుంచెను. త్రివిక్రముఁడు పసిబిడ్డను జాగ్రత్తగ గాపాడవలెను.

సుమా ! ' అనుచు బాలికను ముద్దాడెను. కమల నాయింటనే యుంచుటకు సదుపాయముల నన్నిటిని గూడఁ జేయించెను.



మూడవ ప్రకరణము.

# ఏమగును?

మఱుసటి దినమున భగవత్పాదుని దస్తూరితోనున్న యొక యుత్తరము త్రివిక్రముని కందఁజేయఁ బడినది. దానిదెచ్చినది వేఱెవరునుగారు. వినాయకగ్రామణియే. అం దిట్లు వ్రాయఁబడి యుండెను.

'గంగాధరునకు క్షేమము. నే నింకను గొన్నాళ్లిచటనే యుండవలసి యున్నది. ఈ యుత్తరము దెచ్చినవాఁడే, గంగాధరుఁడు భార్యకు వ్రాసిన యింకొక యుత్తరము దెచ్చినాఁడు. కమలవద్దకు వీని దోడ్కొని పొందు'

త్రివిక్రముఁడు మిగుల సంతసించెను. గ్రామణిని వెంట నిడికొని, కమలకుఁ జూప లోనికిఁ గొనిపోవుచుండఁగా వారి వెంట నిరువురు స్త్రీలుఁ గూడలోనికి వచ్చుచుండిరి. "వినాయక గ్రామణీ, నీ భార్యయే కాదా! మనతోఁగూడ గనులను జూడ వచ్చుచున్నదా యేమి?" యని త్రివిక్రముఁడు ప్రశ్నించెను.

'అవును. తల్లి బిడ్డలను జూడవలెనని నాభార్యకూడ వచ్చినది. ఇదంతయు వారి క్షేమము కొఱకే, యని గ్రామణి పలికెను

త్రివిక్రమునకీసమాధానము సంతృప్తికరముగఁ గన్పిం

పలేను. భద్ర నురాలోచనా పరురాలని యాతనికనుమానము
దోఁచెను. కాని చేయునదిలేక కమల సముక్షమునకు వారి నం
దరి దోడ్కొనిపోయెను. గ్రామణి సవినయముగ గంగాధరుని
లేఖ నాపె కిచ్చెను. కమల తొట్రుపాటుతో నాకమ్మ నంది
కొనియెను.

'ప్రేయసీ — ధైర్యముఁ బూనుము. నాను క్షేమమే.
మీ జనకుని పలుకుబడి యసమానము. ప్రత్యుత్తరము
వ్రాయకుము.'

ఆ జాబునందున్న వ్రాతనంతయు నింతే. చదువుట పూర్తి
యగు నప్పటికి కమల నేత్రము లశ్రుజలపూరితము లయ్యెను.
ఈ వాక్యము లామెకు నూతనోజ్జీవముఁ గలిగించెను. ఆ లేఖఁ
గన్నుల కద్దికొని, ప్రాణప్రదముగ నరచేతులయందు దాచు
కొని కృతజ్ఞతాపూర్వకముగ భద్రావతికి నమస్కరించెను.

'అమ్మా. మీ కెంతయుఁ గృతజ్ఞురాలను.'

భద్రావతి కన్నెత్తియైనఁ జూడలేదు. వేఱు మాటాడ
లేదు. ఆ నిర్దాక్షిణ్యభావముఁ జూచినంతనే కమలగుండె జల్లు
మనియెను. ఆపె నిర్విణ్ణయై, దీనముగ నా మూతముఁ
జూచుచుఁ గూర్చుండెను. త్రివిక్రముఁ డది గుఱుతించి,
"కమలా, వీధులలోఁ దఱచుగఁ బోరాటములు జరుగు
చున్నవి నీ కే యాపదయుఁ గలుగదు. కాని యవసర సమ
యములందు మీకు సహాయముఁజేయ వీలగునని, నిన్ను నీ

బిడ్డను జూచిపోవ మీరందఱు వచ్చియున్నారు. ఏమి గ్రామణీ. నేను యథార్థమునే వక్కాణించుచుంటినిగదా ?" యని యెను. ఆ నూతనులు ముప్పురును స్తబ్ధులై నిలచిరి. ఆ మాటలను వారు విన్నట్లు లేదు. శిలాస్థూపముల యచలదృష్టి యా ముఖములం దమరియుండెను. గ్రామణి యొకసారి భార్యను జూచి, 'అవునని' త్రివిక్రమునకు సమాధాన మిచ్చెను.

'నీ బిడ్డఁ జూపింపు'మని భద్రావతి కమలను కోరెను. భైరవి యా బిడ్డ నెత్తుకొనివచ్చి, తల్లి పర్యంకమునం జేర్చి, భద్రావతిఁ జూచుచు నిలచెను. అంత భద్రావతి భర్తతో 'మన కింకేమియుఁ బనిలేదు. పోవుద'మని బయలుదేరెను.

కమల యాపెతో మాటాడుటకే వెఱచుచుండెను. అయిన నాపె చేయిపట్టుకొని, 'అమ్మా ! నాకుఁ బతిభిక్ష పెట్టుము. ఆయన కేమియు హానిచేయకుము' అని దీనముగ వేఁడుకొనెను.

'నీ భర్తతో నా కేమియుఁ బనిలేదు. భగవత్పాదుని కూఁతురవైన నిను జూచుచుటకే వచ్చితిని '

అట్లయిన, నా తండ్రి సౌఖ్యముకొఱకు—నా క్షేమముకొఱకు—నా బిడ్డ ముద్దుకొఱకు—నా నాథునిపై దయఁ జూపుము ! '

'ఆ చిన్నయుత్తరములో నీ భర్త యేమనివ్రాసినాడు ? ఏదో పలుకుబడియని యున్నదే ? '

'నా జనకుని పలుకుబడి యసమానమని.'

'ఇంకేమి. ఆ పలుకుబడియే రక్షించును. ఇంకేమి!'

'నా పైనను, నా బిడ్డపైనను దయయుంచి నా భర్తకే హానియు రానీక కాపాడుము! నీవు తలంచిన పనిఁ జేయఁగల సమర్థురాలవు! ఆయనను మఱవక, చేతనగు సహాయముఁజేసి, రక్షింపుము!'

భద్రావతి పాషాణహృదయము చలింపలేదు. ఆమె క్రోధితో నిట్లనియెను. 'మనము చిన్నతనము నుండియు నింతకుమించిన బాధలుపడిన తల్లులను, బిడ్డల నెంతమందిని జూచుటలేదు, వారిగతి యేమి? వారి భర్తలు, వారితండ్రులు నెంతమంది చెఱసాలలో దిక్కులేక చావలేదు? తినుటకుఁ గూడు లేక భర్తలుపోయి బిడ్డలుపోయి యేడ్చిన స్త్రీలనెంత మందిని మనము చూడలేదు?'

'అవును జాలమందిని చూచితి' మని క్రోధి తలయూపుచుండెను.

'ఇటువంటి యవస్థలు మనము చాలరోజు లనుభవించితిమి. ఇపు డొక్కరి కొఱకు మనమాలోచింప వలసిన యవసరము లేదు. రండు పోదము' అని యనుచు భద్రావతి శీఘ్రముగ నాయిల్లు గడచిపోయెను. క్రోధి యామె వెనువెంటనే నిష్క్రమించెను. గ్రామణియు త్రివిక్రముని కడ సెలవు గైకొని భార్య వెంటనే వెడలిపోయెను.

భగవత్స్వామి నాల్గుదినముల వఱకును దిరిగి యింటికి రాలేదు. ఈనాల్గుదినములలోనే విక్రమపురవీధులందు నిరాయుధులగు పదునొకండు వందలనూరు ఖయిదీలు, - స్త్రీలు - పురుషులు - పిన్నలు - పెద్దలు హత్యగావింపఁబడిరి. ఎచ్చోట జూచినను శవములు కుప్పలుగఁ బడియుండెను. తలలుదెగిన మొండెములు, ముక్కుచెవులులేని తలలు, వ్రేళ్లు నఱుకబడిన హస్తములు వివిధ మాంస ఖండములు, తెగిన నాలుకలు - ప్రేవులు - వీధుల విచ్చలవిడిగఁ జిమ్మఁబడియుండెను. పురమంతయు రక్తపాతమైనది. ప్రజల హింసోల్లాసము హెచ్చినది. చెఱసాలలోనున్న ఖయిదీలఁ గొందఱు బలవంతముగా బయటకీడ్చి ప్రజలు కసిదీర బొడిచి, చంపిరి. కాని యీఘోరవార్త లేమియు కమల యెఱుఁగదు. ఖయిదీల కందరకును ప్రాణాపాయము కలిగినదని మాత్రమామెకుఁ దెలియుదు.

భగవత్స్వామి డా నాల్గు దినములలో దానొనర్చియుండిన పని నంతయు సవిస్తరముగ త్రివిక్రమున కెఱింగించెను. "రక్తపాతములగు వీధులలోగుండ నన్నామూక కాళీదుర్గమున కీడ్చుకొనిపోయిరి. అచటనొక ప్రజాసంఘము దోషుల నాలోచించుచుండెను. విచారణ చేయుటకెంతో కాలముపట్టుటలేదు. వారికి నాచరిత్రముఁ జెప్పుకొంటిని. పదునెనిమిదేండ్లన్యాయముగ బోల్నాడు దుర్గమునఁ గఠినశిక్ష ననుభవించితినని విన్నవించుకొంటిని. అంతట నొకడులేచి నిలచి, నన్నుగుర్తుపట్టెను.

"ఆ సభయందు బల్లలపైనున్న జాబితా లన్నియుఁ బరిశీలించి, గంగాధరుఁ డప్పటి కింకను విచారింపఁ బడలే దనియు, సజీవుఁడై యున్నాఁడనియుఁ దెలిసికొంటిని. అతని విడుదల చేయవలెనని చాల తీవ్రముగ వాదించితిని. నేను బల్కిన ప్రతి వాక్యమును సభకు లామోదించి, హర్షించిరి. గంగాధరుని చెఱసాలలోనుండి తోడ్కొని రావలెనని యాజ్ఞ యయ్యెను. విచారణ ప్రారంభింపఁబడెను. గంగాధరుని విడిచి వేయుటకు సంసిద్ధులై యుండిరి. కాని యింతలో నేదియో మిష జరిగినది. సభాధిపతులు రహస్యముగ నొకరితో నొకరు మాటాడుకొనిరి. సభాధ్యక్షుఁడు లేచి, గంగాధరు నింకను జేఱసాలలోనే యుంచవలెననియు, నాయల్లుఁడగుటచే వలసిన సదుపాయములు చేయఁబడుననియు, నాతోఁ జెప్పెను.

వెంటనే గంగాధరుని కారా గృహాంతరమునకుఁ గొంపోయిరి. వీధులందు బ్రజలు బొబ్బలిడుచు నరహత్య లొనర్చు చుండిరి. గంగాధరుఁడు పొరపాటుచేఁగాని, దురదృష్ట వశమున గాని, వారి చేతులఁబడిన నెట్టి కీడు మూఁడునోయని మిగుల భీతిల్లితిని. ఆ విపత్తు గడచువఱకు, గంగాధరుని క్షేమ మరయు చుండుటకై నన్నా చెఱసాలయం దుండనిండని కోరఁగా సభాధ్యక్షుఁ డందుల కియ్యకొనియెను."

త్రివిక్రమున కానందమయ్యెను. ఈ వృత్తాంత మంతయు విని కమల పరితాప మించుక యుపశమించెను. అప్పటి

నుండియు, భగవత్పాదుఁడు రోగపీడితులగు ఖయిదీలకును, ప్రజలకు నెట్టి వివక్షయు లేక, చికిత్స యొనర్చుచుండెను. వైద్యుని నెల్లరు గౌరవించు చుండిరి. ఆతనిపై నెవరికి నెట్టి యనుమానమును లేదు. కొలఁది కాలములోనే యాతఁడు కాళీ చెఱసాలతోఁ బాటింకొక కారాగృహమునకుఁ గూడ వైద్యుఁడుగా నియమింపఁబడెను. ఆతఁ డనుదినము నల్లుని జూచివచ్చి, యాతని క్షేమసమాచారములఁ గూఁతునకుఁ దెలుపుచుండెను. గంగాధరుఁ డొంటరిఖైదులో నుండి విముక్తి నంది, మిగిలిన ఖయిదీలతోఁ గలసియుండుట కవకాశ మీయఁ బడెను. కమలకు జనకుని ద్వారమున, భర్తయొద్దనుండి వారమునకొక యుత్తరము వచ్చుచుండెను.

త్రివిక్రముని కార్యస్థానమున కమలా భగవత్పాదులు నివసించుచుండుట సమంజసముగ లేదు. అటకుఁ బలువురు పను లున్నవారు వచ్చుచుఁ బోవుచుందురు. అందువలన నా పురి యందు, త్రివిక్రముని సౌధమునకుఁ జేరువనొక ప్రశాంత ప్రదేశమునఁ జిన్న గృహము నద్దెకుఁ దీసికొని తండ్రికూఁతుల నచటికిఁ బంపివేసెను. త్రివిక్రముఁడు వారి సహాయార్థమై తన సేవకుఁడగు కాంచనుని గూడ నంపెను. భైరవియు నీతఁడును గృహకృత్యము లొనరించుచుండిరి.

పదునేను నెలలు గడచినవి. అల్లుని విడిపింప నా భిషగ్వరుఁడు సర్వశక్తులను వినియోగించుచుండెనుగాని ప్రజలాతని

యభీష్టము నెఱవేఱ నిచ్చుటలేదు. విక్రమ పురమున నూతన శకారంభ మయ్యెను. నిరంకుశ పరిపాలనము రూపు మాసి పోయినది. ప్రజలే ప్రభువులైరి. కాని విద్వేషావేశమున విజయమందిన ప్రజలకుఁ గన్నుమిన్ను దెలియుటలేదు. ప్రజా స్వాతంత్ర్య సత్యముల నంగీకరింపని పూర్వాచార పరాయణు లకు మరణము శాసింప బడినది. అనుమానపు మనుష్యుల కందఱకు చెఱసాలలే శరణ్యము లయ్యెను. క్రోధదేవత పూజ్యురాలయ్యెను.

పదునైదు మాసములు! దినములు గడచిన కొలఁ దిని కమల యాశ లడుగంటు చుండెను. భర్తృ మరణ దిన మాసన్న మగుచున్న ట్లామెకుఁ దోఁచుచుండెను. ముక్కు పచ్చలారని బాలికలు, సుందరాంగులగు యువతీమణులు, కోమల గాత్రులగు బాలురు, దృఢకాయులగు యువకులు, కాటికిఁ గాళ్ళుచాచిన ముదుసలులు- ఆగర్భ శ్రీమంతులు నిఱుపేదలు - ఏ వివక్షయు లేక - యెల్లర నంధకారబంధురము లగు చెఱసాలలోనుండి, బయటికి దెచ్చి, బండ్లపై నెక్కించి, యూరేగించి, మారణ యంత్రమునకు బలి నిచ్చుచుండిరి. ఇరుపార్శ్వములనుండి మహా వేగమునఁ గదలి వచ్చెడి పదను కత్తుల నడుమ వారి కంఠనాళములు దెగిపోవ, శరీరములు రెండు తునుక లగుచుండెను.

భగవత్పాదుఁ డొకనాఁడు కాళీదుర్గమునకుఁ బోయి

వచ్చి, కమలతో నిట్లనెను. 'అమ్మా! నే నిపుడే గంగాధరు నితో మాటాడి వచ్చితిని. నీవు ప్రతి బుధవారమును జాము ప్రొద్దువేళ గాళీదుర్గమునకు నుత్తర పార్శ్వమున నిలచి యుండుము. నీ భర్త చెఱసాలకిటికీలోనుండి నిన్నుఁ జూడఁ గలఁడు.'

అప్పటినుండియు కమల, తన బిడ్డను వెంటనిడుకొని, ప్రతి బుధవారము సపరాహ్ణము తిరుగఁగనే నియమితస్థానము నకుఁ బోయి వేచియుండును. ఆపెభర్తను జూడఁజాలదు. కాని యాతఁడు మాత్ర మాపెను జూడఁగలుగుచుండెను. కమలను జూడఁగనే యాతఁడు కిటికీలోనుండి చేయిచాచి, తన చిన్ని రుమాలును విసరుచుండును. దూరమునసున్న యా చేయి చెంతనున్నటులనే యాపె భావించి, ప్రీతితో దాని ముద్దాడు కొనుచుండును.

కాళీదుర్గమున కుత్తర పార్శ్వముననే యొక కమ్మరి వాని దుకాణముండెను. పూర్వకాలమున నా గ్రామము నందలి పనులకాపరియే యీ కమ్మరి ప్రతివారమును కమల యాచోటునకు వచ్చుటఁచూచి యాతఁ డనుమాన పడెను. ఒకనాఁడా కమ్మరి యాపెను బలుకరించి,

"అమ్మా! ప్రతివార మిచ్చటకు వచ్చుచుందువేల?" యనియెను. కమల యథార్థము దాఁపఁజాలక పోయెను. ఆ సమయమున నామార్గముననే ప్రజల గుంపొకటి కోలాహల

మొనర్చుకొనుచుఁ బోవుచుండిరి. కమల యీ సమూహముఁ జూడఁగనే భయాక్రాంతయై, యీ కమ్మరిదుకాణము లోనికిఁ బోయి నిలచెను. ప్రజలా దుకాణము ముందునిలచి వికట నృత్య మొనర్చుచుండిరి. భద్రావతి యీ గుంపులోనుండి వచ్చి, 'ఓహో జంబుకా! నీ దుకాణమున కీనాఁడు కళ హెచ్చినదే' యని పలుకరించి, మరల నాగుంపు ననుసరించి పోయెను.

తుట్టతుద కొకనాఁడు భగవత్పాదుఁడు చెఱసాలయందల్లుని జూచివచ్చి, యీ మఱునాఁడే గంగాధరుని నేరము విచారింపఁబడ నుండెనని కూఁతునకుఁ జెప్పెను. త్రివిక్రమునికా సంతోషవార్త నెఱింగింపఁగోరి తండ్రికూఁతు లాతని కార్యస్థానమునకుఁ బోయిరి. వీరిరాకఁ గనిపెట్టి, త్రివిక్రముఁడు తొందరగ నావెనుక గదిలోనికిఁ ద్రోయుచున్నాఁ డెవరిని? ఆతనిచెంతఁ గుర్చీపై నారబెట్టఁబడిన తడి యంగరఖా యెవరిది?

నాలుగవ ప్రకరణము.

# విజయము.

---

న్యాయాధిపపంచకము న్యాయస్థానమునఁ బరివేష్టించి యుండెను. ప్రతిదినమును విచారణ చేయఁబడనున్న దోషుల పట్టికను, వారున్న చెఱసాలలకుఁ బంపుచుండిరి. కారాగృహాధికారులా పట్టికలప్రకారము ఖయిదీల నొకరివెంట నొకరిని న్యాయస్థానమునకుఁ బంపుచుండిరి. గంగాధరుఁడు మొట్టమొదటఁ గాదుళీర్గమునఁ బ్రవేశించిననాఁ డేచోట మిత్రబృందమాతని నాహ్వానించి యుండెనో, యాచోటనే యిపు డాతఁడుండెను. కాని, పాప మాతని మిత్రులలో నొకఁడైన నచట లేఁడు. ఒకరివెంట నొక రందఱును మారణయంత్రమునకు బలియైరి.

ఒక గంటలో బదునైదుగురు దోషులు విచారింపఁబడిరి. అందఱికిని మరణమే శిక్షయయ్యెను. పిమ్మట గంగాధరుని న్యాయమూర్తుల సమక్షమునకుఁ బిలిచిరి. ప్రియనాథుని యాగమనమునకై నిరీక్షించుచుఁ గృశీభూతాంగయై, జనకుని చెంత నొదిగి కూర్చుండియుండిన కమలయే యాతని దృష్టి నాకర్షించెను. ఎఱ్ఱని టోపులను ధరించిన స్త్రీ పురుషు లా సభాభవనమునఁ గిక్కిరిసియుండు టాతఁడు గమనించెను.

ఆ విచారణకర్తలను— ఆ సభాసదులను జూచినపుడు న్యాయ విచారణ నామమాత్రావశిష్టమనియు, నమలచరిత్రుల జీవితములు కులటల హస్తగతమై యుండెననియు నాతనికిఁ దోఁచినది. దేశములోని యధములు, క్రూరులు, దుర్మార్గులును విచారణకర్తలై యా విపరీతరంగమున సూత్రధారులైయుండిరి. వారు న్యాయాన్యాయముల వితర్కించుకొనుచు రొదసేయుచుండిరి. న్యాయాధిపుల తీర్పులు సర్వజనాంగీకారములైన కేలింతలు. అనంగీకారములైన తిరస్కార సూచనలు. న్యాయాధిపులైనను, సభాసదులగు జనుల నదలించి, మందలింపఁజాలరు. పురుషులు సాయుధులై యుండిరి. స్త్రీలలోఁ గొందఱి వద్దఁ గత్తులుఁ గఠారులుఁగలవు. కొంద ఱాసభాంతరముననే తినుచుఁ ద్రాగుచుండిరి. స్థూలశరీరిణియగు స్త్రీ యొకతె గంగాధరుని కెదురుగ నిలువఁబడి యుండెను. ఆమె చెంతనే దృఢకాయుఁడగు నొక పురుషుఁడు కలఁడు. గంగాధరున కీతని జూచినటుల జ్ఞాపకము కలదు. అతఁడు వినాయకగ్రామణియే. ఆ స్త్రీ రెండుమూఁడు పర్యాయము లాతని చెవిలో రహస్యముగ నేదియో చెప్పుచుండుట వలన, నా యిరువురును భార్యాభర్త లేమోయను ననుమానము తోఁచుచుండెను. కాని వారు తన కతి చేరువలోనే నిలచియున్నను, దన వంకకుఁ దిరిగి చూడ రేల యని గంగాధరుఁడు సంకోచించెను. భద్రావతీ గ్రామణులు కనుబొమలు ముడివైచి విచారణ కర్తలనే రెప్ప వాల్పక చూచుచుండుటకుఁ గతం బేమి ?

"గంగాధరుఁడనఁ బరఁగెడి రాణాప్రసాదు దేశమును విడిచి పాఱిపోయినందులకు నూతనశాసనము ప్రకారము మరణశిక్ష పొందవలసియున్నది. అతఁడీదేశమునకు దిరిగివచ్చిన పిదపనే ఈ చట్టమమలులోనికి వచ్చెనదను వాదము నిరర్థకము. చట్టము ప్రత్యక్షముగా మీయెటనున్నది. అతఁడు మీయెదుట నిలచియున్నాఁడు. వీఁడీదేశముననే పట్టువడియెను. వీని శిర చ్ఛేదనము చేయవలెను"— ఇదియే ప్రజలవాదము.

'దేశద్రోహి! వీనితల నఱికివేయుఁడు!' అని సభికు లఱచిరి. న్యాయాధిపులు నిశ్శబ్దముగా నుండుఁడని సభికుల హెచ్చరించుచుండిరి. క్రోధియను స్త్రీ యెలుగెత్తి 'నేనూరుకొనను. మీరేమి చేసిననుసరే వానితలకావలెను!' అనియెను. ధ్వని యణఁగిన పిదప గంగాధరు నిట్లు ప్రశ్నించిరి.

'నీవుచాల దినములనుండి ధవళగిరియందే నివసించు చుంటివిగదా!'

'నిశ్చయమే'

'అటులైన యీ దేశములోనుండి పాఱిపోయినవాఁడవే కదా'

'నేను పాఱుఁబోతనుగాను, ఏలనఁగా, నేను రాణా జమీందారీనేలుట యందనిష్టముగలవాఁడనై బుద్ధిపూర్వక ముగా నాయాస్తిని విసర్జించి, యీదేశ ప్రజల కష్టములఁ

జూడలేక, పరదేశమునకుఁబోయి, స్వయంకృషిచే జీవనోపా ధిని సంపాదించుకొను చుంటిని'

'ఇందులకుఁదగిన సాక్ష్యమున్నదా ?'

'విశ్వాసకుఁడు, శంకర భగవత్పాదుఁడు - వీరిరువురు నాసాక్షులు'

'నీవు ధవళగిరిలోనే వివాహమాడితివా ?'

'అవును. కాని నాభార్య ధవళగిరి దేశస్థురాలుకాదు?'

'విక్రమపురి దేశ యువతియా ?'

'అవును. ఆమె జన్మస్థాన మీపురమే'

'ఆమె యెవరు ? పేరేమి ?,

'ఆమెపేరు కమల. భిషగ్వరుఁడగు శంకరభగవత్పాదుని యేకపుత్రిక".

ఈ సమాధానము వినఁగనే సభికు లొక్కుమ్మడి "బోల్నాడు ఖయిదీకి జయ."మని పెద్దపెట్టున నఱచిరి. తత్పూర్వమొక నిమేషముక్రిందట నాఖయిదీని వీధులలోనికి లాగి కండలఁబీకి వేయవలెనని క్రోధోద్భూతులై యున్న కొందఱీ మాటవినఁగనే భగవత్పాదునియెడ భక్తి పారవశ్యముననో, యనుకంపాతిరేకముననో, కన్నులనుండి జారెడి జలకణముల దుడుచుకొను చుండిరి. ప్రజల చిత్తమెంత యస్థిరము !

'నీవీదేశమున కీసమయమున నెందులకు వచ్చితివి ? పూర్వమే యేలరాకుంటివి ?"

ఏలయనఁగా, బుద్ధిపూర్వకముగా నేను వదలివేసియుం డినయీ స్వితప్పవిదేశమున వేఱుజీవనాధార మేమియును లేదు. నేను ధవళగిరిలో నుపాధ్యాయవృత్తివలన ధనమార్జించుకొను చుంటిని. నేనీదేశమునకు వచ్చిన కారణమిది. నేనిచ్చట లేకున్న నా యాశ్రితున కొకనికి బ్రాణాపాయము తటస్థించినదని యాతఁడు వ్రాసిపంపిన యుత్తరమువలన గ్రహించి, నాకెట్టి విపత్తులు రానున్న నాతని రక్షించుటయే కర్తవ్యముగాఁ దలంచి వచ్చితిని. ఇది మీకొక నేరముగఁ దోఁచుచున్నదా?'

సభికులు 'లేదు. లేదు.' అని కేకలిడిరి.

'ఆ నీ యాశ్రితుఁ డెవరు ?'

'నా ప్రథమసాక్షి విశ్వాసకుఁడు. ఆతఁడు నాకుఁ బంపి యుండిన కమ్మను, నే నీ దేశములో నడుగిడిననాఁడు నా వద్ద నుండి తీసికొనిరి. అది బహుశః మీ యెదుటనున్న కాగితము లలో నుండవచ్చును. చిత్తగింపుఁడు.'

ఆ లేఖ దొరకెను. దానిని సభికుల కెల్లరకుఁ జదివి వినిపించిరి. విశ్వాసకుని బిలిపించి, 'యీ యుత్తరము నీవు వ్రాసినదేనా ?' యని ప్రశ్నించిరి. ఆతఁ డవునననెను. ఆతని నిర్బంధించినది రాణాకొఱకే యనియు, రాణా పట్టువడుట చేతను, విశ్వాసకునియందు వేఱుదోషము లేవియు లేకుండుట చేతను, దండనార్హుఁడు గాఁడనియు, నాతని విడుదలచేయు టకు సెలవయ్యెను.

పిమ్మట రెండవ సాక్షియగు భగవత్పాదుని బ్రశ్నించిరి. ఆతని సమాధానముల జనులందఱు శ్రద్ధతోవిని మెచ్చుకొను చుండిరి. "నేను బదునెనిమిదేండ్లు బోల్నాడు కారాగృహ మునఁ జెఱ ననుభవించి, శల్యమాత్రావశిష్టుఁడనై విడువఁబడి నపుడు, గంగాధరుఁడే నాకు మిగుల సహాయభూతుఁగా నుండెను. మాతోఁ గూడి దవళగిరియందు నివాస మేర్పఱచు కొని, భక్తి విశ్వాసములతో మెలఁగుచు, వృద్ధాప్యమున నాకుఁ జేయూతగా నున్న దీతఁడే. అచ్చటఁ గూడ నీతనిపై నొకసారి రాజద్రోహపునేర మారోపింపఁ బడెను. నేఁ జెప్పిన మాటలన్నియు యథార్థములని నిరూపించుటకు నా మిత్రుఁ డగు త్రివిక్రముఁ డిందే కలఁడు. ఈయన రత్నాకరుని యను చరుఁడు. గంగాధరునితో దట్టమగు పరిచయ మున్నవాఁడు. అందుచే నీతని మీరు నమ్మవచ్చును. ఆయనను బ్రశ్నించి, నా నుడువులు యథార్థములని మీరు ధృవపఱచుకొనవచ్చును.' భగత్పాదుని గంభీరవాక్యముల వినఁగ నా సభికుల కెట్టి యనుమానములను జనింపలేదు. 'ఇఁక విచారణ యనవ సరము—అనవసర'మను కేక లా సభలో హెచ్చిపోయినవి. న్యాయాధిపులు తీర్పును బ్రకటించిరి.

'గంగాధరుఁడు నిర్దోషి,—వెంటనే యాతని విడుదల చేయవలెను.'

గంగాధరుఁడు కమలను గౌఁగలించుకొని, బిడ్డనెత్తు

కొని ముద్దాడు చుండెను. ఉత్సాహవంతులగు కొందఱు యువకులా దంపతుల చుట్టును జేతుల నడ్డువెట్టి నిలచి, వారిపై జనులు త్రోసికొని రాకుండఁ గాపాడుచు వీధుల లోనికిఁ జేర్చిరి. భగవత్ప్రాదు నొకఁడు బుజములపై నెక్కించుకొని, యా సమూహముఁ దప్పించి, యల్లునికడకుఁ జేర్చిరి. 'బోల్నాడు ఖయిదీకి జయ! జయ!' యని యఱచుచు, నాతఁ డల్లునితోడను గూఁతురుతోడ నిలుసేరువఱకుఁ బ్రజలు వెంటఁబడి సాగనంపిరి.

---

ఆ ద వ ప్ర క ర ణ ము.

# వి యో గ ము.

కమల భర్తృ పర్యంక స్థలమున నర్ధశాయినియై, తదేక దృష్టితో నాతని ముఖమండలము నీక్షించు చుండెను. గంగాధరుఁడు చెఱసాలలఁబడి తాఁగుడిచిన యిడుముల వర్ణించు చుండెను. కమల యా వృత్తాంతముల వినుచుండెనో లేదో కాని, యాతని వికసిత వదనార విందమును హృదయ ఫలకమున నిలిపియుంచెను. విక్రమపురిని విడిచిపోవుటకు మంచి తరుణ మెపుడాయని భగవత్పాదుఁ డాలోచించు కొనుచు త్రివిక్రముని కొఱ కెదురు చూచుచుండెను. విక్రమపురీయు లేవేళకు మరల నేమి తలంతురో! వారి సంకల్పము లస్థిరములు. సమయా సమయములం దావేశముచే నెట్టి దారుణము లైనఁ జేయుచుందురు. అందుచే శీఘ్రముగనే యాపురిని విడిచిపోవుట శ్రేయస్కరమని యాతఁ డెఱుఁగును.

భైరవియు, కాంచనుఁడును వాడుక ప్రకారము వంట సామగ్రికొఱ కంగడికేగి యుండిరి. ప్రతి వస్తువును బేరము చేయుట భైరవిపని. భైరవికి విక్రమపుర దేశభాష యొక్కించుకయుఁ దెలియదు. ఎన్నాళ్ళా దేశమున నున్నను, సామాన్య వస్తువుల పేరులుఁగూడ నామె కలవడలేదు. అంగడిలో నే

వస్తువు కావలెనో, యావస్తువును వ్రేలితోఁ జూపుచు, వెల యెంతయని వర్తకు నడుగును. ప్రత్యుత్తరము భైరవి కర్థము కాదు. అందుచే నతఁడు వ్రేళ్ళ సంఖ్యవలన వెలను దెలుపుచుండును. వాఁడెన్నివ్రేళ్ళఁ జూపినను, నందొక్క వ్రేలని దగ్గించిన ధరకు భైరవి బేరము చేయుచుండును. ఇట్లనుదినము భైరవి గృహోపయోగమునకు వలయు వస్తుసామగ్రి సమకూర్చి, యామూట నింటికిఁ జేర్చుటకు, కాంచనుని కొప్పగించును. ఆనాఁడు గంగాధరుఁడు బంధవిముక్తుఁడైన సుదినమగుటచే, విందునకుఁ గొంచె మెక్కువ సామగ్రి కావలసి యుండెను.

భర్త యొడియందు నిశ్చేష్టురాలై యొరిగి యుండిన కమల యులికిపడి లేచి, 'ఆచప్పుడేమి' తిరిగివచ్చిరో! యని గద్గద స్వరము ననియెను. భగవత్పాదుఁడు "అమ్మా, యేమది? భయపడకు? మని కమల నూరడించెను. 'బాబా! ద్వారము వద్ద నడుగుల చప్పుడైనది. మరల బట్టుకొని పోవచ్చిరేమో!' యని కమల విలపింపఁ దొడంగెను. భగవత్పాదుఁడు ద్వారము దెఱచి, చూచి, బయట నెవ్వరిఁగానక, మరల దలుపును యథాప్రకారము మూసివచ్చి, అమ్మా, యెవరును లేరు. నీ విభ్రాంతియే యిట్టి యనర్థమును స్ఫురింపఁ జేయుచున్నది. ధైర్యముఁ బూను' మనియెను.

'బాబా! ఈ దేశమును విడిచిపోకున్న నా ప్రియ

భర్త కేవేళ నేకీడు రానున్నదో యెఱుఁగము. శీఘ్రముగ ప్రయాణ సన్నాహముఁ జేయుట శ్రేయస్కరము. '

'అమ్మా' ఆఁడువారి కిట్టి భయము లుండుట సహజము. కాని నాయండనున్న గంగాధరున కీదేశమున నెట్టి విపత్తును రానీయను. నమ్ముము. నా మాటయన్నఁ బ్రజల కెట్టి గౌరవమో, ప్రజాసభయందు నీకు విశదమయ్యెనుగదా?

ఇంతలో నా ద్వారముపై నెవరో కరాఘాతముజేసి, 'తెరువు'డని యఱచినట్లు వారికి వినఁబడెను. కమల 'అదిగో తిరిగి వారే! యని యఱచి నిశ్చేష్టయై, గంగాధరుని యొడిలోఁ బడి మూర్ఛనొందెను.

తలుపు దీయఁగనే, యెఱ్ఱని టోపులను ధరించిన నలుగురు సైనికులా గృహమున బ్రవేశించిరి. వారిలో నొకఁడు 'గంగాధరుఁ డనియెడి రాణా గంగాప్రసాదు తిరిగి చెఱసాలకుఁ బట్టి తెండని మా కాజ్ఞయైనది 'యని తెలిపెను.

గంగాధరుఁడు 'నన్ను మరల ఖైదుచేయు టెందులకో తెలిపెదరా? 'యని కోరెను.

'రేపు విచారణకాలమున నంతయు నెఱుఁగఁగలవు. అనంతపద నివాసులు కొందఱు మీపై నేరమును మోపియున్నారు?

భగవత్ప్రాదుఁడు "ఒక్కమాట ఈ నేరమును మోపినఁ వారెవరో నీకుఁ దెలియునా?'

'అదిమేము బహిరంగ పఱుపఁగూడదు. అయినను, జెప్పెదను, దీనికిఁ గారకులు వినాయకగ్రామణి, ఆతనిభార్యయు నింకొకరు ?

భగవత్పాదుఁడు: ఎవరా మూఁడవవారు ?'

'భగవత్పాదభిక్షువర్యా ! ఎవరని మీ రడుగవలెనా?' యని యా సైనికుఁడు మీరను మాటపై నూదిపల్కెను.

"అవును చెప్పుము"

"అటులైన తేపు విచారణకాలమందు సర్వమును దెలియఁగలదు. నేనిపుడేమియుఁ జెప్పను."

ఆ సైనికులు గంగాధరుని వెంటఁ దోడ్కొనిపోయిరి.



౨౫వ ప్రకరణము.

# రఘుపతి వృత్తాంతము.

విక్రమ పురమున నొక యంగడియందు రఘుపతి వాసవు లిట్లు రహస్యముగ మాటలాడుకొను చుండిరి.

రఘు:— జాగ్రత్తగ సంచరించు చుంటివిగదా! ఏమాత్రము బయటఁబడినను, దల తెగిపోవును!

వాస:— భయమేమియు లేదు. మనలను గుఱుతింపఁగలవారు లేరు. కాని గంగాధరుని విడచిరఁటగదా. ఆతఁడెచ్చట నైన మనలఁజూచిన పట్టువడుదుమేమో!

రఘు:— నీకాభయము వలదు. ఆతని మరలఁ జెఱసాలలో నుంచుట కిపుడే యాజ్ఞయైనది. వానికొఱకు సైనికులఁ బంపి వచ్చుచున్నాను. ఈసరికాతని జెఱసాలలోఁ జేర్చి యుందురు. ఈపర్యాయ మాతని నెవ్వరును దప్పింప లేరు.

ఇంట సంభవించిన నూతనోపద్రవము నెఱుఁగక వస్తు చయమును సమకూర్చుకొనుచున్న భైరవీ కాంచను లాసమ యమున నాయంగడిలోఁ బ్రవేశించిరి. భైరవి రఘుపతిని జూడఁగనే,

'అన్నా! కిష్టప్పా! ఎన్నాళ్ళ కగపడితివిరా!, యని

యూతని కౌఁగలించుకొని యేడువసాగెను. కాని రఘుపతి, సోదరీ సందర్శనమున సంతసించినట్లు లేదు. వాఁడు 'అఱవకుము అఱవకుము. నా ప్రాణములఁ దీయకుము' అని రహస్యముగఁ జెప్పుచు, జేతులతో నామె నోరుమూసి 'ఈయంగడిలో నేమి కావలెనో కొనుము. బయటకుఁబోయి యంతయు మాటాడు కొందమని చెలియలిని తొందర వెట్టెను. భైరవి యేడ్చుచునే వస్తువుల గొని, కాంచనుని నెత్తిపైఁ దట్టలోనుంచి, యన్నతోఁ గూడి పోవుచుండెను.

భైర:—'అన్నా. ఎంత దయలేనివాఁడవు ! నీవడిగిన యేఁబది రూపాయు లీయ లేదనియే కదా, నామీఁద నింతకోపము ? నేను డబ్బు మూటకట్టుకొని యున్నానా ? నీవు పెండ్లి చేసి కొనవలెనన్న నూఱురూపాయ లీయలేదా ? ' వారు రాజవీధిలోనుండి సందులోనికిఁ దిరిగిరి.

రఘు:—'పోనిమ్ము. చెల్లెలా! ఈ విషయములన్నియు మాట లాడుటకు. నాకు సావకాశము లేదు. నిన్ను తేపువచ్చి కలిసి కొందును. నీతో మాటలాడుచు గూర్చున్న నాయుద్యోగ మూడిపోవును. నీవు నన్ను జంపునట్లున్నావు'

భైర:—అన్నా నేనంతపనిచేయుదునా? నీవన్న నా కెంత ప్రేమ? మనతల్లికడుపున బుట్టినవారిలో నీ వేగొప్పయుద్యోగము చేయఁగలవాఁడవని నేను జిన్నపుడే యనుకొంటిని. నీ యుద్యోగ మేమి? కాంచనుఁడింతవర కేమియు మాటలాడక,

రఘుపతిని బరిశీలనతోఁ జూచుచు, నడచివచ్చుచుండెను. తుదకువాఁడు రఘుపతి భుజముపైఁ జేయినుంచి, నిలిపి

'అయిననాకొక యనుమానము కలిగినది. నిన్ను భైరవి కిష్టప్పాఅని పిలుచునుగదా. అక్కడ ధవళగిరిలో నీపేరిదికాదు ఇంకొకటియని జ్ఞాపకము. అదేమో జ్ఞాపకము లేదు. రఘు - రఘు-రఘు...... ...' అని యనుచుండెను.

"పతి"యనుచు నెవరో వెనుకనుండి తటాలున వచ్చి వారిని గలిసికొనియెను. ఇతఁడు ప్రభాకరుఁడే. రఘుపతి గుండె లవిసిపోయెను. భైరవి యీ యాగంతుకుని జూడఁగనే యాశ్చర్య చకితయయ్యెను. అంత, ప్రభాకరుఁ డిట్లనెను.

"భైరవీ, నే నీదేశమున కెపుడు వచ్చితినా యని యాశ్చర్య పడుచున్నావేమో. నేను నిన్నటి సాయంతనమే వచ్చితిని. కాని యీ విషయ మింటివద్ద నెవ్వరితోను జెప్ప వద్దు. నీ యన్న విషయమై నాకంతయుఁ దెలిసిపోయినది. అంగడిలో నాతని సంభాషణ యంతయు వినుచునే యుంటిని. అతని యుద్యోగ మెచ్చటనో నాకుఁ దెలియును. వీఁడు కారా గృహముల కధికారి. మీయింటికిఁ బొండు. ఇతనితో నేను రహ స్యముగఁ గొంత యాలోచింపవలసి యున్నది. రఘుపతీ! నాతోరమ్ము తిరిగి విక్రయము నింటికిఁ బోవుదము. కాంచనా! నీవు గూడ భైరవినింట దింపి శీఘ్రముగ నీ యజమానుని కార్య స్థానమునకు రమ్ము."

రఘుపతి వేఱు మాటాడలేదు. తన గుట్టంతయు ప్రభాకరునకుఁ దెలిసిపోయెనని యాతఁడు గ్రహించెను. చెలియని యింటికిఁబొమ్మని ప్రభాకరునితోఁ బోవ నిరాఁకరించిన నేమి హాని రాఁగలదో యని శంకించి, వాఁడాతని వెంటనంటి పోయెను.

కార్యస్థానమునఁ గూర్చుండియుండిన త్రివిక్రముఁడు, గంగాధరుఁడు మరల నిర్బంధమున నుంపఁబడెనని యెఱుఁగఁడు. ప్రభాకరుఁడు రఘుపతిని వెంటనిడుకొని యతని కడకేఁగి, ఆర్యా, నేనొక పూర్వస్నేహితుని మీ కతిథిఁగాఁ దోడ్కొని వచ్చితిని. చూచితిరా' యనియెను.

త్రివి:—ఓహో ఎచ్చటనో చూచిన జ్ఞాపకము కలదుగాని, పేరు మఱచితిని.

ప్రభా:—పేరా ? అక్కసెల్లెండ్రు 'కిష్టప్ప' యాందురు గాని మనము రఘుపతి యాందుము.

త్రివి:—అవునవును. ధవళగిరిలో గంగాధరునిపై రాజద్రోహపు నేరమారోపించిన దితఁడేకదా ! ఇతనికి మనతో నేమిపని ?

ప్రభా:—ఇతనికి మనతో నేమియుఁ బనిలేదు. కాని నాకే యీతనితోఁ గొంచెము పని గలిగి తోడ్కొని వచ్చితిని. గంగాధరుని మరలఁ జెఱసాలలో నుంచిరఁట మీకుఁ దెలియునా ?

త్రివి:—మరలనా? ఎందులకు ? నీవాతని జెఱసాలలోఁ జూచి వచ్చితివా ?

ప్రభా:—లేదు, కాని మన రఘుపతి యనుచుండఁగా వింటిని. ఇది యబద్ధము కాఁజాలదు. రఘుపతీ ఏమందువు ?

రఘు:—ఈ రహస్యములను బహిరంగ పఱచుట మా యుద్యోగ ధర్మమునకు విరుద్ధము అయినను, చిరపరిచితులగు మీా రడిగితిరి గాన జెప్పుచున్నాను. ప్రభాకరుఁ డనినది సత్యమే.

ప్రభా:—నీ రహస్యములను బహిరంగ పఱపకుండుట నాకు ధర్మ విరుద్ధముగాఁ దోఁచుచున్నది. త్రివిక్రమా ! ఈ పర్యా యము భగవత్ప్రాదుఁ డల్లుని విడిపింపఁజాలఁడు. రఘుపతీ ఏమందువు ?

రఘు:—నిశ్చయమే. గంగాధరుని జంపక విడువగూడదని గ్రామ ణియు నాతని భార్యయుఁ బట్టుపట్టి యున్నవారు. భగవ త్ప్రాదుని ప్రయత్నము లన్నియు నిష్ఫలములు కాఁగలవు.

ప్రభా:—గంగాధరు నెట్లైన రక్షింపఁ దలఁచిన మనమిఁక నప్రమత్తులమై సంచరింప వలెను.

త్రివిక్రముఁడు విచార నిమగ్నుఁడై చింతించు చుండెను.

ప్రభా:—రఘుపతీ, నీ రహస్యము లన్నియు నాకుఁ దెలిసి పోయినవి. నేను చెప్పినట్లు చేయకున్న నీ ప్రాణములు దక్కవు. కారణములఁ జెప్పుమందువా? మొదటిది నీసోదరి

నిన్ను 'కిష్టప్ప'యని పిలుచుచున్నది. నీపేరు రఘుపతియని మేమందఱ మెఱుఁగుదుము. నీవు పేరు మార్చికొన్న వాఁడవని బహిరంగ పఱచిన నీ గతి యేమగునో యాలోచించు కొంటివా?

రఘుపతి మెదలక, కూరుచుండెను.

ప్రభా:— రెండవది ధవళగిరి రాజ్యమునకును, నీ రాజ్యమునకును బరస్పర విరోధము గదా! నీవు ధవళగిరియందు గొన్నాళ్ళుద్యోగివై సేవఁజేసి యుంటివని నిరూపించిన, నీదేశమున నిన్నెట్లు హింసింతురో యూహించుకొంటివా?

మూఁడవది చాల హానికరమైనది విషయము. నీ దేశమున నిదివఱకు ప్రభు పక్షమున గూఢచారివై యుంటివఁట. ప్రభువును, దనుచరులను బట్టి చంపిన ప్రజలీ సమాచార మెఱిఁగిన నిన్నేమి చేయుదురో యెఱుఁగుదువా?

భద్రావతి జాబితాల యందుఁ దనపేరు చేరియుండుటయు, నారహస్యము బయల్పడిన ప్రాణములు దక్కుట దుర్లభమనియు, రఘుపతి యెఱుఁగక పోలేదు. మనమున భయము తోఁచినను, వాఁడు బింకము వదలఁ దలఁపలేదు.

రఘు:— నన్నిందులకు నిరర్థకముగా భయపెట్టెదరు? నేను బెదరెడివాఁడను గాను. నాకు సహాయముఁ జేయఁగల మిత్రు లనేకు లీదేశమునఁ గలరు.

ప్రభా:— మిత్రులా! ఆ యంగడియందు నీతో సంభాషించుచుండిన మిత్రుఁడెవరు? ఎచ్చటనో చూచితిని! ఆ! అవును— వాఁడు వాసవుఁడే. ధవళగిరియందు నీ యనుచరుఁడే. చిక్కితివి. ఇది నాల్గవది.

రఘు:— ప్రభాకరా! మీరు పొరబడుచున్నారు. వాసవుఁడు పాపము, ధవళగిరిలోనే మరణించెను. అతని శవమును సమాధి యొనర్చినపు డనేకులు చూచియున్నారు.

ఈ మాట లనుచుండఁగనే సేవకుఁడగు కాంచనుఁడు తటాలున రఘుపతిపై నుఱికి, గొంతుఁ బట్టుకొని—

'అబద్ధము. మెడపిసికి చంపుదును. అబద్ధమాడిన నా గోతిలో తాలు రప్పలేకాని వాసవుఁ లేఁడు.' అని యఱచెను.

త్రివిక్రముఁడు భృత్యుని విపరీత ప్రవర్తనముఁగని వెఱఁగందుచు, 'కాంచనా! ఏమిది, విడువుము. పిచ్చి యెక్కినదా యేమి?' యని యాజ్ఞాపించెను.

కాంచ:— కాదు బాబూ, ఆనాఁడు మన యింటిముందు కూర్చుండియుండఁగా వాసవుని శవమును పెద్దపెట్టెలోఁ బెట్టి యూరేగించి తీసికొని వెళ్ళినారు. మా కనుమానము తోచినది. రాత్రి రెండవజాము వేళ, నందఱు నిద్రబోవుచుండఁగా శవమును బాతిపెట్టిన గొయ్యి తవ్వి చూచితిమి. అందులో వాసవుఁడు లేఁడన్న నమ్ముఁడు బాబూ. తాలు

రప్పలు నున్నవి. వీఁడుచెప్పిన దబద్ధము. తిరిగి యింకొక మాటు ఆ మాటే అంటే, వీనిగొంతుక నలుపుదును.

రఘుపతి బదులు చెప్పలేదు. ప్రభాకరుఁడు, మంద హాస మొనర్చెను.

ప్రభా:—సరే. నాల్గవది వాసవుని వృత్తాంతము. నీ బింకముల నా కడ సాగవు. ఈ నాల్గును నాతుపాకిలోని గుండ్లు. ఏమి! తుపాకిని బేల్చుమందువా? నేను దయా దాక్షిణ్యములు లేనివాఁడను. గంగాధరునికంటెఁ నీవు యమపురి కేగెదవు.'

రఘుపతి తప్పించుకొనుటకుఁ ద్రోవ యగపడలేదు.

రఘు:—సరే! మీకు నాతోనున్నపని యెట్టిదో తెలుపుఁడు.'

ప్రభా:—చేసెదవా?

రఘు:—నాకు సాధ్యమయినఁ జేసెదను.

ప్రభా:— నీ ప్రాణములపైఁ దీపియున్న నేఁ జెప్పినట్లు చేయుము. నీవు జాగరూకుఁడవై మెలఁగిన నీ కెట్టి యపాయమును రాదు. చెప్పెదను. ఈ ప్రక్కకురమ్ము.'

వా రిరువురు నా ప్రక్కగదిలోనికిఁ బోయి యొకయఱ గంటలోఁ తిరివిక్రముని జేరవచ్చిరి.

ప్రభా:— నీ వీ పని నతి జాగరూకతతో జరుపవలెను. పొర పడిన నీ ప్రాణమే కాక యనేకుల ప్రాణములు దక్కవు. బాగుగ నాలోచించికొనుము. రేపటి యుదయమునఁ గాళీ

దుర్గమువద్ద నిన్ను గలిసికొందును. అప్రమత్తుఁడవై కార్య సాధన మొనర్పుము. నీ రహస్యముల బయలుపఱుపనని యభయమిచ్చితిని. నన్ను నమ్ముము. పొమ్ము."

రఘు:—మీ రొసంగిన యభయమును మఱవకున్న యెడల నే కార్యసాధన మొనర్తును.

రఘుపతి యిఁక నచట నిలువలేదు.

త్రివిక్రమునకు విక్రమ పురమునందలి పని పూర్తి యయ్యెను. ఆతఁడు ధవళగిరికిఁ బో సన్నద్ధుఁడై యుండెను. ప్రభాకరుఁ డాతని కిట్లుద్బోధించెను. తేపే" భగవత్పాదుఁడును కమలయుఁ బుత్రికయు, నీ పురినుండి బయలుదేఱుటకు సన్నాహపఱుపుము. తగిన యనుమతి పత్రముల సంపాదింపుము. మన మిచ్చటనుండి కార్యసాధన మొనర్పఁజాలము. ఈ దేశము విడిచిపోవుటయే మన ముఖ్యకర్తవ్యము. అట్లు చేయకున్న మన ప్రాణములు గూడ దక్కవు. మీరు సర్వప్రయత్నములఁ జేసికొని యుండుఁడు!" సెలవొసఁగెను. ఈప్రయాస మంతయు నాపె కొఱకు!'

ప్రభాకరుఁ డిఁక నా గృహమం దొక క్షణమేనియు నిలువలేదు. ఆతఁడు వీధిలోనికిఁ బరుగెత్తుకొని పోవునపు డాతని నేత్రము లశ్రుజలపూరితములై యున్నవేల ?

---

ఏడవ ప్రకరణము.

# పునర్విచారణ

న్యాయాన్యాయవిచక్షణ నెఱుంగని ప్రజాసభ నిరంత రాయముగ విచారణలను సలుపుచుండెను. గత దినముననే వారు గంగాధరుని విచారించి, నిరపరాధినిగా నిర్ధారణ యొనర్చియుండిరి. నేఁడు మరల వారి కట్టెదుట నా గంగా ధరుఁడే నిరంకుశ ప్రతాపముచే జనులఁ బీడించిన రాణా వంశీయుఁడను, మహాదోషమునకు విచారింపఁ బడవలసి యుండెను. ఈ నిందితునిపై నేరమారోపణ మొనరించిన దెవ రని న్యాయాధిపులు ప్రశ్నించిరి. అంతట నీ ముగ్గురు పేరు లును బహిరంగముగఁ జదువఁ బడినవి.

వినాయకగ్రామణి, సారాదుకాణదారు, అనంతపదము,

భద్రావతి, ఆతనిభార్య.

శంకరభగవత్పాదుఁడు, వైద్యుఁడు.

భగవత్పాదుఁడు తానుగూడ దోషారోపకుఁడై యుండె నని విని యాశ్చర్యచకితుఁ డయ్యెను. ఆతఁడు వెలవెలఁ బారెడు మోముతోఁ, 'అయ్యా! యిది యన్యాయము, మోసము. ఈ నిందితుఁడు నా యనుంగుకూఁతురు మగఁడు.

నా కూఁతు రన్నను, నాపెక్కుఁ బ్రియులన్నను, నా ప్రాణముల కంటె నెక్కువగఁ జూచుకొనుచుందును' అని న్యాయాధిపతు లకు విన్నవించుకొనెను.

ఇట్టి వచనములు గత దినమున సభికుల నుత్సాహ పూరితుఁ జేసి యుండినవి. నేఁడు వానికట్టి శక్తిలేదు. సభా ధ్యక్షుఁడగు న్యాయాధిపతి వానికి సమాధానముగ నిట్లు మందలించెను.

'భగవత్పాదా! నీవు మా యాజ్ఞలకు లోఁబడి మెలం గని యెడల నది నేరమగును. నీవు పుత్రిక నీ ప్రాణములకంటె నెక్కుడగు చుంటివే! నీవు దేశాభ్యు దయముఁగోరెడి దేశ భక్తుఁడవే యగునెడల, దేశ స్వాతంత్రమే నీ ప్రాణములకంటె నధిక తరమైనదిగ భావింపవలయును!'

ఈ మాటలను వినఁగనే సభికులెల్లరు నుత్సాహ వంతులై "మంచి సమాధానము, మంచి సమాధాన"మని బొబ్బలిడిరి. న్యాయాధిపతియుఁ బెల్లుబ్బిన స్వాభిమానముతో నింకను నిట్లు మందలింప సాగెను. 'భగవత్పాదా! దేశ క్షేమముకొఱకు నీ ప్రియపుత్రిక ప్రాణముల నర్పించుటకు నైన వెనుదీయరాదు. ఏమి జరుగఁగలదో సావధానముగ వినుము. అల్లరి చేయకుము.'

సభికులు మరల సంతోష పరవశులైరి. ఇట్లు విప రీతముగ నిరసింపఁబడుటఁ జూచి భగవత్పాదుని నోరాడలేదు.

ఈనాఁడాతని సభా సమ్మోహన మంత్రము నిరర్థక మైనది. అతఁడు నిలువుసీరై, నిజాసనమునఁ గూలఁబడియెను.

సభయందు శాంతి నెలకొని నంతనే, గ్రామణిని న్యాయాధిపతుల సమక్షమునకుఁ బిలిచిరి. అతఁడు బాల్యమున భగవత్పాదుని సేవకుఁడై యుండుటయు, నా వైద్యుని కారాగృహ ప్రవేశ వృత్తాంతమును, పిమ్మట బోల్నాడు దుర్గములోనుండి విడుదల యగుటయు, నా సమయమున నాతని స్థితియుఁ ద్వరితగతిని వర్ణించెను.

న్యాయా:— 'నీవు బోల్నాడు ముట్టడిలోఁ జాల గష్టపడితివి కాదా?'

గ్రామ:— 'చిత్తము'

ఆ జనసమూహములో నుండి క్రోధి మహావేశమున 'నేను నిజము చెప్పుచున్నాను! ఆనాఁడు నీవు చాల గష్టపడితివి! ఆ కోటలో మొట్టమొదటఁ బ్రవేశించిన వాఁడవు నీవే! నిజము!' అని యఱచెను.

న్యాయా:—నీ వా నాఁడు బోల్నాడు దుర్గములో నేమి చేసితివో చెప్పుము.

గ్రామ:— నా యజమాని 'నూట ఐదు, ఉత్తరపంక్తి' యందుండి యుండెనని నే నెఱుఁగుదును. నాకీసంగతి యాతఁడే చెప్పియుండెను.

అతఁడు నావద్ద నున్నపుడు, 'నీపేరే' మని యడిగి నపుడెల్ల 'నూటయిదు, ఉత్తరపంక్తి' యనియే చెప్పుకొను వాఁడు. ఆనాఁడు తుపాకిఁ బట్టినప్పుడే యాగది యెచ్చట నున్నదో చూచి, దాని బరిశీలించి రావలెనని యనుకొంటిని. బోల్నాడుదుర్గము మావశమయ్యెను. కారాగృహాధికారిని వెంటఁబెట్టుకొని, యొక మిత్రుఁడును, నేనును, ఉత్తరపంక్తి లోని నూటయైదవ గదిలోని కేగితిమి. అందు గోడలోనున్న గూండునందొక ఱాతి నూడఁ బెఱికితిని. అంతనొక చిన్న సొరంగ మగపడినది. అందులో నేమున్నదో యని జాగ్రత్తగ వెదకితిని. ఈ పత్రి మగపడినది. ఇంకేమియు నా గదియందు దొరకలేదు. ఈ పత్రిమందలి దస్తూరి భగవత్ప్రాదునిదే. ఆతనిచే వ్రాయఁబడిన పత్రములఁ గొన్నిటిని పత్రికతోఁ బోల్చి చూడఁగా నిది యాతని స్వహస్తముతో లిఖింపఁబడినదని నిస్సందేహముగా ధ్రువపడినది?

న్యాయా! — అ పత్రము (జదివింపుఁడు. విందము.)

పరిశాంతమగు నా సభయందా పత్రమందలి లిఖితాక్షరముల నిట్లు చదివిరి.



ఎనిమిదవ ప్రకరణము.

# స్వకీయ చరిత్రము.

నా పేరు శంకర భగవత్పాదుఁడు. భవానీపురమునా స్వస్థానము. నేను విక్రమపురముననే నివసించుచు వైద్య వృత్తిచే జీవించుచుంటిని. సర్వజిత్సంవత్సర మార్గశిర మాసమున నా దీనచారిత్రమును వ్రాయుచున్నాను. చాల గష్టించి, యీ గోడయందొక రహస్య స్థలము నిర్మించియున్నాను. అందే యీ పత్రము దాఁపనెంచితిని. నా యాశలన్నియు నడుగంటి నవి. నాకు మతి భ్రంశము కలుగనున్నదను చిహ్నము లప్పుడపుడు పొడసూపుచు, భయము గలుగఁజేయుచున్నవి, కాని ప్రస్తుత సమయమున నా కెట్టి చిత్తభ్రమణమును లేదు. నా జ్ఞాపకశక్తి యోటువడి యుండలేదు. నా కసత్యముతోఁ బని లేదు.

ఈశ్వర సంవత్సర మార్గశిర మాసమున నొక వెన్నెల రేయి నే నిల్లు విడచి, నేనా నదీ సమీపమునకు విలాసార్థము పోవుచుంటిని. జోడుగుఱ్ఱముల బండి యొకటి మహావేగమున రాచబాటనే పరుగెత్తికొని వచ్చుచుండెను. నేను ప్రక్క కొత్తిగిలి యా శకటమును ముందునకుఁ బోనిచ్చితిని. ఇంతలో నెవరో యందుండి బయటకు దొంగిచూచి, వెంటనే బండి

నాపించెను. అతఁడే నన్ను బేరుపెట్టి బిగ్గరగఁ బిలిచెను. నేను సమాధానముఁ జెప్పితిని.

ఆ బండిలో నుండి యిరువురు పురుషులు క్రిందకు దిగునంతలో నేనును, వారితోఁ గలిసికొంటిని. వారు శకట ద్వారము దెఱచి, దాని చెంతనే వరుసగా నిలచియుండిరి. వారిర్వురు నా యీడువారై యుందురు. కాకున్నఁ గొంచెము పిన్న లేమో, వేషభాషలయందును, ముఖము పోండికయందును వారిరువురకు నెట్టి భేదమునున్నట్లు నా కగపడ లేదు.

'నీవే కదా భగవత్పాద భిషగ్వరుఁడవు ? అని యొకఁ డడిగెను.'

' నేనే '

' ఈ నడుమ నొకటి రెండు సంవత్సరములలో విక్రమ పురమున మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచిన భగవత్పాదుఁడవు నీవే కదా?' యని రెండవవాఁ డడిగెను.

'చిత్తము. నన్ను మిక్కిలి శ్లాఘింప వలదు. నేనే భగ వత్పాదుఁడను '

'మేము నీ గృహమునకుఁ బోయియున్నారము. మా దురదృష్టవశమున మీా రచట లేరు. ఈ దిక్కునకే వచ్చియుందు రని విని, మిమ్ముఁ గలుసుకొన వలెననెడి యూహతో నీ మార్గముననే వచ్చితిమి. దయచేసి యీ శకట మవరోహించె దరా ? ' యని మొదటివాఁ డనెను. ఆ యిరువురి పలుకులలో

నాజ్ఞాసూచకమగు నధికారస్వనము ప్రతిధ్వనించుచుండెను. వారిట్లనుచు, శకటద్వారమునకును వారికిని నడుమ నే నుండు నట్లుగాఁ బ్రక్కకుఁ దిరిగిరి. వారు సాయుధులై యుండిరి. నేను నిరాయుధుఁడను.

'అయ్యలారా, క్షమింపుఁడు, నా సహాయము నపేక్షింపవచ్చిన మహాత్ముల నామము లెవ్వియో, నేను జికిత్స నొనర్పవలసిన జాడ్యము యొక్క స్వభావమెట్టిదియో ముందుగనే తెలిసికొనుట నా కాచారము' అని నేనంటిని.

'భిషగ్వరా! నీయాశ్రితులుత్తమ వంశీయులు. జాడ్య స్వభావమును మేము తెలుపుటకంటె మీరే స్వయముగఁ బరిశోధింపుఁడు. తగుచికిత్స యొనర్పఁగల యనన్య శక్తిసామర్థ్యములు మీయందుఁ గలవనియే మానమ్మకము. చాలును. బండిలోనికి దయచేయుదురా ?'

వారి యిష్టప్రకారము ప్రవర్తించుట తప్ప వేఱే నేఁ మియు జేయలేకుంటిని. అందుచే బండిలోనెక్కి వేఱుమాటాడక కూర్చుంటిని. వారిరువురును నాతరువాత లోనఁబ్రవేశించిరి. బండి వెనుకకుఁ దిరిగి యథాగతిని బోవుచుండెను.

శకటము విక్రమపురివీథులఁ గడచి, పశ్చిమప్రాకార ద్వారముదాఁటి, గ్రామములగుండఁ బోవుచుండెను. అట్లు కొంతదూరమేగి, రాచబాటలోనుండి చీలిన యొక బాటకుఁ దిరిగి, యొక ప్రాసాదముకడ నిలచెను. ఆ చుట్టుపట్ల నెక్కడ

నిండ్లు లేవు. మేము మువ్వురము బండిదిగి, యా సౌధము ముంగలి తోఁటలోని కాలిబాటబడి, పోయి, గృహద్వారముఁ జేరితిమి. తలుపుపై కరాఘాతముఁ జేసినను, నైదునిమిషముల వఱకును నది తెఱవఁబడలేదు. తుదకా ద్వారము దెఱచిన సేవకుని ముఖముపై, నా వెంట వచ్చినవారిలో నొకఁడు, విసరిగుద్దెను.

ఈ విషయము నా కంత వింతగ నగపడలేదు. కుక్కలవలెఁ బాటకపు జనులు క్రూరముగ హింసింపఁబడుట నేను స్వయముగాఁ జూచియే యుంటిని. రెండవవానికిఁ గూడ నటులనే కోపము కల్గెను. ఆతఁడును సేవకుని ముఖముపై నీడ్చికొట్టెను. అపుఁడాయిరువురి ముఖవైఖరిని, గోపచిహ్నములను జూచి, వారు కవలసోదరులా యను ననుమానము కలిగినది,

మే మా ప్రాకారద్వారమును జేరినప్పటినుండియు, గృహాంతరము నుండి వెలువడు నార్తనాదములు నాకు వినఁబడుచునేయుండెను. మేము ముందునకుఁ బోయినకొలఁదిని వాని ధ్వని హెచ్చెను. నన్ను శీఘ్రముగ రోగికడకుఁ గొంపోయిరి.

ఆ రోగి రూపసియగు నొక యావని. ఆమె కిరువదేండ్లయిన నిండియుండవు. ఆమె కేశములు చిక్కువడియుండెను. హస్తములు కదలకుండఁ జిన్ని రుమాళ్ళతోఁ గట్టివేయఁబడి

యుండెను. ఆ కట్ల కుపయోగించిన గుడ్డలన్నియు నొక గొప్పవాని దుస్తులలోని పేలికలే యని గ్రహించితిని. వానిలో నొకదానిపై, మూలను 'రా' యను నక్షర మెట్ఱరంగుతోఁ జిత్రింపఁబడియుండెను.

ఆ రోగిని నెమ్మదిగ నొత్తిగిలఁ ద్రిప్పి, గుండెపైఁ జేతి నుంచి యూరార్పనెంచితిని. ఆపె నేత్రము లుబ్బి భీతికరములై యుండెను. విధివిరామము లేక, 'నాభర్త, నాతండ్రి, నాసోద రుఁడు' అనియాపె హృదయభేదకముగ నఱచి, పిమ్మట నొకటి మొదలు పండ్రెండింటివఱకును వరుసగా లెక్కించి, తుదకు 'ఉష్షు' అనుచుండెను. ఆపె యాక్రందనముల వరుస క్రమమున నెట్టి మార్పును గలుగుటలేదు.

'ఇది యెంతకాలమునుండి' యని నే నడిగితిని.

'గతరాత్రి యీ సమయమునుండియే' యని సమా ధానము వచ్చెను.

'ఈపెకుఁ బండ్రెండవ సంఖ్య మఱపునకు వచ్చుట లేదేమి ?' యని నే నడిగితిని.

'పండ్రెండవగంట' యని యా సోదరులలో నొకఁడు బదులుచెప్పెను.

నే నాపెకు మందుపోసి, యొక యఱగంటసేపా రోగి చెంతనే కూర్చుంటిని. ఆ సోదరులలో నొకఁడు

'ఇంకొక రోగి కలఁడు' అని నా కెఱిఁగించెను.

'ఆతని వ్యాధికూడఁ బ్రాణాపాయకరమైనదా' యంటిని.

'నీవే చూతువుగాక' యని యాతఁడు నిర్లక్ష్యముతోఁ జెప్పి, యొక దీపముఁ జేతఁబట్టుకొని, దక్షిణపార్శ్వమున నున్న యొక గదిలోనికి దారి దీసెను.

ఒక చక్కని కుఱ్ఱఁడు—పదునేడేండ్లు పైఁబడనివాడు-నేలను బఱచియున్న గడ్డిపైఁ బడియుండెను. ఆతని మెడక్రింద నొక గడ్డిదిండు కలదు. సుమారు ఇరువది, ఇరువదినాలుగు గంటల మధ్యమున కత్తిపోటువలనఁ గలిగిన గాఢమగు నొక గాయ మా బాలుని బాధించుచుండెను. వెంటనే చికిత్స యొనర్చిన, నది నిరపాయకర మయ్యెడిది. కాని, కాలయాపన మగుటచే, నాతఁ డవసానదశయం దుండెను.

"అయ్యో ! పాపమీ బాలుని గాయమునకుఁ గారణ మేమి? " యని నే నడిగితిని.

"పీఁడా ! బాలుఁడైనను శుద్ధమూర్ఖుఁడు. పశుప్రాయుఁడు. నాసోదరునిపైఁ గత్తిదూసి, సాహస మొనర్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్త మనుభవించు చున్నాఁడు" అని నిర్దయతో నాసోదరులలో నొకఁడనియెను. ఆ బాలుఁడు విశాలనేత్రముల నెమ్మదిగ నాతనిపైకిఁ ద్రిప్పెను. మరల నావంకకుఁ ద్రిప్పెను. అంత నాతడిట్లు ప్రసంగింప జొచ్చెను.

"బాబూ ! ఈ జమిందారు లున్నారే, వీరికి మహా గర్వము. కాని, వేళా వేళలందు, మాకును, బశుప్రాయుల

మైనను, గర్వముకలుగుచునే యుండును. వారు మా యా స్తిని దోచుకొందురు. మమ్మవమాన పఱతురు. దండింతురు. చంపివేయుదురు కాని మా కొక్కకప్పుడు కొంచెము గర్వము మిగులుచునే యుండును. మీరాయెరుజూచి వచ్చితిరిగదా?"

ఆమె యాక్రందనము లచ్చటకు నెమ్మదిగ వినిపించుచునే యుండెను.

'నే నామెను జూచితి' నంటిని.

"ఆమె నాయప్ప చాల మంచిది. ఒకచక్కని యావనుడామెను బెండ్లాడినాడు. వాడా నిలచియున్నాతని రైతు. అదిగో నిలువఁబడియున్నాఁడే యచట వాని రైతులమే మేమందఱమును. ఆ రెండవ వాఁడీతని సోదరుఁడు. అధమాధముఁడు."

ఆబాలుఁడతి కష్టముతో మాటాడుచుండెను.

"ఈమహా మహులు పశుప్రాయులగు జనులను గడు బాధించుచున్నారు. మా సొత్తులను దోచుకొని పోయినారు. దయయనునది లేక మాకుఁబన్నుల నంటఁగట్టినారు. జీత బత్తెము లీయక మాచేతఁ గూలిచేయించుకొన్నారు. వారి పాడి పశువులను మేఁతకై మాపొలములలోనికిఁ దోలినారు. మేము సాహసించి, మాసొంతపశులను బెంచుకొనేయెడలఁ గఠినముగ శిక్షించినారు. మేము తినుటకు మంచి శాక పాకాదులను, గష్టపడి సంపాదించు కొన్నపుడు, వారి యనుచరులుచూచి

వాని నెత్తుకొని పోవుదురేమో యను భయముచేతఁ దలుపుల నన్నిటిని బిగించికొని, యిండ్లలోఁగూర్చుండి, దొంగలవలె వాని భుజించుచుంటిమి. మాకష్టములకు మేరలేదు. తినుటకుఁ గూడులేదు. దుస్సహమైన యీ ప్రపంచములోనికి, శిశువులను దెచ్చుట మహాపాపమని మాతండ్రి చెప్పుచుండెడివాఁడు. ఆఁడువారందఱు గొడ్రాండ్లై మాదేశప్రజలందఱు నిహలోకమునఁ గష్టవిముక్తినంది, నశించిపోయిన బాగుండు నని దేవుని బ్రార్థించు చుంటిమి.

అయినను, మాయక్క పెండ్లి చేసితిమి. అప్పుడు మా బావకుఁ గొంచెమస్వస్థతగా నుండెను. నాయక్క యతని కుపచారములఁ జేయుచుండెను. అదుగో వాని తమ్ముఁడు, పెండ్లియైన రెండు మూఁడు వారములకు మా యక్కను జూచి మోహించెను. ఆమెను దన యింటికిఁ బంపుమని మా బావ నడిగెను - మాలో భర్తలేమిటికి ? ఆతఁడిష్టపడెనుగాని మా యక్క చాల మంచిది. నాకువలెనే యామెకును, వాఁడన్న నొడలు మండుచుండును. ఆపె నేలాగైన నొప్పింపవలెనని, వీరిద్దఱును నేమిచేసినారనఁగా,

ఇంత వఱకు నిశ్చలముగ నన్ను జూచుచు మాటాడుచున్న యా బాలుఁడిపుడాతని వంకకుఁ దిరిగెను. వారొకరి నొకరు చూచుకొనిరి. అది చూచుచుండిన నాకా బాలుని నుడువులు యథార్థములని తోఁచెను.

పశుప్రాయులమగు మాచేత బండ్లు లాగించుకొనుట ప్రభువుల కధికారమున్నది. ఇది మీకుఁ దెలిసియే యుండ వచ్చును. కావున మా బావకుఁ గాడి మెడపైనవేసి బండి లాగించిరి. రాత్రులందు దొరువులలోని కప్పలఱచి, యాప్రభువులకు నిద్రాభంగము చేయునేమోయని, వానిని శాంతపఱచు చుండుట మా విధియని మీకుఁ దెలిసియే యుండవచ్చును. రాత్రులందు, మంచులోఁ ద్రిప్పి, వానికిఁ బని చెప్పుచుండిరి. తిరిగి పగలందు బండ్లీడ్పించుచుండిరి కాని, మాతఁడు వంగలేదు. ఒకనాఁడు, తిండి తినుటకు - తినుటకేమియు లేకున్నను, నింట నున్న స్వల్పమైనను దినుటకుఁ బాండ్రెండు గంటల వేళ వదలి పెట్టిరి. అప్పుడు పండ్రెండు గంట దెబ్బలకుఁ బండ్రెండు సార్లు వెక్కి వెక్కి యేడ్చి, చివర కావె చేతులలోనే చని పోయినాఁడు.

తరువాత, నాయెదుట నిలచియున్న వీని నిష్టపఱచి, వీని సహాయము వలన, నితని సోదరుఁడు బలాత్కారముగ నామె నిచ్చటి కీడ్చుకొని వచ్చినాఁడు. నే నింటికిఁ బోవు చుండఁగా, త్రోవలో నాకు వారెదురు పడిరి. నేనది చూచి తిని. ఇంటికిఁ బరుగెత్తుకొనిపోయి, నాతండ్రి కీసమాచారము దెలుపఁగానే, యాయన గుండె బ్రద్దలైనది. ఆయన నోట మాటరాక మరణించెను. నాచిన్ని చెల్లెలును - నాకింకొక తోఁబుట్టు వున్నది - తీసికొనిపోయి, యాదుర్మార్గుల కందు

చాటులో లేని స్థలమునఁ జేర్చి వచ్చితిని. ఆమె యెన్నటికిని వీరి యధీనము లోనికి రాకుండఁ జేసితిని, అంతట వాని జాడను బట్టి యిచ్చటికి వచ్చితిని. నిన్నటిరాత్రి నేనీమేడపై కెక్కితిని-పశువునే కానిండు, చేతఁగత్తిఁబట్టితిని.'

నే నా గదియందుఁ గలయఁజూడఁగా, నచట వస్తువులును, నేలపై నున్న గడ్డియుఁ జిందరవందరగనుండి, పోరాటము జరిగి నట్లే యుండెను.

'మా యక్కకు నామాట వినఁబడఁగనే, లోనికిఁ బరుగెత్తుకొని పోయినది. వానిని జంపునంతవఱకు, నావద్దకు రావలదని యామెకుఁ జెప్పితిని. వాఁడు లోనికి వచ్చి, మొదట రెండుమూడు బంగారు కాసులను నా ముందునకు విసరివేసెను. నేను వాని నెత్తికొనలేదని కొరడాతో బలముగఁ గొట్టెను. కాని - పశుప్రాయుఁడనైన నప్పటికి - నా కత్తి పస చూపించితిని. వాఁడుకూడ గత్తి దూసెను. నారక్తముతోఁ దడిసిన కత్తి నెన్ని ముక్కలైనఁ జేసికొనిమ్ము. నాకేమి ? స్వప్రాణసంరక్షణకొఱకు ప్రభువు కత్తి దూయు నట్లుచేసితిని. నా కంతియే చాలును.'

నే నంతకుఁబూర్వమే యా గడ్డియందుఁ బడిన కత్తి తునుకలను జూచియుంటిని. ఆ విఱిగిన కత్తి యొక్క గొప్ప వానిది. ఇంకొకమూలఁ ద్రుప్పువట్టిన కత్తి యొకటి పడి యుండెను.

'ఏదీ నన్ను గొంచెము పైకి లేవఁదీయుము. ఏఁడీ? వాఁడేఁడీ?'

ఆ బాలుని లేవఁదీసి కూర్చుండఁబెట్టి 'ఆయన యిచట లేఁ' డని యంటిని.

'వాఁడా! వీరికింత గర్వమున్నను, నా యెదుటికి రా భయపడుచుందురు. ఇక్కడ నున్నవాఁడేడీ. నా ముఖము వాని వంకకుఁ ద్రిప్పఁడు!'

ఆ బాలుని శిరము నా మోకాలుపై నాన్చి నిలపి, యాతఁడు కోరినట్లు త్రిప్పితిని, ఆబాలుఁ డాతని బిగ్గరగాఁ దిట్టి, నేలపైఁబడి గతజీవుఁ డయ్యెను.

మేము తిరిగి ప్రథమరోగి శయ్యకడకుఁ జేరితిమి. ఆమె యథాప్రకార మామాటలనే, యదేరీతి నుచ్చరించుచుండెను. ఈ యవస్థ కొంతకాలమువఱకును మార్పుఁ జెందదనియు, చిట్టచివరకు మరణము నిశ్చయమనియు నే నెఱుఁగుదును.

నే నామెను మొట్టమొదట జూచిన పిదప నిరువది యాఱు గంటలు గడచిపోయెను. రెండు పర్యాయము లామెను జూచి పోయియుంటిని. నేను జెంతఁ గూర్చుండియుండఁగ నే యామె నిస్పృహఁ జెందుచున్నట్లగపడెను. ఆ సమయమునఁ జేయవలసిన చికిత్స వెంటనే జేసితిని. లాభము లేకుండెను. నెమ్మదిగా నామె స్మృతి తప్పి, మరణించిన దానివలె బడి యుండెను.

'చచ్చినవా ?' యని ప్రభు వడిగెను.

'ఇంకను చావలేదు. చావనున్నది' యని నేనంటిని.

నిర్దాక్షిణ్యముగ నాపైను జిత్రముగఁజూచుచు నాతఁడు, 'అబ్బా, తినఁ గూడు లేకున్నను, నీ శరీరములలో నెంత దార్ఢ్యముండును' అనియెను.

'దుఃఖభాజనులై యాశావివశులగువారికి దార్ఢ్య మెక్కువ' యని నేను సమాధానముఁ జెప్పితిని.

నా మాటను వినఁగనే యాతఁడు నవ్వెను. కాని వెంటనే యాతని ముఖమునఁ గోపచిహ్నము లగపడెను. చేరువనున్న కురిచీ నొకదానిని బాదముతో నాదగ్గఱకుఁ ద్రోసి యతఁడు హాస్యముగ నాతో నిట్లనియెను.

'భిషగ్వరా, ఈ పశువుల సంపర్కమువలనఁ జిక్కులఁ లోఁబడియున్న నా సోదరుని జూచి, మీ సహాయ మపే క్షింపఁ దగునని చెప్పియుంటిని. మీరు చాల ప్రసిద్ధి కెక్కిన వారు వయసునఁ జిన్నలగుటచే నింకను నున్నతస్థితికి రానున్న వారు. స్వక్షేమమునకు భంగ కరములగు పనులఁ జేయ కుందురు. మీరిటఁజూచిన విషయములన్నియుఁ జూచి మఱువ వలసినవే కాని యొరులకుఁ దెలుపఁదగినవి కావు'

'మహాప్రభూ, నా వైద్య సహాయముఁ బొందెడివారి రహస్యముల నభిమానముతో గౌరవించు చుందును' అని నేనంటిని. సమాధాన మిచ్చుటలో నేను బహు జాగరూకుఁ

డనై మెలఁగితిని. ఏలన, నేనానాఁడు కన్నదియు, విన్నదియు, నాహృదయ సంతాప కరములుగ నుండెను.

రెండు దినముల కామె గతించినది. వారు నాకు ధన మీయవచ్చిరి. గాని నిరాకరించితిని. నేనింటికిఁ బయనమై నపుడు, వారు నాకు నమస్కరించిరి. వేఱు మాటాడక నేనింటికిఁ బోతిని.

మఱునాఁడు ప్రాతఃకాలముననే, నేను నిరాకరించి యుండిన బంగారమును నాయింటికిఁ బంపిరి. నేనేమి చేయు దునాయని మిగుల విచారించితిని. ఈ జరిగిన విషయములఁ దెలుపుచు, రాజమంత్రికొక యుత్తర మాపవలెనని స్థిరపఱచు కొంటిని. వీరికి మహారాజుయొక్క యాస్థానమునఁ బలుకుబడి కలదనియు, వీరిపై నెట్టి తీవ్ర చర్యయు జరుపఁబడ దనియు నేనెఱుఁగక పోలేదు. అయినను, నా మనశ్శాంతి కొఱకట్లు చేయ నిశ్చయించితిని.

నేను మఱునాఁడాయుత్తరమును ముగింపనున్న సమ మున, రాణాప్రభుని భార్యయగు నొకయువతి నన్ను జూడ వచ్చి, నా గృహద్వారముకడ వేచియుండెనని వర్తమానము వచ్చెను. వెంటనే, యా గుడ్డపీలికపైనున్న 'రా' యను నక్ష రముతో నీపేరునకు సంబంధ మున్నట్లు గ్రహించితిని.

ఈ కూర్మిగ చారిత్రమందలి ముఖ్యాంశము లామె కెటులనో తెలిసినవి. ఆ బాలిక మరణించెనని యూపె యెఱు

గదు. మందభాగ్యయగు నా బాలికపైఁ కనికరము గలిగి, రహస్యముగ నామెకుఁ జేతనైన సహాయము చేయవలెనని, దయార్ద్ర హృదయురాలగు నా యువతీమణి కుతూహల పడుచుండెను. వారి చిన్న చెల్లెలొకతె జీవించి యుండెనని యామెకుఁ దెలిసెను. ఆ పిల్లకైనఁ గొంత సాయముఁ జేయుటకై యామె పేరును, నివాసస్థానమును నేనెఱుఁగుదు నేమో యనుకొనెను గాని నాకేమియుఁ దెలియదు.

ఆమె దయా దాక్షిణ్యములు గల యువతి. కాని పాపము సౌఖ్య మెట్టిదో యెఱుఁగదు. మహా భోగియగు జమిందారుని భార్యయైనను, నామెకుఁ జిత్తశాంతి లేదు. మఱఁది కామెపై నపోహము, నసూయయు నయ్యెను. అన్నదమ్ములన్న నామెకు మహాభయము. ఇఁక సౌఖ్య మెక్కడిది? ఆమెను సాగనంపుటకు నేను వీధిలోనికిఁ బోయితిని. ఆమె బండియందొక బుడుతఁడు, రెండు మూఁడేండ్ల వయసువాఁ డాడుకొనుచుండెను.

ఆమె యేడ్చుచు, నా బాలునివంకకు వ్రేలుఁజూపుచు.

'భగవంతా! వాని క్షేమముకొఱకు - నేనేమైనఁ జేయుదును. ఆ బాలికజాడ లెప్పటికైనను దెలియవచ్చిన, నాయాస్తిని దానికిఁ జెందఁ జేయుటయే ముఖ్యకర్తవ్యముగా నా కుమారునకు విధింతును.'

ఆమె కుమారుని ముద్దాడి, బుజ్జగించుచు,

'నాయనా ఇదంతయు నీకొఱకే. గంగన్నా నేజెప్పినట్లు చేయుదువా?' యనియెను. ఆబాలుఁడును, ధైర్యముతో 'అవును!' యనెను. నేనుగూడ నాబాలకుని ముద్దాడితిని. ఆమె వాని నెత్తుకొని ముద్దాడుచు బండిలో నెక్కిపోయెను.

ఆమె మగనిపేరు నాకుఁ దెలిసియుండెననియే తలంచి యుండెను. అయిన నేనాయుత్తరమందా పేరు నుదాహరింప లేదు. ఆ కమ్మను నేనే స్వయముగాఁ దీసికొనిపోయి, మహా రాజాస్థానమున నాదజేసియుంటిని.

ఆ రాత్రి తొమ్మిదిగంటలవేళ నెవరో మా యింటి తలుపు దట్టెను. ఒక నూతనపురుషుఁడు, నాసేవకుఁడగు వినా యకగ్రామణివెంటఁ బడిలోనఁ బ్రవేశించి, నాయెదుటికి వచ్చి యిట్లనెను. 'ఉత్తరవీధియందొక రోగిని జూచుట కత్యవసరముగ రావలెను. మీ రెంతో సేపచట నుండ నక్కఱలేదు. బండి సిద్ధముగ నున్నది.' ఆ బాడియే నన్నిచటికిఁ జేర్చినది- యీ నా సమాధిలోనికిఁ జేర్చినది. నేనిల్లుదాఁటి వచ్చిన పిదప నెవరో వెనుకనుండి యొక గుడ్డను నామూతిపై బిగించి కట్టిరి. నా హస్తముల బంధించిరి. ఆ సోదరు లిరువురును, జీఁకటిగానున్న యొకమూలనుండి నాముందునకు వచ్చిరి. నే వ్రాసియుండిన యుత్తరమును రాణా తన జేబులోనుండి తీసి, నాకుఁజూపి, దానికి నిప్పంటించి, యామసిని గాలితోఁ ద్రొక్కి నలిపివేసెను.

వారొక్కమాటైన ననలేదు. అంత నన్నిచటికిఁ జేర్చిరి. జీవములతో నన్నీసమాధిలోనికిఁ జేర్చిరి.

వారును - వారి పుత్త్రపౌత్త్రాదులును, - వారి వంశీయులెల్లరును - నాశనము నొందవలెనని, శంకర భగవత్పాద నామాంకితుఁడ నగు నేను, దుర్భరమగు హృదయతాపమున శపించుచున్నాను. వారిహపరలోకములకు దక్కక నశింతురుగాక!

* * * *

ఈ పత్త్రిక చదువుట ముగియఁగనే, యా సభయందు భీకరారావము లుప్పతిల్లెను. విషాదజనకమగు నా చరిత్రను స్థిరచిత్తులగు సభికులకు హృదయావేశకరమగు మహోపన్యాసముగఁ బరిణమించెను.

భద్రావతి, యను చారిణియగు క్రోధితో,

'మంచి పలుకుబడి యున్నదికదా! ఆ ముసలి వైద్యునకు! అవును. భిషగ్వరా నీ యల్లుని రక్షించుకొనుము! చూచెదను'' అని యనుచుండెను.

ప్రజలెల్లరు నేకగ్రీవముగఁ దీర్మానించిరి. "జనులఁ బీడించిన రాణావంశీయుని మరల బందీకృతునిఁ జేయుఁడు. ఆతఁడు దేశద్రోహి కావున హంతవ్యుఁడు !"

---

తొమ్మిదవ ప్రకరణము.

# నూతనోపద్రవము.

---

ఆ సాయంతనమునఁ బ్రభాకరుఁడనంతపదమున వినాయక గ్రామణి సారాయంగడిఁ బ్రవేశించి, విక్రమపుర భాషతో విశేష పరిచయము లేనివానివలెఁ దొట్రుపాటుతో మాటాడుకొనుచు, నొక గ్లాను ద్రాక్షారస మిమ్మని కోరెను.

'మీది ధవళగిరియా?' యని భద్రావతి ప్రశ్నించెను. ఆ మాట యర్థ మెఱుంగని వానివలె నిటునటుఁ జూచుచు, మరలఁ దెప్పరిల్లి, 'అవు'నని ప్రభాకరుఁడు సమాధానముఁ జెప్పెను.

అంత నాతఁడొక యాసనముపైఁ గూర్చుండి, విక్రమపురవార్తాపత్రిక నొందుకైకొని, యాభాష నతికష్టముతోఁ జదువువానివలె నటించుచుండెను.

ఆ దుకాణమునఁ దృతీయ జంబుకుఁడును, క్రోధియు దప్ప నన్యులింకెవరును లేరు. ప్రభాకరుఁడు భాష తెలియని వాఁడని యూహించి వారు నిరాఘాటముగ సంభాషించుకొనుచుండిరి.

భద్ర:—సరిగా వాని పోలికయే

క్రోధి:—నిజము సరిగా వానిపోలికే, నిజము !

గ్రామ:— సరేకాని మన మెచ్చటనో యొకచోట నాగవలెను.

భద్ర:—ఆ వంశమును సంపూర్ణముగ నిర్మూలన మొనర్చిన పిదపనే యాగుట. అంతవఱకు నాగుట లేదు.

క్రోధియు, జంబుకుఁడును నందుల కొప్పుకొని తలయూచిరి.

గ్రామ:—ఆ ముసలి వైద్యుఁడు, చాలకష్టము లనుభవించెను. పుత్త్రిక దుఃఖమువలన నాతని గుండె పగిలిపోవును.

భద్రా:—ఈ పనియంతయు నీ యధీనమై యున్న యెడల వీనిని గూడ వదలిపెట్టి యుందువు. సందేహాము లేదు.

గ్రామ:—నేనా! అబద్ధము! కాని నే నింతటితో నాగిపోవుదును. ఇంతటితో నాగిపోవలెననియే నా వాదము.

భద్రా:—వినుఁడు! దుర్మార్గులును, ప్రజాపీడితులు నగు వాశీయు లెల్లరును జాలకాలము క్రిందటనే నా జాబితా యందుఁ జేర్చి, యీ వంశనాశనము చేయువలెనని నిర్ధారణ చేసియుంటిమి! ఈ మాట కేమందువు?

గ్రామ:—ఇది నిజమే

భద్ర:—బోల్నాడు పట్టువడిననాఁడు, భగవత్పాదుఁడు వ్రాసిన పత్రికను మేము చదివికొంటిమి, ఆ రాత్రియే నా రహస్యమంతయు నా భర్తకుఁ జెప్పియుంటిని. ఆ పత్రికయందు వ్రాయఁబడిన రీతిని రాజాలచే హింసింపఁబడిన కుటుంబము, నా కుటుంబమే. ఆ గాయముఁ బొందిన బాలుని

తోఁబుట్టువు నా తోఁబుట్టువే. ఆ మగఁడు నా యక్క మగఁడే. ఆ సోదరుఁడు నా సోదరుఁడే. ఆ తండ్రి నా తండ్రియే. ఈయన నకుగుఁడు! అంతియుకాదా?

గ్రామణి 'ఇది నిజమే' యని తలయూచెను.

భద్ర:—అటులైన, అగ్ని దేవుని, వాయుదేవుని నాపుము! కాని నన్నాపకుము!

భద్రావతి కోపసంభాషణము లా యిర్వు రనుచరులకు హృదయాహ్లాదజనకములుగ నుండెను. ఇరువురు నామెను మిగులఁ బ్రశంసించిరి. రాణాభార్యయొక్క దయాగుణమును మెచ్చుకొనుచు, గ్రామణి యేవియో రెండు మాటల నామెఁ బొగడెనుగాని, యవి, భద్రావతి తల కెక్కుటలేదు. 'అగ్ని దేవుని వాయుదేవుని నాపుము. నన్నాపకుము!' ఇదియే తంగో దరి సమాధానము

భద్ర:—ఆ దినమున మే మందఱ ముత్సవము చేయునపు డాతని భార్య మన కమ్మరి జంబుకుని యింటియెదుట నిలచి, చెఱసాలలో నున్నవారికి సైగలు చేయుచుండఁగా నేను స్వయముగఁ జూచితిని. మన కమ్మరి జంబుకుఁడు కూడ నందులకు సాక్ష్య మీయఁగలఁడు. అంతేకాక, వాని మరణమునకై వాని భార్య యేడ్చుచున్నను గదా! దేశద్రోహి మరణమునకై విలపించెడివారు కూడ దేశ ద్రోహులేకాదా! ఇవియే కారణములు. దాని ప్రాణ

ములు దాని బిడ్డప్రాణములు దక్కునేమో చూచెదం గాక !

క్రోధి "నీవు చెప్పినది నిజము! దాని ప్రాణములు దక్కవు!" అనుచుండెను.

ప్రభాకరుఁడు డబ్బుచెల్లించి, సారాదుకాణములోనుండి వెడలిపోయెను. రాణావంశ సంపూర్ణ నిర్మూలన మే పరమావధిగాఁగల భద్రావతి, కమలను, బిడ్డను జంపుటకుఁ గృతనిశ్చయురాలై యుండెనని యాతఁడు గ్రహించెను. అతఁడు వెంటనే త్రివిక్రముని దర్శింపనేగెను.

'త్రివిక్రమా! నేను వెఱ్ఱివాఁడనని నామాటలను నిరసనముతోఁ జూడకుము! నేఁజెప్పినట్లు చేసితివేని, యొకకుటుంబమును బ్రదికించినవాఁడ వగుదువు. విక్రమపురి దాఁటిపోవుటకు రహదారి పత్రములను - నీకొకటి, కమలా భగత్సాతులకును బిడ్డకును గలిపి యొకటి, 'ప్రభాకరుఁడు, న్యాయవాది, ధవళగిరి' యను నతని కింకొకటి, - యీ మూఁటిని నీ యధీనమునందే యుంచుకొనుము.

'నీవద్ద వలసిన ధనమున్నదికదా! శీఘ్రముగ సముద్రతీరముఁ జేరుట కేర్పాట్లన్నియుఁ జేసి యుంచుము. నీవు ధవళగిరికి దిరిగిపోవుటకుఁ జాల దినములనుండియు సన్నాహమొనర్చుచుంటివిగదా. తేపె పెందలకడనే బండి గుఱ్ఱముల నాయత్తపఱచి యుంపుము. రెండుగంటలకు నాకొఱ కెదురు చూచు

చుండుఁడు. నేను మీతోఁగలిసి కొనఁగనే, యేయాలస్యమును జేయక, వెంటనే బయలుదేఱి విక్రమపుర ప్రాకారద్వారమును గడచిపోవలెను. ఈ కష్టమంతయు - "ఆపెకొఱకు -" అని మఱవకుము' అని ప్రభాకరుఁడా ముదుసలి కుద్బోధించి యెచ టికో పోయెను.

---

పదవ ప్రకరణము.

# మందు

వెన్నెలరేయి. ప్రొద్దు గ్రుంకి యొక గడియసేపైనది. విక్రమపురాంతర్భాగములనుండి మింటి కెగసెడి హాహాకారవముల కొకింతుకయు బెదరక, సహజమందగమనంబున స్వేచ్ఛాద విహారిణియగు సేనావాహిని యపరదిక్కు ప్రవహించి పోవుచుండెను. పూర్వము నూతన దంపతుల విహారస్థలములై తనరిన నదీసైకత ప్రదేశములు, దేశమున విపరీత విప్లవము జనించిన దాదిగ, నిర్జనములై యుండెను. కాని నిర్భయుఁడగు ప్రభాకరుఁ డారాత్రి యొంటరిగ నొక యిసుక తిన్నెపై నిలచి, యంగరఖా జేబులందుఁ జేతుల నిడికొని, సుధాకరుని యందుఁగాంచఁబోలును దదేకధ్యానమునఁ బరిశీలించుచుండెను.

ఆతఁడేమి యాలోచించుకొనుచుండెనో మన మెఱుఁగము. కాని, యాతని కెట్టి చిత్తవైకల్యము నున్నట్లు చూపట్టదు. ఆతని మానసము డోలాయమానమై యున్నట్లుగూడ నగపడదు. సురుచిరమగు దృఢసంకల్పము హృదయపీఠిని సుస్థిరమై యానందదాయకమై యుండినట్లాతని ముఖలక్షణములఁ బరికించినవారు గ్రహింపక మానరు.

ప్రభాకరుఁ డెవరితోనైన నేకాంతమున ముచ్చటింపఁ గోరి, యానదీసైకతములు సంకేతస్థానముగ నేర్పఱచుకొని

యుండెనా? ఆతఁడెవరికొఱకు నెదురుచూచుచున్నట్లు లేదే! లేదు. ఆతఁడు నదీజలములఁ బడి యాత్మత్యాగ మొనరింపఁ దలఁచి వచ్చియుండెనా? కాదు. కాదు. ఆతనికీ యుద్దేశ్య మెన్నఁడును లేదు. నిరర్థకమగు నాత్మహత్య కంటె, సార్థకమగు స్వార్థత్యాగ మాతని దృక్పథమున నిలచియుండెనని మా చదువరు లచిరకాలములోనే యెఱుఁగ గలరు. ఆతఁ డచ్చటకు వచ్చినది కాలయాపన కొఱకు! ప్రభాకరున కూరియుం దేమియుఁ బనిలేదు. ఆతని పాదము లెచ్చటికిఁ డీడ్చిన నాతఁ డచటికిఁ బోవుచుండును. ఆతని మది యన్యథా యేకాగ్రమై యుండుటచే స్థలకాలాదుల నాతఁడు గమనింపఁ జాలఁడు. ఈ నదీప్రాంతముల కీడ్చికొనివచ్చిన వాతని పాదములు!

కాలచక్రము నిరభ్యంతరముగ దొరలిపోవునపుడు — సుధాకరబింబ మాకసము నధిరోహించునపుడు — సేనా నదీ జలములు పశ్చిమమునకుఁ బాఱిపోవునపుడు — విక్రమపురి క్రమక్రమముగ మాటుమణుఁగజొచ్చెను. దశమి చంద్రుఁ డూర్ధ్వబింబప్రదేశమున వెలుఁగుచుండెను. దూరమునఁ గోటలోనుండి తొమ్మిది గంటలు ఖంగు ఖంగు మని విన వచ్చెను. ప్రభాకరున కేమియో జ్ఞప్తికి వచ్చినది. ఆతఁడు శీఘ్రయానమున నదీసైకతములఁ గడచి, పురప్రవేశ మొనర్చి రాజవీథిలోనున్న యొక మందుల యంగడిలోనికిఁ బోయెను.

ఆ యంగడి యజమానుఁ డొక వృద్ధుఁడు. క్షయరోగ సంబంధులు ప్రమాకు లనేకము లాతని శరీరమునఁ జిలించియున్న వని, యాతని చూపులు చెప్పక చెప్పుచున్నవి. మసివారిన లాంతరు దీపము వెలుఁగున నాతఁడు లెక్కలను చూచుకొనుచుండెను. నేలపై దట్టమగు మట్టియుఁ, గాగితపు ముక్కలును, గాల్చి పాఱవేయఁబడిన చుట్టపీఁకెలును, నా దుకాణమునం దంతటఁ బడియుండెను. బీరువాల యద్దములకు దుమ్ముపట్టి యుండుటచే, వాని వెనుక నేమున్నదో చూడ వీలగుట లేదు. సాలీఁడు పుర్వు లందు యథేచ్ఛగ వలలను బన్నుచుండెననుట కనేక నిదర్శనము లచ్చటఁ గలవు. ప్రొద్దుపోవుటచే నిక దుకాణము మూసివేయవలెనను తలంపుతో నా ముసలి ముఖద్వారము దప్ప మిగిలిన ద్వారముల నన్నిటిని బంధించి యుండెను.

ప్రభాకరుఁ డా యంగడిలోఁ బ్రవేశించి, జేబులోనున్న యొక చిన్నచీటి నా వైద్యున కొసంగెను, ఆ వృద్ధుఁడు 'అబ్బా, మీ రింత ప్రొద్దుపోవువఱ కేమిచేయుచుంటిరి ? పెందలకడనే వచ్చిన, నా కిబ్బంది కలిగెడిది కాదుగదా. లెక్కల నన్నిటిని ముగించుకొన్నపిదప వచ్చి, మరలఁ బని యంతయు మొదటికిఁ దెచ్చుచున్నారు.' అని విసుగుకొనుచు, నా చీటీని జదువుకొని, యించుక భయవిహ్వల చిత్తుఁడై 'అయ్యా, ఇది యెవరికిఁ గావలయు' నని ప్రశ్నించెను.

'నాకే కావలయును. నేనే యడుగుచుంటినిగదా'

వైద్యుఁడా చీటీని వెనుకకుఁ ద్రిప్పిచూచి, యిటునటు పరికించి, యొకించుకసేపాలోచించి, 'ఇట్టి మత్తుమందులఁ గొనువారు దుర్వినియోగము చేయరని సకారణముగ మాయెదుట నిరూపించిననేకాని, వీని విక్రయించుట కనుజ్ఞలేదు' అనియెను.

'ఇదిగో' దీనిని మీరు దుర్వినియోగము చేయకుఁడు అని యనుచు ప్రభాకరుఁ డంగరఖా జేబులోనుండి యొక బంగారు కాసుఁదీసి యాతని చేతి యందుంచెను.

ఆ ముసలివాఁడు పల్లెత్తి పలుకాడలేదు. ఆనాఁ డంతయకాలము వఱకు వేచియున్నందులకుఁ గలిగిన ప్రతిఫల మాతని హృదయము నుప్పొంగఁ జేసెను. ఆతఁడు వెంటనే యొక సీసాలోని మందును జిన్నపొట్లము గట్టి, ప్రభాకరుని కిచ్చెను. ప్రభాకరుఁడు దాని నంగరఖా యందుఁ బదిల పఱచుకొని, పురవీధులంబడి తిరుగాడు చుండెను.

చంద్రుఁడు పశ్చిమాద్రిఁ జేరెను. ప్రభాకరుఁ డొక్క-సారి నిట్టూర్పు విడచి సుధాకరుని యొద్ద సెలవుఁ గైకొనియెను. భూ నభోంతరముల నంధకారము నిబిడీకృత మయ్యెను. తారకాగణము వినీలాకాశమున మిణుకు మిణుకుమని వెలుఁగు చుండెను. ప్రభాకరుని కీసృష్టి వైచిత్రము స్ఫురించుటయే లేదు. ఆతఁడు మెల్లగ నడుగుల నిడికొనుచు, భగవత్సా

దుఁడు కాపురముండు వీధిలోని కరిగెను. నాలుగైదు సారు లాతని యింటిముందునుండి పచారులు చేసెను. తుట్టతుదకు ఏశిలా సోపానములు కమల మృదుల పాదద్వయము దిన దినము స్పృశించు చున్నవో-ఆపె దీనాశ్రుధారల నింక కుండఁ బట్టి భాస్కరున కప్పగించు చున్నవో-ఆ సోపాన పరంపరయే, ఆతమస్సామ్రాజ్యమున మన ప్రభాకరున కొక్కించుక సేపు సింహాసన మయ్యెను. కైవల్యపదము లభ్యమైన ట్లాతఁడు సంతుష్టాంతరంగుఁ డయ్యెను.

కుక్కుటములు 'కోకో' యని కూసెను. ప్రభాకరుని యాగమనమునకుఁ బురజనులెల్లరు సంతసించుచుండ, మన ప్రభాకరుఁడు తటాలునఁ దన గద్దియపైనుండి లేచి యంధ కారమున నదృశ్యుఁ డయ్యెను.

---

పదునొకండవ ప్రకరణము.

# ప్రతిజ్ఞాపాలనము.

---

గంగాధరుఁ డంధకార బంధురమగు కారాగృహమునఁ గూర్చుండి చింతిల్లుచుండెను. ఆతని యాశలన్నియు నడుగంటి పోయినవి. బోల్నాడు మార్గమునఁ బసునెనిమిదేండ్లు నిర్బంధావాసము ననుభవించిన భగవత్స్వాముని శక్తి సామర్థ్యములు నిష్ఫలములైనవని గత దినముననే విశదమయ్యెను.

ఆపత్సమయములం దప్పుడు మిత్రులు కఠినాత్ములగు విక్రమపురీయులం దొక్కరు నగపడలేదు. సుకుమారయగు భార్యకును, గష్టపరంపరలచేఁ గృశించిన వృద్ధుఁడగు మామకును తన మరణము వలన గలుగు దుర్భరవిషాదముఁ దలఁచి మిగులఁ బరితపించెను. విశ్వాసకుని విడిపింపఁ గలిగితి నని యప్పుడప్పు డాతఁడు సంతసించుచుండెను. గాని యాతనికి స్వప్రాణములకంటె విశ్వాసకుని ప్రాణము లెక్కుడు తీపియా.

ఆనాఁడే మధ్యాహ్నము మూఁడుగంటల కాతని శిరచ్ఛేదన మొనరింపఁ బడును. ఆ సమయము చేరువకు వచ్చిన కొలఁది నాతని హృదయావేదన ముపశమింపఁ జొచ్చెను. బంధుగులకును, మిత్రులకు నంత్య సందేశముల రచింపనాతఁడు కలముఁ బట్టెఁగాని విచారావేగమున నతనికిఁ గాలుసేతు

లాడుటలేదు. కొంతవడి కాతఁడు మదిని దిటవఱచుకొని, కమలకును, భగవత్స్వామునకును, త్రివిక్రమునకును వేర్వేర నుత్తరముల వ్రాసెను.

"కమలా'

కారాగృహమున బందీకృతుఁడై, యచిరకాలములో నిహలోకమునుండి విడిచిపోనున్న నీ ప్రియుని యాశీస్సుల నందుకొనుము.

విశ్వాసపాత్రుఁడగు విశ్వాసకుని రక్షింప వలయునను మిమతో, గాలకర్మను నన్నీదేశమున కీడ్చుకొని వచ్చుటయు, నీ జనకుని ప్రయత్నములు నిరర్థకము లౌటయు, నీ వెఱిఁగియే యుంటివి. నీ జనకుఁడు దీర్ఘ కారాగార వాస మనుభవించి యుండెనని నీ వలననే మొట్టమొదట నానాఁడు మీరు ధవళగిరికి బ్రయాణము చేయుచున్నపుడు వినియుంటిని. ఆయన నిర్బంధమునకుఁ గారకులు నా తండ్రియు, నతని సోదరుఁడు నని నిన్న న్యాయస్థానమునఁ జదువఁబడిన పత్రిక వలననే నాకుఁ దెలియవచ్చినది గాని యింతకుఁ బూర్వము నాకీ విషయమే తెలియదు. కమలా! నీ తండ్రి నా నిజనామము నెవ్వరికిఁ దెలుపవలదని మన వివాహ దినమున నుదయమున నా కాజ్ఞాపించి యుండుటవలననే వానిని నీకుఁ దెలుప సాహసించితిఁగాను, ఇందులకు నాపైఁ గినియకుము.

మన మిద్దఱమును బరలోకమునఁ గలిసికొనఁగలము. కాని నీ జీవితకాలమునందు, నీ జనకుని కుపచారము లొన

ర్చుచు, నాతనికి సౌఖ్యదాయినినై ప్రవర్తింపుము. నీకు శుభం బగుఁగాక! నాకిఁక సెలవొసంగుము. మన చిన్ని బిడ్డ విమలకు నా ముద్దు.

ప్రియుఁడు,
గంగాధరుఁడు.

భగవత్ప్రానునికి వ్రాసిన కమ్మయందాతనికి వందన మాచరించి, యధైర్య పడవలనదనియు, శక్తిసామర్థ్యముల నన్నిటిని వినియోగించిన పిదప నవి నిష్ఫలము లయ్యెనని విచారింప రాదనియుఁ బ్రియపుత్రిక భక్తిమై నాచరించెడి సపర్యల నందికొనుచు, మనుమరాలిని ముద్దాడుచుఁ బెద్దకాలము ధవళగిరియందు సుఖంబుండుఁడనియుఁ గోరుచు, సవినయముగ సెలవు గైకొనియెను. త్రివిక్రముని స్నేహ వాత్సల్యములఁ గొనియాడి, చిర పరిచయులగు కమలా భగవత్ప్రానుల నోదార్చుచు వారిని గనిపెట్టుకొని యుండుమని ప్రార్థించెను. పాపము గంగాధరుని మనోవిధియందు ప్రభాకరున కవకాశమే లేదు. నిరర్థకుఁడగు పిచ్చి ప్రభాకరుఁ డాతని కేల జ్ఞప్తికి వచ్చును. ?

సాయంతనమున మూఁడు గంటలకు - గంగాధరునిపై రక్తాక్షతలఁ జల్లుదురు! అసమయ మాసన్నమైన కొలఁదిని గంగాధరుఁడు ప్రాణరక్షణ క్రియాన్వేషణ మునకు విరక్తుఁడై నిర్వ్యాకులుఁడై, యేకాగ్ర చిత్తమున భగవద్ధ్యాన మొనర్చుటకుఁ బ్రయత్నించుచుండెను. కాని దారపుత్రికలను, వృద్ధుఁ

డగు మాామను, నెట్లాతఁడు హృదయమునుండి పాఱఁదోలఁ గలఁడు ? అయినను మధ్యాహ్నము పండ్రెండు గంట లగుసరి కాతనినుది కుదుటఁబడెను. వధ్యులగు నభాగ్యు లెల్లరు రెండు గంటలకె చెఱసాలలవద్ద బండ్లపై నెక్కి, నెమ్మదిగ వీథుల గుండఁ బ్రయాణ మొనర్చి, గమ్యస్థానమును నిర్ణీత సమయ మునకుఁ జేరఁ గలుగుదురు. గంగాధరుఁడు రెండు చేతుల జోడించుకొని నిలచి, మరణదేవతకు సాతసముతో నాలింగన మొనర్చు కొనుటకై నిరీక్షించు చుండెను.

ఒంటిగంట యగుసరి కాతని గది ద్వారమునకు వెలు పల నడుగుల చప్పుడు వినవచ్చెను. తాళము తీయఁబడినది.

శీఘ్రముగ నాద్వారముఁ దెఱచుకొని, ప్రభాకరుఁడు, పెదవుల యందలి లేనగవు ముఖమున కొకవింత సొగసుగము గూర్చ, నాతని కట్టెదుట నిలువఁబడి, ద్వారమును వెంటనే మూసివేసెను.

ఆతని ముఖము నూతన వికాసముతోఁ బ్రతిభాస మన్వితమై యుండెను. గంగాధరుఁ డదియొక పిశాచ మేమో యని భయపడఁ జొచ్చెను. కాని యాతని కంఠనాళముల నుండి వెలువడుధ్వని ప్రభాకరునిదే. ఆతఁడు చేతిని గట్టిగఁ బట్టుకొని యున్నాడు. పిశాచము కాదు!

'నేను నిన్ను జూడవత్తునని కలలోనైనఁ దలంచి యుండవుగదా '! యని ప్రభాకరుఁ డనియెను.

'నీవిచ్చటికెట్టుల రాఁగలిగితివని వితర్కించుకొనుచుంటివి. ఇప్పటికైనను నాకా సంశయము విడలేదు. నీవు కూడ బందీకృతుఁడవైతివా ?'

'లేదు లేదు. ఈ కారాగార రక్షకులలో నొకఁడు నాచేతఁ జిక్కినాఁడు. అతని సహాయము వలననే నేను నీయెదుటకి రాఁగలిగితిని. నేను నీభార్య యంపఁగా వచ్చితిని. నీ కాపె యొక సందేశ మంపినది'

గంగాధరుఁడు విన్నఁబోయిన మోము గొంచెము ప్రక్కకుఁ ద్రిప్పి, 'ఏమని ?' యని ప్రశ్నించెను.

'దాని యర్థమేమియో, నేనే దాని నెందులకుఁ గొని తెచ్చితినో విచారించుటకు నీకువ్యవధిలేదు. వానినిసమగ్రముగ విన్నవించుటకు నాకును వ్యవధిలేదు. నీ వేమియుఁ బ్రశ్నింపక నేఁ జెప్పినట్లు చేయుము—నీ పాదరక్షల నచ్చటవదలి ఇవిగో నా చెప్పులఁ దొడిగికొనుము.'

ఆ గదియందు గోడచెంతనే యొక కుర్చీ యుండెను. ప్రభాకరుఁ డతి త్వరితగతి నా ఖయిదీ నీడ్చుకొనిపోయి, యా కుర్చీపైఁ గూర్చుండఁబెట్టి, తన చెప్పులను విడిచివేసెను.

'ఈ నా చెప్పులఁ దొడిగికొనుము. ఆలసింపకుము.'

ప్రభాకరా, ఇచ్చటనుండి తప్పించుకొని పోఁ జాలము. ఈ కార్యము దుస్తరము. నాతోఁబాటు నీవుగూడ మరణింతువు అంతియే సుమీ. ఇది వట్టిపిచ్చి.'

'నిన్ను బాటిపోమ్మనిన నది పిచ్చియే కావచ్చును—కాని, నే నట్లంటినా? ఇదిగో, మన యంగరఖాలను మార్చుకొందము. నీ యుత్తరీయమును నా కిచ్చి, నా యుత్తరీయము ధరింపుము. ఇంతలో నీ కేశములు ముడివిప్పి, నాకుఁబలె విరియంబోసి యుంచెదను!'

వెనుకముందు లరయక యతి శీఘ్రముగ సుస్థిర సంకల్పుఁడగు ప్రభాకరుఁడు క్షణకాలములో నాతని దుస్తుల నన్నిటిని దీసి, తన దుస్తులఁ దొడిగెను. గంగాధరుఁ డాతని చేతులందుఁ గీలుబొమ్మవలె నుండెను.

'ప్రభాకరా! ప్రభాకరా! ఇది వట్టివెఱ్ఱి. ఇది దుస్తర మగు కార్యము. మనకు సాధ్యముకానిపని. అనేకపర్యాయము లిట్టి ప్రయత్నములు జరిగియుండినవి గాని యొక్కటియు సఫలీకృతము కాలేదు!'

'నీవు పాటిపోవచ్చునని నేఁ జెప్పితినా? ఈ కలము దీసికొని, యా బల్లవద్దఁ గూర్చుండి, యా కాగితముపై నేఁ జెప్పినట్లు వ్రాయుము.' గంగాధరుఁడు బల్లయెదుటఁ గూర్చుండి వ్రాయుచుండెను. ప్రభాకరుఁ డాతని నానుకొని వెనుక నే నిలచి చెప్పుచుండెను.



ప్రభాకరుఁ డేదియా పొట్లమువిప్పి, యందలి మందును జేతులం దుంచుకొని యా లేఖకుని ముఖమునఁ బూసెను.

ఒక్క నిముసములో గంగాధరుని వ్రేళ్ళలోనుండి కలము జాఱి పడెను. అతఁ డిటు నటుఁ జూచి, 'ఇది యేమి వాసన' యని ప్రశ్నించెను.

'నా కేమియుఁ గ్రొత్తవాసన తోఁచుటలేదే ? ఏమియును లేదు. కలము దీసికొని, వ్రాఁత ముగింపుము. శీఘ్రము! అతి శీఘ్రము ! '

స్మృతితప్పి పోవుచున్నవానివలె నాతఁడు గ్రుడ్లను దేల్చి, యతి దీనముగ ప్రభాకరుని జూచుచు, మరల లేఖనిఁ బూనెను.

'శీఘ్రము ! అతి శీఘ్రము ! '

గంగాధరుఁడు మరల నొకసారి వ్రాయ మొదలిడెను. ప్రభాకరుని హస్తము తటాలున నాతని నాసికా రంధ్రములఁ గప్పివైచెను. ఆమత్తుమందు దివ్యముగఁ బనిచేసినది. ఒక్కించుక సేపాతఁడు ప్రభాకరునితో - అతని సంరక్షణార్థము ప్రాణముల నర్పింపవచ్చిన ప్రభాకరునితోఁ - బెనఁగులాడి, యొకటి రెండు నిమేషములలో స్పృహదప్పి, భూమిపైఁ బడిపోయెను.

గంగాధరుఁడు విడిచిన దుస్తుల నన్నిటిని సత్వరమే ప్రభాకరుఁడు ధరించి, శిరోజముల దువ్వి ముడి వైచుకొనియెను. అంత నాతఁడు నెమ్మదిగ లోనికి రమ్ము!' అని పిలువఁగనే, గూఢచారి యగు రఘుపతి ప్రత్యక్షమయ్యెను.

ప్రభా:—చూచితివా ? నీకేమి కష్టమున్నది ?

రఘు:—ప్రభాకరా నీ వాగ్దత్తమునకు భిన్నము రాకుండు నెడల నాకేమి కష్టమును లేదు.

ప్రభా:—భయపడకుము ! మూఁడు గంటలు దాఁటిన పిదప నీకెట్టి హానియుఁ గలుగనే కలుగదు. దేవుని దయవలన మిగిలినవారెల్ల రాసమయమునకే యీపురిఁ బాసిపోఁ గలరు. ఎవరినైనఁ దోడు తెచ్చుకొని, నన్ను బండిలో నికిఁ జేర్పుము.

రఘు:— బెదరుచూపులతో 'నిన్నా ?' యని ప్రశ్నించెను.

ప్రభా: —అదియే అతనిని నేనుగా మార్చితినిగదా, అతనినే, మీరు నన్ను లోనికిఁ గొనివచ్చిన బహిర్ద్వారము గుండనే యీతని గూడఁ దోడ్కొని పోవుదురు గదా.

రఘు:— అవును.

ప్రభా:— నీవు నన్నులోనికిఁ దెచ్చునప్పుడే కొంచెము బల హీనస్థితియం దున్నటులును బయటకుఁ దీసికొని పోవునపుడు స్మృతితప్పి పడిపోయినటులును జెప్పుము' మిత్రసత్తముని యంత్య సందర్శనమున దుర్భరపరితాపము గల్గినదని చెప్పుము. ఇట్టి వనేకము లిచట జరిగియే యుండెనుగదా. నీ ప్రాణములు నీ హస్తగతములై యున్నవి. శీఘ్రము. ఆలస్యము నీకేవిషప్రాయము. తోడు పిలువుము !—నేను జూపిన గృహమున కితని దీసికొనిపొమ్ము. అచట బయలు దేఱుటకు సిద్ధముగ నొక బండియుండును. అం దీతని

గూర్చుండఁబెట్టుము. త్రివిక్రముఁ గలిసికొని, యాతనికి మత్తుదిగుటకై గాలియే తప్ప వేఱుమం దేమియు నీయవల దని చెప్పుము. నేను గత రాత్రి చెప్పిన దంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, వెంటనే శయనమై పొమ్మని చెప్పుము!

రఘుపతి బయటికేగెను. ప్రభాకరుఁడు బల్లపై మోచేతులుఁజూన్చి, యఱచేతులందు శిరమిడికొని, విచారముగ్నుఁడై నట్లు కూర్చుండి యుండెను. ఆ బ్రాహ్మచారి, యిరువు రను చరులతోఁ దిరిగివచ్చెను. వా రొక చిన్న సవారినిగూడ వెంటఁ దెచ్చియుండిరి. నిస్పృహుఁ జెంది పడియున్న గంగాధరు నందుఁ బెట్టుకొని. బుజములపై కెత్తుకొనిరి.

'రాణాప్రసాద్! ఇఁక నెంతో సే పాలస్యము లేదు' అని యా ఖయిదీని రఘుపతి హెచ్చరించెను.

'నాకంతయుఁ దెలియును. దయయుంచి నా మిత్రుని బహు జాగరూకతతో నింటికిఁ జేర్పుఁడు పొండు.' అని ప్రభాకరుఁడు బదులు సెప్పెను.

'సరియే పోదముఁరండు' అని రఘుపతి, యా గది తాళమును బిగించి, సవారిని దీయించికొని పోయెను. ప్రభాకరుఁడు కారాగృహమున నొంటరి యయ్యెను. గంగాధరుఁడు తప్పించుకొని పోవుచుండెనని యెవరైన ననుమానించిన, నల్లరి జరుగునేమో యని యాతఁడు ప్రతిధ్వని నాలకించుచుఁ గూరుచుండెను. ఎట్టి గల్లంతును జరుగలేదు. త్రిప్పి వట్టిన తాళ

ములు తెఱవఁబడుచున్నవి. తలుపులు కెఱ్ఱుమని ధ్వనిచేయు చున్నవి. దూరమున మనుష్యుల యడుగుల చప్పుడులు విన వచ్చుచున్నవి. అంతియేకాని, విపరీతమగు గడబిడ వినరాలేదు. ప్రభాకరుని మనస్సు కొంచెము కుదుటఁబడెను. ప్రశాంత చిత్తముతో నాతఁడు రెండు గంటలు కొట్టువఱకు వేచి యుండెను.

అపుడు, మరలఁ గారాగృహద్వారములఁ దెఱచు చున్న టుల ధ్వనులు వినివచ్చెను. వీని యర్థమాతనికిఁ దెలియును. కొంచెము సేపటిలో నీతని ద్వారముఁకూడఁ దెఱవఁబడియెను. ఒక యధికారి, చేతియందున్న జాబితాను జదువుచు, లోనికిఁ దొంగిచూచి, 'రాణాప్రసాద్ ! నావెంటరమ్ము' అని మాత్ర మనియెను. వాని వెంటఁబడి యాతఁడు విశాలమగు నొక చీఁకటిగదిలోనికిఁ బోయెను. అచట స్త్రీపురుషు లనేకులు గుమిగూడియుండిరి. కొందఱు కూర్చుండి చింతించుచుండిరి. కొందఱు శాంతముతో నిటునటుఁ బచారులు సేయుచుండిరి. కొందఱు మాత్రము బిగ్గరగ విలపించు చుండిరిగాని యట్టివా రెందఱో లేరు. ఎల్లరును మరణమునకు సన్నద్ధులై, యరథండ ములఁ దగుల్చుటకుఁ జేతుల నందిచ్చుచుండిరి. కృశీభూతాం గయై, నిర్జీవ ప్రతిమవలె నున్న పదునైదేండ్ల బాలిక యొకతె యాసనమునుండి లేచి, ప్రభాకరుని సమీపించి, తన శీతల హస్తము నందిచ్చి, 'రాణాప్రసాద్ ! మీతోఁబాటు కాళీదుర్గ

మునఁ బడియున్న పేద బాలికను మఱచితిరా ?' యని ప్రశ్నించెను.

'లేదు కాని నీ వే నేరమునకు నిర్బంధింపఁ బడితివో మఱచితి'నని ప్రభాకరుఁడతి హీనస్వరమున ననియెను.

'కుట్రలు ఇంకేమున్నవి ? నేనేపాపమెఱుఁగను. నా నిర్దోషత్వమునకు భగవంతుఁడేసాక్షి. ఐనను నిది నమ్మ శక్యమా ? అబలనగు నేను కుట్రలు పన్నితిననిన నెవరు నమ్మెదరు ?'

ఈ దీనాలాపము లాలించినపుడాతని హృదయము నీరయ్యెను. కన్నులనుండి యశ్రువులు రాలఁజొచ్చెను.

'రాణాప్రసాద్ ! నాకు జావన్న భయములేదు. కాని నే నేపాప మెఱుగనిదాననే, నాబోటి నిఱుపేదల కింత యన్నముఁ బెట్టనున్న యీ ప్రజా ప్రభుత్వమునకు నా మరణము వలన మేలు సమకూడునెడల, నేను జావున కొప్పుకొందును. కాని రాణాప్రసాద్! ఇది యేటిమాట! అబలను, నిఱుపేదను బాలికను, నా వలననా మేలుకలుగుట ! '

హతభాగినియగు నా బాలికపై ప్రభాకరునకు జాలి కలిగెను. ఆమె దురవస్థను గని యవసాన సమయమునఁ గూడ నాతని హృదయము దుఃఖభాజనమయ్యెను. ఇంకొక గంట కాలములో నీతని దుఃఖమును—బరితాపమును—వాయు ప్రపంచమున నదృశ్యములు కాఁగలవు !

'రాణాప్రసాద్, నీవు విడుదలఁ జెందితివని వింటినే. ఆ వార్త నిజమే యని చాల సంతసించి యుంటిని.'

'నిజమే, కాని, నన్ను మరలఁ బట్టుకొని, యీ శిక్ష విధించిరి.'

'రాణాప్రసాద్! నేను గూడ నీ వెంటనే వచ్చెదను. నీ హస్తముఁ బట్టుకొన నిత్తువా? నాకు భయము లేదుగాని నే నబలను. నాకుఁ గొంచెము ధైర్యముగ నుండును.'

ఆమె నెమ్మదిగ నశ్రుజలపూరితములగు కన్నుల నెత్తి యాతని ముఖలక్షణములఁ బరికింపఁగనే, తన గుట్టు నంతను గ్రహించెనని ప్రభాకరున కనుమానము దోఁచెను. వెంటనే యాతం డామె పెదవుల స్పృశించి, యామె మృదులహస్తమును నెమ్మదిగ నొత్తి 'అఱవకు' మనునట్లు సైగఁ జేసెను. ఆమె కీ వృత్తాంతమంతయు గ్రాహ్యమయ్యెను.

'ఆతని కొఱకు నీ ప్రాణము లర్పింప వచ్చితివా?' యని యా బాలిక రహస్యముగఁ బ్రశ్నించెను.

'ఉష్! అవును. ఆతని దారపుత్త్రికల కొఱకును.'

'అటులైన మహాశయా! మీ యభయహస్తమును నా కొసఁ జేయుఁడు.'

'సరియే ఉష్. అమ్మాయీ, తుదివఱకు—'

*   *   *   *

ఈ సమయముననే విక్రమపురప్రాకార పశ్చిమద్వార ముకడ, జోడు గుఱ్ఱముల శకట మొకటి నిలచియున్నది. అధికారులు రహదారి చీటులను బరీక్షించుచుండిరి.

శంకరభగవత్స్వాముఁడు, వైద్యుఁడు, విక్రమపురీయుఁడు.

కమల, ఆతని పుత్రిక.

విమల, ఆమె పుత్రిక.

ప్రభాకరుఁడు, న్యాయవాది, ధవళగిరి.

త్రివిక్రముఁడు, వ్యాపారి, ధవళగిరి.

ఆ ధవళగిరి న్యాయవాది మూర్ఛిల్లియున్నాఁడు. అధికారుల కెట్టి యనుమానమును గలుగలేదు. ప్రయాణికుల ప్రవర్తనలు సంతృప్తికరముగనే యున్నవి. ప్రాకారమును దాఁటుట కనుజ్ఞయైనది. రెండు గుఱ్ఱము లొక్కుమ్మడి ముందునకు దుమికి మహావేగమునఁ బరుగెత్తుకొని పోవుచున్నవి. ఆశకటమందలి ప్రయాణికులకును బ్రాణములు హస్తగతములై యున్నవి. విక్రమపురి వెనుకఁ బడినది. కాని యారాజ్యమును దాఁటిపోనంతవఱకు, వారికి బ్రాణాపాయము గలుగవచ్చును. మహావేగమునఁ బోవుచున్న యా బండిలోని ప్రయాణికుల కది యతిమందగమనమున సాగిపోవుచున్నటులఁ దోఁచుచుండెను. వారి మనోవేగమునకును, నశ్వవేగమునకు నంత వ్యత్యాసముగలదు. చెట్లులు, పుట్టలు, కాల్వలు, గట్టులు వెనుకఁబడుచున్నవి. ఒక గంటలో నా శకటము భవానీపురముఁ

జేరినది. గుఱ్ఱము లలసిపోవుటచేత మఱి రెండశ్వములా శకటము నకుఁ గట్టుచుండిరి. జనులనేకులు బండిచుట్టును మూఁగి కొనిరి. ఆపురమునఁ బ్రఖ్యాతుఁడగు భగవత్పాద భిషగ్వరు నొకఁ డానవాలుపట్టి, మహాసంతోషముతో నాతని గాఁగి లించుకొని, 'భగవత్పాదుఁడు, మనవైద్యుఁడు, వచ్చినాఁడు!' అని కేకలిడుచుండెను, బండి నిలుచుటకు వ్యవధి లేదు, విక్రమ పురినుండి యెవరైనఁ దఱుముకొని వచ్చుచున్నారేమో! బండి మరలఁ గదలినది. భగత్పాదుఁడు శకట గవాక్షములోనుండి తొంగి చూచుచు, స్వస్థానవాసులకు నమస్కరించుచుండెను.

భవానీపురము వెనుకఁబడినది. బహిరంగ ప్రదేశమున రాచబాటంబడి యాశకటము సహజవేగమునఁ బోవుచున్నది. ఓహో? ఈ కోలాహలమేమి? విభీతమనస్కులగు మన ప్రయాణికుల కర్ణపుటముల నాధ్వని జొచ్చినంతనే, వారి హృదయ పుట భేదనమైనది. రహస్యము బయల్పడినదాయేమి! సైనికులు వెంటఁబడి తఱుముకొని వచ్చుచుండిరాయేమి! సుమారొక యిరువదిమంది మనుష్యులు 'బండి నాపుఁడు! ఆపుఁడు!' అని బొబ్బలిడుచు, నతిత్వరితగతిఁ బరుగెత్తుకొని వచ్చుచుండిరి. వీరి చేఁజిక్కిన యొక్కని ప్రాణములైన దక్కవు!

గుఱ్ఱములు స్తంభించి పోయినవి. వెంబడించువారు ప్రజాసైనికులే యగునెడలఁ దప్పించుకొని పోఁజూచుట నిరర్థకము! ఆమనుష్యులు బండిని సమీపించిరి. వారిలో నొకఁడు,

ముందుగవచ్చి, యాయాసముచే నూపిరిచాలక, ధారాళముగ మాటాడలేక, 'ఇదుగో-ఇదిగో - కొరడా - మా వైద్యుని - గుఱ్ఱములు - తోలు - కొరడా - ఊరిలో - మఱచివచ్చితిరి - భగవత్పాదా - సెలవు. సెలవు' అనియెను. ఆహా! నిష్కారణముగ భయపడితిమి! బండి సాగిపోయినది. గండము గడచినది.

---

పంజ్రెండవ ప్రకరణము.

# ప్రాయశ్చిత్తము.

ఆ సమయముననే విక్రమపురియం దింకొక మూల నింకొక ఘోరకృత్యము జరుగనుండెను. భద్రావతి, క్రోధి, తృతీయ జంబుకుఁడును గలసి, యేదియో యాలోచించుకొను చుండిరి. వా రిపుడు సారాయంగడి యందు లేరు. కాళీదుర్గము నకుఁ జేరువనున్న కమ్మరి దుకాణమునఁ గూడియున్నారు.

భద్రావతి యిటులనుచుండెను. 'నా భర్త బహు ధైర్య వంతుఁడు. మంచి దేశభక్తుఁడు. ప్రజలకుఁ జాల మేలుచేసిన వాఁడు. అందుచేఁ జాల పలుకుబడి సంపాదించి యున్నాఁడు. కాని, యాయన కైనను, లోపములు లేకపోలేదు. ఈ వైద్యుఁ డన్నను నీతని కూఁతురన్నను, నా మగనికి మిగుల నభి మానము. నే నా వైద్యుని లక్ష్యపెట్టను. నా మగఁ డాతని పూర్వసేవకుఁడై యుండెను. కాఁబట్టి దయఁజూపినఁ జూప వచ్చుఁగాని, నా కాతనితో నిమిత్తమే లేదు. రాణావంశవృక్ష మును వేళ్ళతోఁ బీఁకివేయవలెనని నా పట్టుదల. ఇది నా మగనికి రుచింపదు. ఎట్లైనను ఈ వంశమును నిర్మూలముచేసి తీరెదను. భార్యయు బిడ్డలుఁగూడ మగఁడు పోయిన దారినే పోవలెను. ఖైదీలతో సైగలు చేయుచున్నదని ప్రమాణము

చేయుటకు, నీ కన్నారి సంసిద్ధుఁడై యున్నాఁడు. ఈ సాయంకాలమే వారి నేరమును విచారణ చేయుంపవలెను. లేకున్నఁ పాఱిపోదురేమో ?'

పిశాచస్వభావురాలగు భద్రావతి, యపుడే భగవత్స్వామిఁడున్న యింటికేగి, యచట కమల, ప్రియావియోగమును భరింపఁజాలక, భర్తను శిక్షించిన న్యాయాధిపులను ప్రజలను దూషించుచుండఁగా వినివచ్చిన, దోషారోపణ మొనరించుట సులభసాధ్యమగునని యూహించుకొనెను. భర్త ప్రాణములఁ దీయనున్న యీ సమయమున నామె యింటియొద్దనే యుండి, యేడ్చుచుండును. ఈ ప్రజాప్రభుత్వము న్యాయాన్యాయవిచక్షణ నెఱుఁగనిదని దూషించుచుండును. మన విరోధులపై సానుభూతి కలిగియుండును. నే నిపుడేపోయి చూచి వచ్చెదఁగాక !' అని యాపె యనుకొనెను.

తృతీయజంబుకుఁ డాపె దూరాలోచనమునకు మెచ్చుకొనుచు, "బలే! బలే!" యని యఱచుచుండెను. క్రోధి తలయూపుచుండెను.

భద్రా:—క్రోధీ! నీవు ముందుపోయి, వధ్యస్థానమున కెదురుగఁ బ్రథమపంక్తిలో నాకొక యాసన ముంచుము. ఈ దినమున నెక్కువ జనసమ్మర్దముగ నుండవచ్చును. నీవు తడవు చేయక వెంటనేపొమ్ము.

క్రోధి:—నీ వాలస్యము చేయవుగదా ?

భద్రావతి వీధిలోనికిఁ దిరుగుచు ఖయిదీలు రాక పూర్వమే నే నచటనుందునని' యఱచిచెప్పి, భగవత్స్వాముఁ డుండిన గృహముదిక్కై పోవుచుండెను.

కాలవైపరీత్యముచే స్త్రీ లనేకు లా దేశమున వికృత స్వభావలై భీకరకృత్యముల జంకులేక యొనర్చుచుండిరి. గాని యీ వనితయే వారికెల్ల శిరోభూషణము. ఈపె పేరుఁ దలఁచిన నెట్టిధీరునకైనను గుండెలదరక మానవు. ఈపె సంకల్పము లచలములు. ఈపె హృదయము గ్రావ్యసమానము. ఈపె కార్యపరత్వ మప్రతిమానము. ఈపె బాల్యముననే, దుర్మదాంధులగు ధనవంతులపై హృదయమున రగుల్కొనిన కోపాగ్ని తదనంతరము సంభవించిన విపరీత పరిస్థితులందుఁ బ్రజ్వలితమై, మహోపద్రవకరమై, దయాక్షిణ్యములను సద్గుణములదహించి వేసినది.

నిరపాయుఁడగు గంగాధరుఁడు పితామహులొనర్చిన దుండగములకుఁ బ్రతిఫలమనుభవింప వలసి వచ్చెనాయని యాపె యాలోచింపదు. ఆపె కనుల కగపడునది యా పూర్వికులే కాని, యాతఁడుగాఁడు. కమల భర్తృవిహీనయైనను, ఆపెకు సంతుష్టిలేదు. వారి కాశిక్ష లతిహీనములు. వారిరువురు నాపె కాజన్మ విరోధులు! ఈ రక్కసి యామేఁకలపై బలిఁ గొన్నది. అందుచే నవి బ్రదుకఁజాలవు.

ఆమె హృదయాంతరమునఁ గల్మషాశ్రయమగు పయ్యెదచాటున - నిట్టి దురాలోచనములు యథేచ్ఛగ విహరించుచుండెను. మలిన వస్త్రధారిణియగు నామె కుటిలకుంతలములపై దేశభక్తిచిహ్నమగు నెఱ్ఱని శిరోవేష్టము నిలచియుండెను పదనుగల కృపాణమొకటి రొండియందు గుప్తమైయున్నది. మందుకూరిన పిస్తోలొకటి యామె కంచుకము మఱుఁగున దాఁగియున్నది. ఈరీతి నాయుధధారిణియై యా వీరవనిత రాజమార్గమునఁబడి పోవుచుండెను.

ఈ సమయముననే మన శకటము విక్రమపురీప్రాకారమును దాఁటినది. గతరాత్రియందుఁ బ్రయాణసన్నాహమొనరించు నపుడు స్థూలకాయురాలగు భైరవి నెట్లాబండిలోఁ గొనిపోవనగునని త్రివిక్రముఁడు దీర్ఘముగ నాలోచించి యుండెను. ప్రయాణము నిరంతరాయముగఁ గొనసాగ వలెనన్న బండియందు సాధ్యమైనంత వఱకు బరువును దగ్గింపవలసి యుండెను. అంతేకాక ప్రాకారద్వారము వద్దను నింకితర సాంకేతిక స్థలములందును, నధికారు లొనర్చెడి పరీక్షలు శీఘ్రకాలములో సమాప్తి నందుచుండవలెను. నిరర్థకముగ నొక్క నిమేష మాలస్యమైన వారందఱికి బ్రాణనష్టము కలుగవచ్చును. అందువలన భైరవీ కాంచన లిర్వురు నొక చిన్న బండియందు మూఁడు గంటలకు బయలుదేరి మార్గమధ్యమున నా పెద్దబండిని గలిసికొని, శీఘ్రగమనమున ముందుగ సముద్రతీరమునకు

బోయి, ధవళగిరిఁజేర్చునావ నాయత్తపఱచి యుంచునటుల నిర్ధారణ చేయబడెను. ఈవిధమున భైరవీకాంచనులా ప్రయాణికుల కాటంకము కలుగఁజేయకుండుటయే కాక చాల సహాయ మొనర్చిన వారగుటకు వీలగుచున్నది.

ఇట్టి సహాయ మొనర్పఁగల్గుటకు భైరవి మెంతయు సంసించి యల్లే పయనమగుట కియ్యకొనెను. భైరవీ కాంచను లిర్వురు నా పెద్దబండి బయలుదేఱఁగాఁ జూచుచుండిరి. కిష్టప్ప తోడ్తెచ్చిన పురుషుఁడెవ్వరో వారెఱుఁగుదురు ఆ యజమానులకేమి కీడురాకుండుఁగాక యని యాపరిచారకు లిర్వురును దేవుని బ్రార్థించిరి. మూఁడుగంటలకుఁ బయనమగుటకు సన్నాహము చేసికొనిరి. భద్రావతి వీధులంబడి క్రమక్రమముగా నాగృహమును సమీపించుచుండెను.

భైరవి కిపుడొక యూహ తోచినది. ఆమె కాంచనునితో నిట్లనియెను. "కాంచనా మనమీ యింటివద్దనుండి బయలుదేఱ వలదు. ఇదివరకే యొకబండి యిచటనుండి బయలుదేఱి పోవుటవలన మన బండినిగూడ జూచినవారి కనుమానము కలుగదా? నీవేమందువు" కాంచనుఁడాలోచనాపరుఁడు గాఁడు. భైరవి యుద్దేశ్యము లన్నియు సమంజసములై నవియేయని యాతనికొక యపోహము. అందుచేనామె 'చెప్పిన దంతయు నిజమే' యని యొప్పికొని దేవాలయ ద్వారము సంకేతస్థానముగ నేర్పఱచి మూఁడుగంట లగునప్పటి

కాచోట బండితో సిద్ధముగ నుండుమని బైటికిఁజెప్పి యాతఁడు శకటాన్వేష ణార్థమై యరిగెను.

పది నిమిషములు గడచినపిదప, నరకంకాళ గ్రాసార్థమై శ్మశానము జేరిన పిశాచమువలె, భద్రావతి, యా ముఖ ద్వారముకడ బ్రత్యక్షమయ్యెను. భైరవి యామెను జూడఁగనే చకితయయ్యెను. భద్రావతి యా పరిచారికను వాఁడిచూపుల జూచి, 'రాణాప్రసాదుని భార్యయేది? ఎక్కడనున్నది?' యని యడిగెను.

తలుపులన్నియుఁ దెఱచి యుండెను. అందఱును బాఱి పోయిరని భద్రావతి గ్రహించినఁ గీడుఁగూడుట తథ్యమని భైరవి కపు డాకస్మికముగఁ దోఁచినది. ఆపె సత్వరమే యా ద్వార గవాటము లన్నియు మూసివేసెను. అంత కమల యుండెడి గదిగుమ్మమున కడ్డముగ నిలచెను.

అనుమానాస్పదములగు భైరవి చేష్టితముల రెప్ప వాల్పక చూచుచు, భద్రావతి కదలలేదు. భగవత్సాదుని కుటుంబముపై భైరవికి గాఢమగు నభిమానము కలదని యామె యెఱుఁగును. ఆపె కాకుటుంబముపై గాఢతరమగు దురభిమానమును, విద్వేషమును గలదని భైరవి యెఱుఁగును ఈ పరిచారిక యైనను సాధారణ యువతికాదు. ప్రియజన సంరక్షణార్థ మెట్టి దుండగ మొనర్చుటకైన నాపె సంసిద్ధ రాలై యుండెను.

భద్రా:— ఈ త్రోవనే పోవుచు, నామె నొకసారి పలుకరించి పోవచ్చితిని. నేనామెను జూడవలెను.

భైర:— నీ దురుద్దేశ్యములు నాకుఁ దెలియక పోలేదు.

వీరిరువురు నెవరి స్వభాషయందు వారు మాటాడుచుండిరి. కాని యొకరిమాట యింకొకరికిఁ దెలియుటలేదు. ఇరువురును బహు జాగరూకులై మెలంగుచు, ముఖలక్షణముల మూలమున దుర్గ్రాహ్యములగు మాటల యర్థము నెఱుంగఁ బ్రయత్నించుచుండిరి.

భద్రా:— నేనత్యావసరముగా నేనామెను జూడవలెను. ఇట్లని నీవు లోనికేగి యామెతోఁ జెప్పనైనఁ జెప్పుము. లేకున్న నీవు వారిలోనుండి తొలఁగి నన్ను లోనికిఁ బోనిమ్ము. నేనే పోయి చూతును!

భైర:— మీ చండాలపు భాషతో నాకుఁ బని కలుగునని కలలోనైన ననుకొనలేదు. కాని నీ కీరహస్యమంతయుఁ దెలిసిపోయినదా లేదాయని యనుమానముగ నున్నది ఈ ముండ చెప్పినదేమియు బోధపడుటలేదు.

ఒకరివంక నొకరొక నిమేషము వఱకు రెప్ప వాల్పక చూచుచుండిరి. మొదట భైరవి భద్రావతిని జూచినపుడా దుర్మార్గురాలెచట నిలువఁబడియుండెనో, యచటనుండి ఇంత వఱకుఁ గదలనేలేదు. ఆపె యిపుడొక యడుగు ముందునకు నడచి 'భిమగ్వారా! కమలా! విమలా! ఎవరు లోపల!

ఈదరిద్రపుముండ తప్ప నెవరున్నారాలోపల !' నని యెల్గెత్తి పిలిచెను.

సమాధానములేదు. రాజవీధికిఁ జాల దూరముననున్న యా గృహమున నొక్క శబ్దమైనను వినవచ్చుటలేదు. పక్షు లెగిరిపోయినవా యేమి ? ప్రత్యుత్తర మేమియు రాకుండుట వలన వారు తప్పించుకొనిపోయిరా యని భద్రావతి హృదయ మొక్కసారి విఘూర్ణమానమై పోయెను. ఆపెకు నిజమెఱుఁగ వలెననెడి యాతురత హెచ్చెను. ఆపె వికృత వదనము భయా నకమయ్యెను, కాని యాపెకుఁ గాలోచిత జ్ఞాన మంతర్హితము కాలేదు. తడవుసేయక, యాపె యింటిలోఁ బ్రవేశించి, రెండు మూఁడు తలుపులఁ దెఱచి గదులలోనికిఁ దొంగిచూచెను.

భద్రా:—ఈ గదులల్ల కల్లోలముగ నున్నవి. ఉపయోగకర మగు వస్తు వొక్కటైన నందులేదు. పనికిరాని వస్తువులు నేలపైఁ జిక్కుగఁ బఱచినట్లున్నవి. నీ వెనుక గదిలో నెవ రైన నున్నారా ? ఏది నన్ను జూడనిమ్ము !

ఈ తుదిమాటయొక్క యర్థము భైరవికి బోధపడినది 'చూడనీయను' అని యాపె సమాధానము కూడ భద్ర కర్థము కాకపోలేదు.

భద్ర:—ఈ గదిలో నెవ్వరును లేకున్న, నందఱును పాఱి పోయినట్లే. అయినను నెచ్చటికిఁ బోగలరు ? వారిని వెంబ డించి, పట్టి తెప్పించుటకు నాకు శక్తిలేదా ?

భైర:— ఈ గదిలో నెవరైన నున్నారో లేదో తెలిసికొను నంతవఱకు నేమిచేయవలెనో నీకుఁ దోఁపదు. నాకు సాధ్యమైనంతవఱకు నీకీ సంగతి తెలియకుండఁ జేసెదను. అది తెలిసినను, దెలియకున్నను, నా చేతులందు సత్తువ యున్నంతవఱకు, నిన్నిచ్చటనుండి కదలనీయను. మనమున్న యిల్లు రాజవీధికిఁ జాల దూరములో నున్నది. ఈ చుట్టు పట్టులందుఁగూడ నిండ్లు లేవు. మన పోరాట మెవ్వరును దెలిసికొనలేరు. నిన్నిచనుండి కదలకుండఁ బట్టి యుంచుటకుఁ దగిన శక్తిని దేవుఁడు నాకు బ్రసాదించెనా, మా కమలకుఁ బదివేలు. నీవిచట నెంతకాలము నిలచియుండిన, నంత మంచిది మాయమ్మకు.

భద్రావతి యాలసింపఁ దలఁపలేదు. ఆమె యొక్క మ్మడి కమల యుండెడి గదిలోఁ బ్రవేశింపఁ బరుగెత్తికొని పోయెను. భైరవి రెండు చేతులతో నామెనుగఁ బట్టియామెను. భద్రావతి ముందునకుఁ బోవబెనఁగులాడెను గాని, యా రాక్షసి పట్టు విడలేదు. ఆమె ప్రయత్నము నిష్ఫలమయ్యెను. భైరవి యామె కౌఁగిలి నొకించుకయు సడలింపక, పోరాడు చుండెను. భద్రావతి యామె ముఖమును గోళ్ళతోఁ జీఱి నాసికముపై గుద్దెను. కాని భైరవి తలముందునకు వంచి, జలములంబడి మునిఁగి పోవుచున్న వానివలె నడుముఁబట్టి విడుచుటలేదు.

ముష్టియుద్ధము నిష్ప్రయోజమని భద్రావతి తలఁచి కత్తికొఱకు రొండిని దడవు కొనుచుండెను. భైరవి, దీర్ఘ నిశ్వాసముల విడచుచు, 'అది నా చేతిక్రిందనే యున్నది. నీవు దానిని లాఁగఁజాలవు. దేవుని దయవలన, నాకు నీకంటె నెక్కువ బలమేకలదు. నీవో! నేనో, స్మృతి తప్పిపడి చచ్చు వఱకు నిన్ను వదలను' అనియెను.

భద్రావతి వెంటనే కంచుకమునఁ దడుముకొను చుండెను. భైరవి తలయెత్తఁగనే, పిస్తోలగపడెను వెంటనే యామెదానిని పేల్చెను. ఒక్కసారి భగ్గుమని మంటలేచి నది టప్పుమని ధ్వని యైనది. ధూమ్రసంక్షుభితయై కన్నులు గానక యామెయొంటిగ నిలువఁబడి యుండెను.

భద్రావతి కళేబరము నిర్జీవమై యామె పాదములచెంతఁ బడియుండెను.

* * *

భైరవీ కాంచనులొక చిన్నబండియందుఁ గూర్చుండి, విక్రమపురమును విడిచిపోవు చుండిరి. కాంచనుఁడు మిత్రు శాలిని బలుకరించెను గాని యామె కీతని మాటలు వినఁబడు చున్నట్లులేదు. కాంచనుఁడామె చెవియందు నోరు పెట్టుకొని యెంత యఱచినను, నామె నవ్వమగు సమాధాన మిచ్చుట లేదు. ఖయిదీల వధ్యస్థానమునకుఁ జేర్చు బాండ్లప్రళయ నినదము లామెకు వినఁబడుటలేదు.

‘ ఈబండ్లచప్పుడే వినఁబడక పోయిన నిఁక నీముందను ప్రపంచములో నేదియు వినఁబడదు’ అని కాంచనుఁడు విసుగు కొనెను.

నిజమే ఆపెకిక ప్రపంచమున నొక్క ధ్వనియైనను వినఁబడలేదు. ఆపె ముఖము నెదుట బెత్తెడు దూరములోఁ పిస్తోలు ప్రేలి యుండుటవలన నాపె జన్మాంతము వఱకును మహా బధిరయైపోయెను.

---

పదుమూఁడవ ప్రకరణము.

# రక్తాక్షతలు

ఆనాఁడు రెండుగంట లైనప్పటినుండియు, విక్రమపుర జనులందఱు, వీధుల కిరుపార్శ్వములు బారులు దీర్చి నిలిచి యుండిరి. మేడలెక్కియు, మిద్దె లెక్కియుఁ గోలాహల మొన రించుచు, నా దినమున వధింపఁబడు ఖయిదీలకొఱకు వారె దురు చూచుచుండిరి. రక్తాక్షతాలంకారముచేఁ బునీతులుం కానున్న యేఁబదియిద్దఱు ఖయిదీల నాఱుబండ్లలోని కెక్కిం చిరి. వానివెంట నడచి వచ్చెడి యాశ్వికభటుల ననేకులు ప్రజలు, 'రాణాప్రసాదుఁ డెందున్నాఁడు?' అని ప్రశ్నించుచుం డిరి. అతని నెఱిఁగియున్నవారు, చేతులందున్న యెత్తుటోపు లతో నాతని జూపించి, యితరులకుఁ దెలుపుచుండిరి. మూఁ డవబండి వెనుకప్రక్కను ప్రభాకరుఁడు శిరమువంచి, నిలచి యుండెను. ఆతనిచెంతనే యున్న బాలికతో నాతఁడేదియో మాటాడుచుండెను. జనసమ్మర్దములగు నా వీధులపై నాతఁడు దృష్టిఁ బఱుపుటలేదు. 'చావు! రాణాప్రసాద్! జమీందారు లందఱును బలి!' యనెడి యఱుపులనుగూడ నాతఁడు లక్ష్య పెట్టుటలేదు. ఆబాలికతో నాతఁడు నిరంతరము మాటాడు చునే యుండెను.

వధ్యస్థానమున మారణయంత్రమున కెదుట ప్రథమ పంక్తియందొక యాసనము మాత్రము ఖాళీగా నుండెను. తృతీయజంబుకుఁడును, జాలమంది యువతులును ప్రథమపంక్తి లోనే కూర్చుండియుండిరి. అచట మూఁగియున్న జనులందఱును, దేశద్రోహుల శిరచ్ఛేదనము విలాసార్థముగఁ గాంచఁ గుతూహల పడుచుండిరి. ఆ భయంకర దృశ్యము వారికి నేత్రానంద జనకమగును. క్రోధి తన యాసనముపై కెక్కి నిలచి, స్నేహితురాలికొఱ కెదురు చూచుచుండెను.

‘భద్రావతీ! భద్ర నెవ్వరైనఁ జూచినారా? భద్రావతీ!’

‘ఆమె యెప్పుడును దప్పిపోయెడిదికాదే’ యని యొక స్త్రీ యనెను.

‘ఇప్పుడు మాత్రము! భద్రయే తప్పిపోవునా? భద్రావతీ!’ యని క్రోధి మరల నఱచెను.

‘ఇంకఁ గొంచెము బిగ్గరగా’నని కొందఱు సలహా నిచ్చిరి.

కాని యింకెంత యఱచినను, భయంకర స్వరూపిణి యగు భద్రావతి మేలొ్కనఁజాలదు.

బాడ్లన్నియు గమ్యస్థానమును జేరినవి. మారణయంత్రము స్వచ్ఛంద విహారమునకుఁ గడంగెను. రాక్షస సమానలగు స్త్రీలెల్లరు, లోహితరక్తరంజితములగు శిరోఖండములను వరుసగ లెక్కించుచుండిరి.

మూఁడవ బండిలోనివారందఱు దిగివచ్చిరి. ప్రభాకరుఁ డిప్పటికి నాబీద బాలిక శీతల హస్తమును బట్టుకొనియే యుండెను. ఆపె స్థిరచిత్తముతో నాతని నుపలక్షించి, నిమీలిత లోచనయై, నమస్కారభావమును గుప్తముగ వెల్లడించెను.

"అయ్యా, మీరు లేకున్న నాకిట్టి మనశ్శాంతి యబ్బెడిది గాదు. నేను భీరుస్వభావురాలను. నిఱుపేద బాలికను. దేవుఁడు దయఁదాల్చి మీ పవిత్రప్రేమను నాకాధారముగఁ జేసెను."

"నీ పవిత్ర ప్రేమ నాకును నాధారమైనది. బాలా! నిశ్చలమతివై, తదేక దృష్టితో నావంకనే చూచుచుండుము. భయపడకుము"

"మీ పావన హస్తముఁ బట్టి, మీ ప్రేమామృతముఁ జవిచూచుచున్నంతవఱకు, నాకుఁ బరధ్యాన ముండదు. వారు శీఘ్రముగఁ బని ముగించునెడల, మీ చేయి వదలిన పిదప గూడ నిశ్చలమతితో నిలువఁగలను."

"వారతి శీఘ్రముగనే పని ముగింతురు. భయ పడ కుము."

నిర్భాగ్యులగు నా నిందిత సమూహము శీఘ్రకాలము లోనే పలుచనయ్యెను. ఆ బాలిక వంతు వచ్చినది. ఆతఁడాపె చుంచుకము దువ్వి, చేయి వదలించుకొనిపోయెను. ఆపె యధైర్యపడలేదు. అంత్య సమయము వఱకు నాపె ధీరయై నిలచెను

రక్తాక్షత లాపె శిరమునఁ జల్లఁబడినవి. రక్తసిక్తమగు నావె శిరోఖండ మిరువదిరెండవది యని స్త్రీలు లెక్కపెట్టిరి.

అంత ననేక కంఠములనుండి గుసగుసలు బయలు దేఱెను. ప్రభాకరుఁడాపె వెనువెంటనే వధ్యస్థానమున నిల చెను. రక్తాక్షత లాతనికి శిరోభూషణము లైనవి. ఆతని ప్రాణ బుద్బుదము విచ్ఛిన్నమైనది. ఇరువది మూఁడు.

* * * *

ఆ యవసాన సమయమున నాతని యుత్కృష్టాలోచన మును కోడీకరింపఁ గలిగిన, నది యిట్లుండెడిది.

'ఎక్కుచున్నాఁడ నెన్నఁడే నెఱుఁగనట్టి'
'దివ్యపీఠముఁబ్రియుల హృద్వీథియందు'
'చెందుచున్నాఁడ నెన్నఁడేఁ జెందనట్టి'
'యతుల స్వర్లోకవాస లభ్యప్రశాంతి.

---

# పరిశిష్టము.

ప్రభాకరుని మహా త్యాగమువలన, గంగాధరుఁడు పునర్జీవితుఁ డయ్యెను. శంకర భగవత్పాదుఁడు జామాతా పుత్రికలంగూడి ధవళగిరి రాజ్యమున స్థిరావాస మేర్పఱచుకొని జీవితాంత్య దినముల సౌఖ్యముగఁ గడపెను. ప్రభాకరుని పవిత్ర నామమును కమలా గంగాధరులతిభక్తితో నను దినము సంస్మరించు చుందురు. వారి యనుంగుఁబుత్రునకా వంశ రక్షకుని నామమిడిరి. ఆతఁడు న్యాయవాది వృత్తియం దత్యుత్తమపదవి నంది ప్రఖ్యాతుఁడయ్యెను.

విక్రమపుర రాజ్యమున రగుల్కొన్న దావాగ్ని, కాల క్రమమునఁ జల్లారినది. ప్రజా ప్రభుత్వము చిరస్థాయిగ నెల కొన్నది. అచిర కాలములోనే యా దేశపునర్నిర్మాణము ప్రారంభమయ్యెను. ప్రజాసౌఖ్యము హెచ్చెను. దేశము సస్య ఫల శోభితమై, మేధావంతుల కాలవాలమై, యిప్పటికిని సౌభాగ్యమునఁ దులఁదూఁగు చున్నది.

---

సంపూర్ణము.